# తొలిపలుకు

—o—

నాకును చిత్రపరిశ్రమకును గల సంబంధము పాఠకులకు విదితమే. కొన్ని సాంఘికచిత్రములను తీసి నాకు సంఘసంస్కరణ యందుండు అభిరుచిని తెలుపుకున్నాను. మరల నదే యుద్దేశ్యము యీ "ప్రతిష్ఠ" యను కథను కల్పించుటకు కారణము.

కొంత అనారోగ్యమువల్ల విరామమేర్పడి నందున ఆ సమయమున నీ కథకు నవలారూపము నిచ్చితిని. నవలా రచనకిదే నా ప్రథమ ప్రయత్నము. ఇందు నా కృషి ఎంతమాత్రము ఫలించినదో పాఠక మహాశయులే నిర్ణయింతురుగాక.

ఈ కథను పూర్తిగా చదివించి వినిన సాహిత్యైషియు, మనీషియు, విఖ్యాతకవియు, పైగా పెద్దయునగు శ్రీ తాపీ ధర్మారావు నాయుడుగారు దీనిని మన్నించి, ప్రచురించదగునని ప్రోత్సహించినందున అందుకు సాహసించితిని. శ్రీ నాయుడు గారికి నే కృతజ్ఞుడను.

విశాలాంధ్ర ప్రచురణాలయమువారు దీనిని ముద్రించినందుకు వారికి నేను కృతజ్ఞుడను.

ఇట్లు

డైరెక్టర్ వై. వి. రావు

# పరిచయము



వ్రాసినది శ్రీ వై. వి. రావుగారు; ప్రచురించినది విజయవాడ విశాలాంధ్ర ప్రచురణాలయం వారు; ఆదరించినది ఆంధ్ర పాఠకలోకం; మధ్యను గ్రంథప్రచురణకు ప్రోత్సాహం కలిగించానని నాకు పేరు! పేరు సంపాదించడం ఎంత సులభం!

నిజం! కథకు కాళ్ళున్నాయి. రావుగారు సినిమా చిత్రం తీయడానికి ఒక కథ తయారు చేసుకున్నారు. ఒక సందర్భంలో అది నాకు వినిపించారు. చూడగా అది తుంపుడు వాక్యాలలో కేవలం కథా గమనం చూపించే పద్ధతిలో లేదు. సరళమయిన భాషలో వ్రాసిన చిన్న నవలలాగా నాకు కనిపించింది. అది వారి ఉద్దేశం కాదని నాకు తెలుసును. ఈ అనువాదాల యుగంలో ఇలాంటి స్వతంత్రరచన కొంత ఉపశమనంగా ఉండదా అని అనుకున్నాను. రావుగారు సంస్కారం కలవారు; లోకానుభవమున్న వారు; అటు రంగస్థలం లోనూ ఇటు సినీమా రంగంలోను అందెవేసిన చేయి అనిపించుకున్న వారు; పాఠకుల ఆసక్తిని పోషించడానికీ, రసం పండించడానికీ, కావలసిన మెళకువలు బాగా తెలిసినవారు; కథా కల్పనలోను, సన్నివేశాలు కూర్పడంలోను, సంభాషణలు సక్రమంగా సాగించడంలోను, వారు చూపిన మెళకువలు మన కథానికా రచయితలకు కొంతవరకయిన ఉపకరించ వచ్చునని ఆశించాను. ప్రచురణ ప్రయత్నం చేదామాఅని విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి వ్రాశాను. వారు ఎంతో ఆదరంతో అంగీకరించారు. ఈ రూపంగా ఆంధ్ర మహాశయులు చదువుతున్నారు. రావుగారి కథ ఎలానడిచిందో చూదాం!

ఎలాగయితేనేమి; రావుగారు రచయితల రంగంలో ప్రవేశించారు. బాసికాలు కట్టుకొన్న వారికి రచనలో ఎన్నిటిలోనో కనబడని గుణవిశేషాలు ఈ గ్రంథములో పాఠకులు చూడగలరు. వెంకాయమ్మ, రంగనాయకులు నాయుడు, మునియాండి మొదలైన పాత్రలను రావుగారు చాల సజీవంగా సృష్టించారనక తప్పదు.

ఇలా ఉండడంచేత, దీనికి ప్రోత్సాహం కలిగించినందుకు నేనుగాని, ప్రచురించినందుకు విశాలాంధ్ర వారుగాని, చింతించవలసిన పని లేదు. రావుగారు తమకు చిత్రనిర్మాణంలేని తీరిక రోజులలో, ఇలాంటి కథలను వ్రాస్తూ ఉండాలనీ, వాటిని (సంధానానికి నా అవసరము ఉండదు కాబట్టి) విశాలాంధ్రవారు ప్రచురిస్తూ ఉండాలని కోరుతున్నాను.

మద్రాసు,
20–5–58.

తాపీ ధర్మారావు

# ప్రథమ ప్రకరణము

" ఇదేంది తిరుపతయ్యా! నీకేమన్నా మతి పోయిందా ఏమిటి? పనాడైనా కట్టానా నేను యీలాంటి నూలుచీర?" అన్నాది కంట తడిపెడుతూ వెంకాయమ్మ. "పంజెయ్యను తల్లీ! ఎంతో ప్రయాసపడి, నేను పూచీ వుంటానంటే యిచ్చాడు యీ నూలు సోగులవైనా ఆ నాగంచెట్టివాగబ్బాయి. ఈ కాలని కింతే సరి పెట్టుకోవాలి. ఏం చేయగలంమనం " అని ఓదార్చాడు గుమాస్తా తిరుపతయ్య. "పండగపూట అదీను, నీవే యీలా కంట నీరు పెడితే, ఇక కుఱ్ఱకారు సంగతే మౌతుంది? ఊరుకో" అని ప్రవేశించాడు భుజంగరావు పంతులు.

రాజా భుజంగరావు పంతులుగారిది బ్రతికిచెడిన కుటుంబం. సమృద్ధిగ స్థిరాస్తి, కొంచెంగ ఋణం, తన పకపుత్రుడైన భుజంగరావుకు చెప్పి స్వర్గస్థుడైనాడాయన తండ్రి. పెద్దలనాటి ఉద్యోగం చెయ్యడం నామోషి. అందుచేత సంపాదన లేదు. తండ్రి గతించేనాటికే పదేళ్ళ కొడుకు జోగారావు, ఐదేళ్ళ కూతురు విద్యావతి ఉన్నారు పంతులుగారికి. వెంకాయమ్మ గడపదాటదు పంతులు. ఇంట్లో ఏది కావలసినా ఆవిడ సరిఫర్తు లేక జరుగదు. ఇటు సూర్యుడటు పొడిచినా ఆమె తలపెట్టింది జరిపితీరుతుంది. లేపటిసంగతే ఆమె గారి కవసరం లేదు. ఆస్తంతా ఆరిపోతున్నా, హంగామా ఏ మాత్రం తగ్గరాదదు. కొడుకు బి.ఏ.బి.యల్ ప్యాసు కావాలి, కూతుర్ని మాంచి ధనవంతుడికివ్వాలి, అడేజావులు, బడేజావులు

పొంగోపొంగంగా నెరవేరుతుండాలి. మరిఆస్తి ఆరిపోతుందంటే పోదూ?

ఏమైతేనేం వెంకాయమ్మ కోర్కెలన్నీ వరసగ నేరవేర్చు కుంది. పదివేల కట్నం పుచ్చుకొని కొడుక్కి పెళ్లి జేసింది. ఆపద వేలు యిచ్చి పద్మావతిని, కాకినాడలో లింగరాజుగారి సుబ్బ, రాజు కిచ్చి పెళ్లి జేసింది. కోడలు అత్తగారింటికివచ్చింది మొదలు తుదకు, సుందరరావును ఆస్పత్రిలోకని, కాలమైపోయేవరకు, ఒక్కనాడైనా యింత సుఖపడ్డా దనేందుకు వీలేలేదా యిల్లా లికి. "ఆ అత్త చెఱతప్పి. సుఖానపడ్డాదా యిల్లాలు" అన్నారు ఊళ్లో అమ్మలక్కలంతా. ఏమైతేనేం యాభై య్యో పళ్లో మన మణ్ణి సాకవలసిన బాధ్యత వెంకాయమ్మకు సంభవించింది. జోగారావుకా ప్రాక్టీసు సున్న. రోజూ అమ్మనడిగి, అర్ధరూపాయి పుచ్చుకొని, పావలా యిచ్చి అద్దెబండ్లో కోర్టుకెళ్లి, మధ్యాహ్నం అక్కడ కాఫీహోటల్లో లెక్కరాసి సంపడి, సాయంకాలం క్లబ్బులో పేకాడి ఆ మిగత పావలా వోడుకొని, నిమ్మళంగా రాత్రి 8 గంటల కిల్లు చేరేవాడు. ఒకరోజు బండివాడు రెండు రోడ్లు కలిసేచోటికి బండిరాగా "ఏ కోర్టుకు పోనీ మంటారు బాబూ" అని అడిగితే "ఏదోవహ కోర్టుకుపోనీరా" అన్నాట్ట జోగారావు.

ఇంట్లో ప్రొద్దుబోయ్యేందుకు, అదృష్టసవాస్తు తగిల్తే ఒక లచ్చి తగిలేందుకు, సదా క్రాస్‌వర్డ్సు వేస్తూ వుంటా డాయన. కాని, నేటివరకు 5 తప్పులకు తక్కువెప్పుడు రాలేదు. గ్రహాచారం చాలక, తిరుపతయ్య వలలో జిక్కిన నిరక్షరకుక్షి, పల్లెటూరిపార్టీ ఎవడైనా జోగరావు ఆఫీసులోకి ప్రవేసించడం

తటస్థిస్తే, ఆ సమయాని కాయన క్రాస్ వర్డ్సుకు అర్థాలు డిక్షనెరిలో వెదుకుతూండడం, ఆ లావాటిపుస్తకాన్ని, ఏదో పెద్ద లా గ్రంథమని, ఆపార్టీ అనుకోవడం జరుగుతుండేది. ఒకమాటు లేక లేక చేజిక్కిన ఒక భరణం దావా, మునసబ్ కోర్టులో జోగారావుకు వ్యతిరేకంగా తీర్పు చెప్పడమైంది. ఆ సాయంకాలమే, ప్రఖ్యాత లౌటు కామయ్య వోడిపోయిన పార్టీ జాలయ్యను వెంటబెట్టుకుని, వకీలు పంతులు ఆఫీసులోకి ప్రళయ కాలరుద్రుని వలె ప్రవేశించాడు. ఆయనకు వకీలుపంతులుకు యీ క్రింది విధముగా సంభాషణలు జరిగినవి.

జోగ : చూడు, జాలయ్యా, ఓ యాభై రూపాయలిస్తే, ఆ డిక్రీకి, సాక్ష్యానికి, నకళ్ళుతీసుకొని, వెంటనే జిల్లా కోర్టులో అపీలు దాఖలు చేస్తాను.

జాల : ఇన్నావంటయ్యా కామయ్యా !

కామ : ఈ కోర్టులో యిహాలా చెల్లారింది. ఇంక అపీలుగ్గాక యీన్నే పెట్టుకోవాల్నా.

జోగ : తిన్నగా రానియ్యి మాటలు కామయ్యా.

కామ : చాల్లేస్తురు. యీపాదిగ కనపడ్డచోటల్లా, నా ప్రాణం కొరుక్కుతింటూంటే, ఏదో చూస్తావని ఒక కేసుయిస్తే క్రింది కోర్టులో ఫైలంతా నాశనంజేసి, యింకా పై కోర్టుకు పోతాడట.

జోగ : అరే. అదేమి టూహాంటూపు. మునసబు ఏదో అపోహపాలై మనకు వ్యతిరేకంగా తీర్పు చెప్పితే, జిల్లాజడ్జీకూడాను ఆలాగే చేస్తాడనేనా, లేక యింతతో కేసు ముగిసిపోయినట్టేనా?

కామ : నే జెప్పినట్టల్లా నీవావాదిని క్లోజ్ చేసుంటే మునసబు ఏనాడో కేసు కొట్టేశుండును. హరిశ్చంద్రుళ్లాగా మాట్లాడ్తు తూ ?

జోగ : చాల్లె; నోటి కొచ్చిందల్లా అడుగు తుంటే ఊరు కుంటూ రేమిటి కోరువారు ?

కామ : ఎదటొకీలు మాట్లాడుతుంటే, అసలునీకు నోరు పెగిలిం దంటయ్యా? పోనీ ఆర్గుమెంటు చూస్తామంటే "యువ రానర్ దివిడో, యువరానర్. దివిడో" అనటమేగాని, పైన మాటా స్టైగా, ఏనాడైనా పట్టుమని పదికేసులునడి పించుం టేగా!

జోగా: ఇక చాలించు కామయ్యా జాస్తి మాట్లాడితే మర్యాద దక్కదు.

కామ: మనకుంటేగా దక్కేందుకు— లే, జాలయ్యా కట్ట తీసుకోపోదాం.

అంటూ తనే కట్ట జవురుకొని జాలయ్యను లేవదీసుకొని వెళ్లాడు.

మరోమాటు తిరుపతయ్య, తనకు తెలిసిన సూరయ్య. ఒక పార్టీని వెంటబెట్టుకొని ఏదో క్రిమినల్ కేసు సంబంధంగా గుంటూరు రాగా,వారని మెల్లిగ వొప్పించి సూరయ్యకూపాతిక రూపాయలిప్పిస్తానని, జోగారావు కడకీడ్చుకొచ్చాడా పార్టీని. అక్రమంగా ఒక ఆడమనిషిని చెడిచాడని కేసు. వచ్చిన పార్టీ మేనల్లుడు ముద్దాయి. వాడు రిమాండులోనే వున్నాడు. బెయిలి ప్పించి కేసు నడిపేందుకు జోగారావు నడిగారు ఆయనగారు. తన ప్రభావం గొప్పగాచూపి ఎక్కువ ఫీజు గుంజవలెననే.

వుద్దేశంతో కాబోలు. తను మేజస్ట్రేటు కోర్టుకు భెంచి కోర్టుకు వెళ్లే వకీలు కానని, కావలెనంటే, సెషన్సుకోర్టుకు వస్తానని పైగ ఆ నెలంతా తనకు ఒక రోజుగూడ తీరుబాటులేదని, జిల్లా కోర్టులోనూ, పట్నంహై కోర్టులోను ఊపిరాడదని పనుందనీ, యీలాంటి సౌకర్యాలెన్నెన్నో కోశాడు. తిరుపతయ్య కూడ, వకీలుగారి వుద్దేశం గ్రహించి, సౌకర్యాలనందిస్తూవుండే వాడుకూడ. ఏలాగైతేనేం తుదకు సూరయ్య "ఆలా అంటే ఏలాపంతులూ క్రింది కోర్టులో ఫైలు గట్టిజేసుకుంటేగ మనకు పై కోర్టులో సులభంగ కేసెళ్లిపోవడానికి" అన్నాడు. ఇంతలో సూటుధరించిన మరొకవ్యక్తి సూరయ్య ప్రక్కన కూర్చున్నాడు. వారితో వచ్చిన వాడేనని జోగారావనుకున్నాడు "ఏమంటారు బాబు, ఫీజుసంగతొకమాటనండి" అన్నాడు సూరయ్య.

జోగా: ఇప్పటికి నేను మేజస్ట్రేటుకోర్టు గడపె త్రొక్కలేదయ్య, ఇన్నేళ్లుగ ప్రాక్టీసుచేస్తున్నాకూడ" అని తిరుపతయ్య వంకచూచాడు. అయన " చిత్తం చిత్తం అదేమోసత్యమే; కాని, వీళ్లు నాకు చాలా తెలిసినవాళ్లు. మీరే యీ కేసు కింద నుంచి పైదాకా జరపాలని, నామనవికూడ" అన్నాడు. మరి వీళ్ల వాయిదానాటికే జిల్లా కోర్టులోని మైనరుదావా ఫ్రండే. ఏంజేస్తామని వకీలనడం, వాయిదా కోరుకుందామని తిరుపతయ్య నడం—, ఆ వారసత్వం కేసు తాలూకు ఫీజు మిగత రెండు వేలూ పార్టీలు యిచ్చారా అని వకీలు, ఇంకా ఛేలేదని తిరుపతయ్య-హైకోర్టు అపీలు తాలూకు ఎంత ముట్టింది, ఇంకా ఎంత రావాలి అని వకీలు ప్రశ్న ? రూ. 1603—9—6 లు చేరిందని, యింకా రూ. 1500 లు బాకీ వుందని తిరుపతయ్య

జవాబు—అయితే ఆ మొత్తమంతా తెస్తేనేగాని, పట్నానికి రైలెక్కనని వ్రాయమని వకీలుగారాజ్ఞ యివ్వడం, ఆలాగే వ్రాస్తానని గుమాస్తాగారు వొప్పుకోడం, యీలాంటి శుద్ధాబద్ధాల ప్రసంగం కొంచెంనడిపారా వకీలు గుమాస్తాకలసి "విన్నావంటయ్యా ! నేజెప్పలా పెద్ద ఫైలుందీనకు" అన్నాడు సూరయ్యా తన మిత్రునితో. సూటుమనిషి సూరయ్యాతో "నెలకే మాత్రం వుంటుంది" అన్నాడు. "మూడు వేలకు పైన్నేనని గుమాస్తాగారే నాతో చెప్పారు" అని అన్నాడు సూరయ్యా. "అదంతా సరేకాని పదోవకటి తొందరగ తేల్చు సూరయ్యా" అన్నాడతని మిత్రుడు. ఈ కేసు ఏమైన సరే, మొదట్నుంచి మీచేతిమీదుగాన్నే నడవాలి పంతులు. అది తప్పదు గనుక, ఫీజు మాశేమో చెప్పండి. కోర్టుకెళ్లి ఆకుఱ్ఱాణ్ణి బెయిలు మీద యిడిపింతురుగాని" అని వకీలుతో అన్నాడు సూరయ్యా. "ఏదో నామాట విని పెద్ద మనసుచేయండి" అని సిపారసుచేశాడు, తిరుపతయ్యా. గుమాస్తా మాట త్రోసి వెయ్యలేక వొప్పుకున్నట్లు "అయితే వెయ్యి రూపాయలిచ్చు కోండి" అన్నాడు జోగారావు. "తూగలేంబాబూ" అని కక్షీదారుడంటూ తిరుపతయ్యా ముఖంచూచాడు "వేరే వకీలును చూచుకోండి" అన్నాడు జోగారావు. తిరుపతయ్యా సూరయ్యాను, అతని పార్టీని, బయటకి పిలుచుకొని పోయి "ఇదో ఆఖరు మాట చెప్తా ఆలాచెయ్యండి" అన్నాడు. "నీయిష్టప్రకారమే కాని" అన్నాడు సూరయ్యా "అయితే మూడు వందలు వకీలుకు, వందరూపాయలు నాకు రెండొందలు యిప్పుడిచ్చు కోటం, ఏమంటారు ?" అన్నాడు తిరుపతయ్యా. "అంతకు తగ్గదంటా ?" అన్నాడు కక్షీదారుడు. "దమ్మిడి తగ్గదు"

అన్నాడు తిరుపతయ్య. "సరే తప్పేదేముంది రెండొందలు తీసియ్యి" అని సూరయ్య స్నేహితుడితో అన్నాడు అతను పైకం సంచి బైటికి తీశాడు. ఇంతలో కూర్చొనియున్న సూటు మనిషి లేచి "నేను సెలవు తీసుకుంటాను" అన్నాడు పేపరు చదివే మిషతో క్రాస్‌వర్డ్సు ఆలోచిస్తున్న వకీలు "ఆ! మంచిది. మీరు వీళ్లతో వచ్చినవారేగా" అన్నాడు "కాదండి" అన్నాడతను. "ఓ! అయాంసారీ మీ కేసేమో చెప్పండైతే" అన్నాడు జోగారావు. "నా కేసేమి లేదండి నేను యిన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరును. వచ్చిన పనైంది వెళ్లుతున్నా" అంటూ వెళ్లాడు. దాంతో దిగాలుబడి కూర్చున్నాడు వకీలు. సూరయ్య యిచ్చిన రెండు వందలలో ఒక వందా యాభై తిరుపతయ్య జేబులో పెట్టుకొని, యాభై రూపాయలు పట్టుకొని "పంతులుగారూ! యిలా రండి" అని జోగారావును లోపలి వాకిట్లోకి పిలిచి "250 రూపాయలకు ఏర్పాటు చేశాను. యీ యాభై యిప్పుడిచ్చారు పుచ్చుకోండి" అని యిచ్చాడు. మరుమాట లేక పుచ్చుకొని "ఆసూటు మనిషి ఎంత మోసం చేశాడో చూశావా" అన్నాడు జోగారావు. "ఏం, ఏం జేశాడు?" అని అడిగాడు తిరుపతయ్య. అతను ఇన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరట. పొయ్యేటప్పుడు చెప్పాడయ్యా అన్నాడు జోగారావు. తిరుపతయ్య కాస్త యోచించి, "ఓరి పీడి ముండమొయ్యా! ముందే చెప్పకూడదూ? ఊః పోనీలేండి ఏం జెయ్య గలుగుతాడూ! ఇక్కడ నిజంగ యేమైనా ఉంటేగా అన్నాడు. అది సరేలే అంటూ జోగారావు యాభైరూపాయలు తీసుకొని బహుగర్వంగా తల్లికడ కెళ్లాడు. తిరుపతయ్య కక్షిదారుని కడ వకాలతులో సంతకం చేయించుకొని, "భోంచేసి కోర్టుకురండి.

పంతుల్ను పిలుచుకొని నేను వస్తా " అని పారెసంపెంచాడు. యాభై వేలు సంపాదించిన వానికున్నంత గర్వంతో ఒక స్పెషల్ నడకతోను, ఠీవితోను తల్లి కడకు వెళ్ళి, ఆ యాభై రూపాయలు తల్లి చేత బెట్టి "అమ్మా! యీడబ్బు నీయిష్టంవచ్చినట్లు ఖర్చు చేసుకో" అన్నాడు జోగారావు. ఆతల్లికూడ, నేటికసుంటే తన కొడుకు దశ తిరిగినదని, ఆనంద పరవశరాయై, పగటి కలలు కంటూ ఆ సంతోషంవల్ల పుట్టుకొచ్చిన, ఒక ఉత్సాహంతో "వంట త్వరగా కానీ, వకీలుగారు కోర్టుకు వెళ్ళవలెనట, ఏదోగొప్ప కేసుందట", అని అన్నపూర్ణమ్మకూ, "ఒరే! అప్పన్నా! మా చిన్న పంతులు కోర్టుకు శీఘ్రంగా వెళ్ళాలట, ఏదో పెద్ద కేసు తగిలిందట, ఆయన భోజనం చేసేసరికి బండి తెచ్చి సిద్ధంగా ఉంచు?" అని నౌకరుకు, ఒరే సుందరాయ్, మీ బాబుకు చలవ కోటు, షర్టు, పంచ తీసి, గుండీలు . అవి వేసి సిద్ధంగా ఉంచరాదూ? అలా దిక్కులు చూస్తూకూర్చోకపోతే?" అంటూ మనుమనికి ఆజ్ఞలుబెట్టి, తానూ ఏదో హడావిడిగా, ఆగదిలో నుంచి యీకూటంలోకి, కూటంలోనుంచి వంటయింటికి, వంట యింట్లోనుంచి నీళ్ళయింట్లోకి, ఊరక తిరుగ నారంభించింది. మేజస్ట్రేటుకోర్టులో విచారణ జరిగి సెషన్సుకు పంపారు ముద్దాయిని. వాడికేంతోచిందో ఒక రోజు వురివేసుకొని, యీ అపవాదంలోనుంచి తప్పుకున్నాడు. దాంతో కేసుఓడిపోయిందనే అవమానం జోగారావుకూ తప్పింది. "చచ్చినవాడి పెండ్లికొచ్చిందేలాభమ"న్నట్లు, మళ్ళీ పార్టీ కడ పుచ్చుకున్న పందరూపాయల తోకలసి రు. 150 లు వకీలుకు ముట్టినట్టయింది.

అప్పటికే స్కూలుఫైనలుప్యాసై, కాలేజీకి పొయ్యేందుకు డబ్బులేక చదువు మానుకొని యింట్లోకూచోనుండే జోగావురా

కొడుకు సుందరం తండ్రికిజరిగిన పరాభవం విని చాలా ఖిన్నుడై, ఆ రోజు భోజనాల సమయంలో "ఈపాడు వకీలు వృత్తికంటే, హైస్కూలులో ఒకమాస్టరీనో, అదీ కాకుంటే నలుగురి పిల్లలకు ప్రైవేటు చెప్పో, నాలుగురాళ్ళు సంపాదించకోడమో మేలు కాదా నాన్నా" అన్నాడు. అంతటితో తోకతొక్కిన త్రాచు లాగ బామ్మ రేగి, సుందరానికి ఇటీవల నోరు పెద్దదౌతుందని, పెద్ద చిన్న లేకుండా పోయిందని, తిని తిరిగ్గకూచోడం వల్ల పూర్తిగా చెడిపోయినాడని. "ఇంత బ్రదుకు బ్రతికి ఆఖరుకు ఘనుడివి నీవు పుట్టావని, ఒకరిచేతిక్రింద చాకిరికి పొమ్మంటావట్రా" అని, ఇంకా ఏమేమో భోజనాలు ముగిసేదాకా వాగుతూనే వున్నది. సుందరంమాత్రం తక్కువ తిన్నాడు గనుకనా మాటకు మాట సబబుగానే జవాబుచెప్తూండేవాడు వయసులో చిన్నైనా, ఊహల్లో పెద్ద. పసితనంలోనే కుటుంబకష్ట పరంపరలను చూడడం, అనుభవించడంకూడ సంభవించినందుసన తనకీగతి ఎందుకుపట్టింది అనే ప్రశ్నను తానే వేసుకొని, యోచించి, "పరువు ప్రతిష్ఠలను గురించిన అపోహలే తమ కుటుంబాన్ని యీగతికి తెచ్చాయనే" నిజాన్ని గ్రహించాడు. ఏ విషయంలోనేకాని అపోహాలపాలైన వారినిచూస్తే, సుందరానికి వొళ్లుమండుతుంది. "పేదరికం తప్పా?" మనకు బుద్ధిలేకపోవడంచేతనో, లేక వేదాంతులన్నట్లు, పూర్వకర్మ ఫలితంగానో పేదరికంవస్తే వొప్పుకొని తదను గుణ్యంగా ప్రవర్తించక, బడాయీలకుపోయి, ఏనుగు తనతలను తానే మన్నుకొట్టుకున్నట్లు నటించేవారినిచూస్తే వానికి బొత్తుగకిట్టదు. ఇందుచేతనే కోడి కూసిందిమొదలు, పిట్టలు గూళ్ళలోచేరేదాక, వానికి తండ్రితోను బామ్మతోను వాగ్వాదం తప్పదు.

కొంప గడిచేందుకు సదా బొమ్మవొంటిమీద నగ లొక్కటొక్కటిగ షరాబంగడికి పోతూంటాయి. తాము స్వయంగాపోయి అమ్ముకునేందుకు అభిజాత్యం గనక, తిరుపతయ్య చేతికివ్వడం, ఆ మహాశయుడు, వందరూపాయల సరుకు యాభై కిమించి పోలేదనిచెప్పి మిగతా యాభై తాను స్వాహాచేయడం, ఆ వచ్చిన యాభై రూపాయలను మూడు రోజులలో ముగించి మరొక నగ కెత్తువేయడం జరుగుతూంది పంతులుగారింట్లో. "ఈలా ఎంతకాలం! ఆ నాలుగు సొమ్ములు తీరిపోయిన తర్వాత ఏంజేస్తావు? ఆపని యిప్పుడే యెందుకు చెయ్యరాదు" అని సుందరం వాదం. తాతయ్యకేమో వానితత్వం నచ్చిందికాని, భార్యనుచూస్తే భయం అందుచేత మింగుకొని ఊరుకుంటాడు. జోగారావా తల్లి అదుపాజ్ఞలు మీరేవాడు కాకపోయె. పైగ కొడుకుమాటల్లోని సత్యం బోధపడ్డా, బాగా అలవాటుపడ్డ సోమరితనంచేత అతని బుద్ధికూడా మొక్కబోయింది.

దొంగచేతికి యిచ్చిన రెండువందలు చేసే జతగాజులను రు. 130 లకు పైనపడలేదని తిరుపతయ్య అమ్మి యింటికి సామానుతెచ్చేస్తే వారంగాక మునుపే నిండుకున్నాయంటుంది వంటలక్క అన్నపూర్ణమ్మ. కొత్తపేటలో కాపురముండే ఆమె కూతురి కొడుకు సుబ్బారాయుడు అడపదడప అమ్మమ్మ కడకొచ్చి వెళ్ళుతుంటాడెందుకా అని సుందరం నౌకరు అప్పన్నతోచెప్పి కాస్తఆచోకీ తీయుమన్నాడు. పుటిక్కిన పండుగరోజు పరమాన్నానికి చక్కెరలేదని వంటింట్లో అన్నపూర్ణమ్మ గోలబెడుతుంటే యింటిముందు షుమారు అర పీశ పంచదార గుడ్డలోమూటగట్టుకొని, మిటకరిస్తూ మెల్లిగ

బయటపడ్డానికి ప్రయత్నిస్తున్న సుబ్బారాయుడు, అప్పుడే[illegible] పట్టుబడ్డాడు. ఇంట్లోకిలాక్కొచ్చి నలుగురిముందూ నిలిపాడు. అన్నపూర్ణమ్మ మొహంతెల్లబోయింది. కాని, మరుక్షణమే "రంకునేర్చినమ్మ బొంకనేర్చాలి" అన్నట్లు ఏనాడో తనకూతురింటినుంచి చేబదులు తెచ్చిందని, వారంరోజుల క్రిందట తీసికెళ్ళమని పిల్లవాడికిస్తే వాడిక్కడ మరచిపోయి యీపూట తీసికెళ్లుతున్నాడని ఇంకా ఏమేమోవాగి, సుబ్బారాయుణ్ణి రెండు మొట్టి, ఒకఏడుప్పు ఏడ్చి, వెంకాయమ్మచేత ఊరడింపబడి, బావి దగ్గరకు స్నానానికి వెళ్ళింది. వెంకాయమ్మ ఊరుకుంటే మరి మాట్లాడేవారెవరు ? పంతులా "ఏనాడు కడతేరుతానా' అంటూ దినాలు లెక్కపెట్టుకుంటున్నాడు.

తాసిల్దారు వంటవానిలాగ, ఇంటి వాళ్లకు అభిగరించి, తను చిట్టి దగ్గరబెట్టుకొని నెయ్యో కుమ్మరించుకొని తినడం అలవాటుపడ్డ అన్నపూర్ణమ్మ కొద్దిరోజుల్లోనే పొట్టలుపూడి ముడితలూడి, రంగుమారి, గుండ్రంగా తయారై, నిజంగా నలభై యైదు నిండినా, ఏ ముప్పై యేండ్ల దానిలాగోవుండే ఆమెనుచూస్తే, భార్యావిహీనుడు జోగారావుకు అదోలాగుండేది. కాని అన్నపూర్ణమ్మకుకూడ వాళ్ళ ఋణాన పోదలచుకోక, ఏదోయింత పరామర్శతోనే జోగారావును విచారించు కుంటుండేది. కాని ఎంతకాలానికీ,ఆ పిరికిపంద వకీలువొట్టి మాటలరాయుడు మాత్రమేననిగ్రహించిన అన్నపూర్ణమ్మ కాతనిమీది అభిమానమంత అసహ్యంక్రిందికి మారింది. ఇక అటుతిరిగి యిటుతిరిగి సుందరం నోరుజేసుకుంటే "ఆమెపోతే ఉడకేసే దిక్కెవ్వత్తా" అంటూ ఒక ఏడుపేడ్చి

వాడినోరు మూస్తుండేది వెంకాయమ్మ. అన్నట్లు, పనాదైనా పోయిరాజవేయడమైనా నేర్చుకున్న పాపానపోలేదు వెంకాయమ్మ.

ఇదే ఒకమాటు ఎవరింటికో దక్షిణకు వెళ్ళి అపరాహ్ణానికి దేవతార్చనకు వచ్చిన ఆదిబొట్లు వినేట్టుగ "నిజంగ భక్తివుంటే స్వంతంగ యింత కృష్ణార్పణా అనుకుంటారుగాని, కూలివాడేడిస్తే పుణ్యమా పురుషార్థమా" అంటూ సుందరంకాస్తనోరు జేసుకునే సరికి, పంతులు గ్రహించుకొని, ఆ బ్రాహ్మడికి లెక్కఫైసల్ జేసి,తానే యింతచేయిచూపించడం మొదలెట్టాడు. అందుచేత ఒకమనిషికి, రోజూ రెండుపూటల భోజనం, నెలకు పదిరూపాయలు జీతం తప్పింది. తనకు తగలని విషయంగనుక వెంకాయమ్మకూడ దొంగకు తేలుకుట్టినట్లూరకుండి పోయింది. అదే వంటామె సంగతొచ్చేసరికి, ఆమెపోతానని బెదరించినప్పుడల్లా "పదోకుర్రవెధవ మాటలకేం పోనిస్తూ, వాణ్ణి జూచొచ్చావా, నన్ను జూచొచ్చావా" అంటూ సముదాయించేది. వెంకాయమ్మ, "ఎంతపెడితేనేం, ఎంత చేస్తేనేం కృతజ్ఞతంటూ యీ కాలపు నౌకర్ల కెక్కోశానా కనుపించదు" అని మళ్లీచాటుగ అంటుండేది. ఆమె అన్నట్టల్లా భోజనాలు ముగియగానే, మూలింటి హనుమాయమ్మగారింట్లో అమ్మలక్కల మీటింగుకు రోజూ అన్నపూర్ణమ్మ హాజరుకావటం, తిన్నయింటి వాసాలు లెక్కబెట్టడం, అనోటాఅనోటా ప్రాకి పంతులు గారింటిబ్రతుకు ఊరంతా ప్రచారం కావడం జరుగుతుండేది.అన్నపూర్ణచరిత్ర,తిరుపతయ్య పురాణం పూసగ్రుచ్చినట్లు, అప్పన్న చెబుతూ ఉండేవాడేకాని, వాడిమాట, సుందరంమాట వినేవారేరీ ఆయింట్లోకాకపోతే, పజన్నానో పంతులకు ఋణపడి, జీతంముట్టినా ముట్టకపోయిన.

మూర్తీభవించిన విశ్వాసం గనుక, సొంతయింటిలాగా భావిం చుకొని సబ్బందు చాకిరిచేస్తూ పడియున్నాడా అప్పన్న. తిరుపతయ్యకూడ యింకా ఊడకుండ వుండడానికి, కారణంలేక పోలేదు. ఇంతకాలం ఒక్కొక్కటిగ వెంకాయమ్మగారి నగలు, రొఖ్ఖానికిరొఖ్ఖం, సామాన్లకు సామాన్లు, అమ్ముకురావడంలోనూ అప్పులుతేవడంలోను, కమీషనులు తనయిల్లు చేరినా, ఇంకా డెల్టా క్రింద పంతులుగారి యాభై ఎకరాల మాగాణి ఒక దోవ్వై తేనేగాని, ఆయింట్లో ఆయనజీవిత కార్యక్రమ శేషం ముగిసినట్లు కాదు. అందుకూ ఒకయెత్తు యెత్తాడు తిరుపతయ్య. సాధారణంగ పంతులుండేస్థితికి దిగిజారిన ప్రతిమనిషీ సులభంగా పెద్ద గంటు చిక్కించుకునే మార్గాలను వెదకడం సహజం. అంచేతనే క్రాస్‌వర్డ్సులో, ఏ నాలుగైదు మొదటి బహుమతులో, గుఱ్ఱప్పందాల్లో ఏ ట్రిబులీవెంట్లో, లేక ఏగనిగుంటో దొరకకూడదా భగవంతుడా అని ప్రార్థించే సోమరిపోతుల సంఖ్య రోజురోజు హెచ్చుతూఉంది. ఈ రహస్యాన్ని గ్రహించిన తిరుపతయ్య పంతులుగారని, మైకాగనిలోకి దింపేందుకు పథకమంతా తయారుచేశాడు. ఆమాగాణిపైన అడుమానపుబాకీ అసల్ ఫాయిదాలు సుమారు 30 వేలకుంది. నేడోరేపోదావా పడే ట్టుంది. ఇదే సమయమని దాన్ని అమ్మించి, అప్పుతీర్పించి, మిగతా 50 వేలు గనిలోపోయించాడు. నిజంగా అంతడబ్బూ గనిలో పడలేదులేండి. ముప్పాతిక మొత్తం, వైద్యభాగం అన్నట్లు, తిరుపతయ్యగారి తిరుమాళిగ చేరింది, కాని. ఏవో గనిలో పనిమాత్రం చాలా ఊకంగా జరుగుతున్నట్లు రోజూ కబుర్లు తెప్పించేవాడు. ఆకబుర్లువిని, "ఏనాడు సరుకు పడుతుందా, దాన్ని ఏనాడమ్మి లతులుబ్యాంకులో వేస్తామా"

అని పగటి కలలుకంటూండే వారు పంతులు, వెంకాయమ్మ, జో గారావుకాని ఇది తిరుపతయ్యగారి ఆఖరుపాచికని సుందరానికి," అప్పన్నకూమాత్రం పూర్తిగా తెలుసు.

ఒక రోజు కాకినాడనుండి పద్మావతి ఉత్తరం వ్రాసింది. వెంకాయమ్మకు. తిరుపతయ్య చించి చదివాడు.

"మహాలక్ష్మీ సమానురాలైన తల్లిగారికి మీకుమార్తె పద్మావతి సాష్టాంగ నమస్కారములు చేసి. చేయంగల విన్న పములు ఉభయకుశలోపరి తర్వాత॥—— దీపావళికిమీరు నన్నూ మీ అల్లుణ్ణి పిలిపించుకొని పండుగచేసి, కట్నాలు కానుకలు పెట్టిపంపలేదని రోజూ పొద్దస్తమానాలు, మిమ్మల్ను మా అత్త గారు ఆడిపోస్తూవున్నది. భోగినాడు చి॥ లలిత పుట్టిన దినం గదా ! ఆవిషయమై యీక్షణంవరకు మీఅల్లుడుగాని, వియ్యాల్రాలుగాని, అనుకున్న పాపానకూడ పోలేదు, ఆమాటనేనెత్తితే నాకు మీకు ఎన్ని శాపనార్ధాలు తలుగు తాయో అని భయబడి ఊరకున్నాను. ఇక ఆనాటికి వీరేమి వెలగిస్తారో చూడాలి. చి॥ లలితవాళ్ల బావను కలవరిస్తూంది. నాకు మిమ్మందరిని చూడాలని చాలా ఆశగావుంది. సదా కళ్లలో మెదులు తున్నారు. వీలుండి చార్జీలకేమైనా పంపితే బయలుదేరివచ్చి ఓ పదిరోజులైన యిక్కడి చెఱతప్పి హాయిగా వుందామను కుంటున్నాను. నాన్నగార్కి, అన్నయ్యకు నమస్కారములు చెప్పేది. చి॥ సుందరంమొదలగు పిన్నలకు ఆశీర్వాదములు చెప్పేది. యావన్మంది క్షేమములు వెంటనే తెలిపేది. ఇంతే సంగతులు. అనేక నమస్కారములు.

ఇట్లు
మీ కుమార్తె పద్మావతి

ఇది విన్నవెంటనే "తిరుపతయ్యా ! ఏమైనచేసి దానికో యాభై రూపాయలు వెంటనే మణియార్డరుచేసి పండుక్కో రమ్మని వ్రాయి" అన్నాది వెంకాయమ్మ. తిరుపతయ్య మిటకరిస్తూ ఊరుకున్నాడు. "ముక్తాధాన్యం అమ్మిన పైకమంతా అయిపోయించా" అన్నదామె. "వడ్డీకి, సిస్తుకే తక్కువడెనే తల్లీ" అన్నాడాయన "సరే యీారవలవుంగరం అమ్మి వచ్చినంత వరకు తీసుకొనిరా" అని వుంగరం తీసిచ్చిపంపింది. మామూలు ప్రకారం వుంగరాన్ని యింటికిచేర్చుకుని, తనచే 150 రూపాయలు తెచ్చియిచ్చి అందులోనుంచి యాభై రూపాయలు పద్మావతికి మనియార్డరుపంపాడు తిరుపతయ్య.



# రెండవ ప్రకరణము

గాదెక్రింది పందికొక్కులాగ పంతులుగారిల్లు దోచిన తిరుపతయ్య, కడుపునిండా తినటానికిగానీ వొంటినిండ తొడగటానికిగాని నోచుకోలేదు. కడుపునొప్పి రోగంతో సోడాఉప్పు నీళ్ళు తాగుతుంటాడు. నిత్య దరిద్రుడిలాగ, చింపికోటు, మాసిన చీరలాంటి తలపాగ, మోకాళ్ళ పైకొక అరుమూళ్ళపట్టి పంచ, ధోవతికట్టు, కమ్ములువిరిగిన పాతగొడుగు తాను అపర దరిద్రదేవతలాగ ప్రత్యక్షమౌతాడు రోజూ పంతులుగారింట్లో తెల్లవారేసరికి. ఇక యింట్లో చూస్తామా అంటే భార్యపోయి 15 ఏళ్ళయింది. 16 ఏళ్ళొచ్చిన, 3 అంగుళాల మందం నాలుకతో, నంగిమాటలు మాట్లాడుతు చీమిడిముక్కుల సిద్ధప్పలాంటి, ఏక పుత్రుడు, పేరు మోహనరావు. ఇంత ఉడకేసి పెట్టేందుకు వదినెగారు, పూర్వసువాసిని దుర్గక్క. ఆమె ఊరికంతా దుర్గక్కలెండి. ఆమె కొడుకు 20 యేళ్ళ రామన్న. దుర్గక్క తిరుపతయ్య సంబంధం ఊళ్ళో ఒక మోస్తరుగ అనుకున్నా. రామన్నమాత్రం చురుకైన కుఱ్ఱాడని ప్రఖ్యాతి. అందుచేతనే, వానికొక పుస్తకాలంగడి పెట్టించి, దానిమీద వచ్చేలాభంతో జీవనంచేస్తూ పంతులుగారి సేవచేస్తున్నానని చెప్పుకునేవాడు తిరుపతయ్య. కాని ఆమాటలు నమ్మిన వారెవరూ లేరులెండి. అది ఎలాగున్నా, మోహనుడి కొకపిల్లను తెచ్చికట్టి ఒకయింటివాణ్ణి చెయ్యాలనే ఆత్రంమాత్రం అధికంగఉంది తిరుపతయ్యకు. అందుకనే పాలఘాటుబేరం పెట్టాడాయన. ఒక పెళ్ళిళ్ళపేరయ్య

తగిలాడు. అమ్మణ్ణిఅనే 15 యేండ్ల చిన్నదాన్ని అయిదువేల రూపాయలకు కుదుర్చుకున్నారు. మూఢాలు, శూన్యమాసాలు వెళ్లినతర్వాత ముహూర్తం జరిపించేటట్టు వ్రాసుకొని వెయ్యి రూపాయలు రహస్యంగా సంచకరువుకూడ యివ్వడమైంది. దీనినిబట్టి తిరుపతయ్య ఎటువంటి వ్యక్తో పాఠకు లూహింతురు గాక.

---

# మూడవ ప్రకరణము

పద్మావతమ్మ కుటుంబం విషయం రెండుముక్కలు తెలుసుకుందాం. సుబ్బరాజుగారు బంగారు పిచ్చుకనే చెప్పాలి. పది తరాలు కూచోనితిన్నా తరగని పిత్రార్జితం, ఊళ్లో యాభై వేలు వడ్డీకిమారడం, రేవులో రెండుపడవలు, ఇంట్లో అమ్మ మీద భార్య మీదయాభై వేలదాకానగన్రట, పదో ఫస్టుగ్రేడైనఅయితే మరో ప్లీడరుకు డబ్బిచ్చుకోకుండ, తన సొంత కేసులు తానే వాదించుకోవచ్చుననుకొని చాలాశ్రమపడ్డాడుసుబ్బరాజు. కాని దానితస్సదియ్య ఎన్నిమార్లు పరీక్షకు కూచున్నా, ఎఫ్.ఏ. ప్యాసైతేగా. మొదటి యాడాది కాలేజీవారే పరీక్షకు పంపలా. రెండో మాటు రెండుభాగాలు పోయాయి. మూడోమాటు రెండో భాగాన్ని మెల్లిగ లాగేశాడు. మూడోమాటు షేక్స్పియరు నాటకం మారడంచేత తప్పానన్నాడు. అదే మర్చంటు ఆఫ్ వెనిసు మరుసటి యాడాది వుండటంచేత, ఆసారి తప్పకదాటేస్తానన్నాడు. రాత్రింబవళ్ళు కష్టపడి నాటకమంతా కంఠస్థం చేసుకున్నాడు. పరీక్షల్లో అన్ని పేపర్లు చక్కగా వ్రాశానన్నాడు. నాటకంలో ఫస్టుమార్కులుకూడా రావచ్చుననుకొన్నాడు. ఎంతోసరదాగా వుండిపోయాడు.

ఒకనాడీ పరీక్షఫలితాలు పేపర్లో పడ్డాయి. అందరికంటే ముందుగా క్లబ్బుకువెళ్లి పేపరు వచ్చేవరకు వేచియుండి, రావడంతోటే నెంబర్లుండే కాగితాన్ని పైనించి క్రిందివరకూ గాలించాడు. ఎక్కడ తననెంబరు కనపించలా. మళ్ళీ వెతికాడు. ఊహూ. కళ్ళేమో మసకలుకమ్మి

నట్లు తనకే భ్రమకలిగి క్లబ్బు గుమాస్తానుపిలిచి తన నెంబరుం దేమో చూడమన్నాడు. అతడుకూడా వెతికి లేదని పెదిమలు విరిచాడు. తలవంచుకొని తిన్నగ యింటికొచ్చాడు. ప్యాసైన మిత్రులిద్దరు విచారించడాని కొచ్చారు. తమకంటే అధికంగా కష్టపడి చదివిన సుబ్బరాజు పరీక్ష ఎందుకుతప్పాడాఅని వారికే అర్థంగాక పరీక్షాప్రశ్నలన్నిటికి ఏమేం జవాబులు వ్రాశావో చెప్పవోయి అని సుబ్బరాజు నడిగారు. నాటకాన్నంతాబట్టీపట్టిన వాడుగనుక,తను వ్రాసిందంత చిలకలాగ వొప్పజెప్పాడు. కాని షేక్స్పియరుకు షైలాకు, షైలాక్కు షేక్స్పియరు చెప్పసా గాడు. దీనిని గుర్తించిన మిత్రులు "యీలాగే వ్రాశావా పరీక్షలోకూడా" అని అడిగేటప్పటికి, సుబ్బరాజుకు తనతప్పు తనకు గుర్తుకొచ్చి పెదిమలు కొరుక్కున్నాడు. మరుసటి సంవత్సరం మళ్లీపరీక్షకు కట్టమన్నారు కాని, పుస్త కాలన్ని మారాయనివిరమించుకున్నాడు. పైగా పలుమారీ పరీ క్షలకు డబ్బు దండగ చేయడం అతనికి బాధాకరంగానే వుండేది. కాఫీ హోటళ్ల మీదగాని, సినిమాలు, నాటకాల కని కాని, తుదకు స్వంతడ్రస్సు మీదకూడ అతడు ఖర్చు చేసేవాడు కాదు. తండ్రిపోయి పదేండ్లైనా పెద్దలు సంపాదించింది పాడు చేశాడనే అపఖ్యాతికి పాలుకాగూడదని, దర్జీవాని చేతికిచ్చి తండ్రిగారి కోట్లు, షర్టులు, అన్నీ తన కొలతకు సరిగ్గా మరా మత్తు చేయించుకొని వాడుకుంటున్నాడు సుబ్బరాజు. కాఫీ హోటల్లోకి ప్రవేసించిన పాపానపైనా పోలేదా మానవుడు. ఉదయం యెనిమిది గంటలయ్యే సరికి తృప్తిగ ఆవకాయ వేసుకొని చద్ది భోంచేసేవాడు. అతనికుండే వ్యసనమల్లా,

రోజూ సాయంకాలం క్లబ్బులో టెన్నిసాడడ మొక్కటే. కొడుకునుచూస్తే తల్లి రామలక్ష్మమ్మకు చాలాతృప్తి.

తనపూర్వ పుణ్యఫలమే సుబ్బరాజని ఆమెయిరుగుపొరుగు వారితో అంటూండేది కూడాను. తనుకూడ కాపురంలో బహు జాగ్రతగల మనిషనే ఖ్యాతిగాంచింది. భర్త పొయ్యేనాటికి మేజ రైన సుబ్బరాజు కడుపునబుట్టి కొడుకైనా, ఏకాలాని కెవరికేం బుద్ధి పుడుతుందోనని, ఆస్తంత తనపేర వ్రాయించుకుంది. అయితే యీ విషయం తన కొడుక్కుతప్ప, మరోప్రాణికి తెలియకుండ వుంచిందిలెండి. భర్త కొచ్చిన జబ్బుకు "పట్నం జనరల్ ఆస్పత్రిలో క్రొత్తరకం చికిత్సచేసి నివారణ చేస్తున్నా రని" డాక్టర్లు చెప్పినాకూడా " ఈ జబ్బొచ్చి బ్రతికిన వారిని నే చూడలేదని" అంటూ తనే ప్రచారంచేసి, పట్నంపొయ్యే ఖర్చు తను దక్కించుకొని బ్రదికియింకా ఆసంసార బాధ లను భవించాల్సిన కష్టం భర్తకు తప్పించిందీ పుణ్యవతి. భర్తతో బాటు ఆమెకు పోయిందల్లా మొహంమీద చిటికెడు కుంకుమ, తల్లోని నాలుగుపూలు, మొళ్లోని మూరెడు తాడు మాత్రమే. పాతికవేల రూపాయల సొమ్ముగాని, పెద్దాపురం పట్టుచీరలు గాని, కంచికొర్నాడు చీరలుగాని, వెంకటగిరి సరిగె చీరలుగాని, ఆమెను విడనాడలేదు. దొంగలబాధ జాస్తైంది. గనుక అవుండే తృణం వొంటిమీదనే వుంటే భద్రమ"నేది రామలక్ష్మమ్మ. వాకిలి చిమ్మి చల్లిపొయ్యేందుకు నెలకొక అర్ధరూపాయమాత్రం, పని పనిషికిచ్చి, మిగత సకల చాకిరి కోడలచేత చేయిస్తూ తనూచేస్తున్నట్లు నంటించేది.ఇరుగుపొరుగు వారితో యిచ్చకాలు పలికి వారిచేత పనులు చేయించుకోవడంలో ఆమె బహుజాణ.

ఇంటిచాకిరి తోనూ, బిడ్డను సముదాయించటం తోనూ దినమంత గడిచి పోతూండడంచేత, పద్మావతికి తను నేర్చిన కుట్లు పనులు వగైరా మరచిపొయ్యేస్థితి సంభవించింది. అప్పటికీ యిరుగు పొరుగు అమ్మాయిలు, ఆచిత్ర విచిత్రపు పనులు నేర్చుకునేందుకు, మధ్యాహ్నంవేళ పద్మావతి కడ కొస్తుండిన కారణంచేత, ఆమెకు ఆ పనులయందలి సరదా యధాప్రకారంగానే వుంటూంది. ఇంట్లో ఏ గోడనిజూచినా, చమ్కీపటాలు, పూసల్తో కుట్టబడిన ముగ్గుల పటాలు, క్రాస్ స్టిచ్చితో కుట్టబడ్డ బొమ్మలు,వాకిళ్లకంతా గాజు గొట్టాల స్క్రీనులు, బల్లలు మేజాలపైనంతా తెల్లదారంలో అల్లిన బట్టలు, దిండ్ల గలీబులన్నిటిపై రంగు రంగుల డి. యం. సి. దారాలతో వేయబడిన చిత్రవిచిత్రమైన పూలు. అన్నీ పద్మచేతిపనులే. వచ్చి చూచిన వారందరికి "ఇవన్నీ మా కోడలు వేసినవేనండీ" అంటూ ప్రగల్భాలు కొట్టేది అత్తగారు. "ఇవన్నీ మాపుట్టింట్లో ఉన్నప్పుడు వేసినవేనండీ" అంటూ తన అత్తింటి వారు, ఒక్క అణా పూసలుగాని, అర్ధణా దారంగాని యివ్వలేదనే నిజాన్ని తెలియజేస్తూ వుండేదిపద్మ.

ఒకరోజు తల్లిపంపించిన యాభై రూపాయల మనియార్డరు పద్మకు ముట్టింది. వెంటనే వచ్చినజాబు చదివి పండుగకు రమ్మని తల్లి వ్రాసిన విషయం అత్తగారితో చెప్పింది. కాని, "ఇన్నాళ్లుండి పండుగకు లేకుండావెళ్లడమేమిటి? ఆ డబ్బులోనే లలితకేవైన బట్టలు కుట్టించుముందు" అన్నది అత్తగారు. ఈ డబ్బు పండుగ వెళ్లిన తర్వాత రాక పోయె నే అనిపించింది పద్మకు. కాని తన బిడ్డకేగదా అని మంచి గౌనులు రెండు కుట్టించింది. భోగినాడు బిడ్డకు, భర్తకు, తలంటి నీళ్లు

బోసి, తాను పోసుకొని, లలితకు పుట్టినరోజని, భోగి పండ్లు పోస్తామని, ఊళ్లో తెలిసినవారిని, చుట్టాలను, పక్కాలను, పిలిచివచ్చింది. సాయంకాలం ఆరు గంటలయ్యే సరికి, ఆ చిట్టి తల్లిని శృంగారించి పీటవేసి కూర్చోబెట్టింది. ఇంతలో ఒక్కొక్క రుగ పేరంటాండ్రు రాజొచ్చారు. అరగంటలో కూటం నిండి పోయింది. రామలక్ష్మమ్మ భోజనాల యింటివాకిటి తలుపు కానుకొని కూచుంది. పక్కన్నే నడిమింటి రామభద్రం తల్లి వృద్ధ సుబ్బమ్మ సోడాబాటిలు గ్లాసులాంటి అద్దాలజోడు తగిలించుకొని, వచ్చేపొయ్యే వారినంతా చూచి విసుర్కొస్తూంది. ఆడపౌరోహితురాలు రాజమ్మగారు హారతికలిపి లలితకు భోగి పళ్లు పోసింది, పడమటింట్లో, పళ్లాలలో తాంబూలాలు, పళ్లు తయారుచేస్తూ కూచున్నాడు సుబ్బరాజు.

వృద్ధ : అదికాదే పద్మావతీ! యీ వచ్చిన వారంతా వట్టి తాంబూలాల వారేనా, లేక యింత పాటూ పద్యం పాడే వారెవరైనా ఉన్నారా ?

పద్మ : ఇదిగో యికనుగదూ...... ఒక్క పాటపాడు సరోజనీ.

సరో : "ఊహూ - నాకేమి రావమ్మా" అని సిగ్గుతో తలవంచుకుంది.

రామల : పోనీ ఆ గిరిజను పాడమనవే. యిటీవల పి టీలుకూడ నేర్చుకుంటుందట కదూ"

గిరిజ : నేను ఫిడీల్ తేలేదు పిన్నీ. ఎలా పాడేది — అదిగో స్వరాజ్యలక్ష్మి వస్తూంది. దాన్ని పాడమనండి"

పద్మ : "రా రాజ్యం సమయాని కొచ్చావు. ఒక్క పాటపాడు"

వృద్ధ : రామూ ! ఆ వచ్చిన పిల్లెవరే ?

రామల : "అదిగో కొత్తపేట్లో కాపురమున్నారు-ఇంజనీరు గారు. వాళ్ళమ్మాయి. పట్నంలో బి. ఏ. చదువుతూంది.

వృద్ధ : "పాపం అయినా యింత చిన్నతనంలోనే యీ గతి పట్టిందా. ఆ కాస్త కుంకుమకు నోచుకోక పోయె "

రామల : " ఛీ. ఛీ. అదేమిటత్తా దానికింకా పెళ్ళే కాలేదే"

వృద్ధ : మరైతే "జుట్టుకూడ బెత్తెడే వుందేమే" ?

పద్మ : ఈ ప్రసంగంవిని "నీ పూరుకో అవ్వా. వాళ్లు వింటే సామానం బోతుంది.

వృద్ధ : "ఊరుకుంటానుగాని మరి దాని జుటేమైందే ? మొక్కు చెల్లించిందా ?

పద్మ : "మొక్కులుగావు. మొద్దులుగావు. ఇప్పుడు మద్రాసులో చదివే పిల్లల్లో కొందరి కిదో ఫ్యాషనైందిలే"

వృద్ధ : "ఆడలంగులే ! ఆరివీళ్ళ సిగదరగా!"

పద్మ యిక చాలించమని సైగజేసి వెళ్లి స్వరాజ్యలక్ష్మిని పాడమని నిర్బంధింపగా ఆ పిల్ల హరిశ్చంద్రటాకీ సినిమాలోని "హా తనయా" అనే పాట ప్రారంభించటంతోటే, "అవ్వ రామ, రామ, ఛీ, ఛీ, ఛీ, ఇంత శుభంగా పుట్టిన దిన పండుగ చేసుకుంటుంటే, ఇదేం పాడు పాటే ! నిలపమనవే దాన్ని" అంటూ కసురుకుంది. రాజ్యానికి తలవంపులై కోపం వచ్చి చర్రున

తేచింది. పద్మ సమాధాన పరచి, తాంబూలాలిచ్చి పంపింది. ఇంతలో గీత, ప్రీత, అనే పిల్లలిద్దరు, బూట్సుకాళ్లు, పిజామాలు, పంజాబీ జుబ్బాలు, వలిపాలలాంటి రుమాళ్లు బుజాలమీద వ్రేళ్లాడుతూ ప్రవేశించారు. పద్మ వారి నాహ్వానించి కూచోమన్నది. కాని వారు చాపలమీద కూచునేందుకు సందేహించడం గమనించి, వెంటనే రెండుకుర్చీలు తెచ్చివేసి కూర్చోపెట్టింది.

వృద్ధ : "అదిగాదే పద్మావతీ మొగాళ్లనుగూడా పిలిచావేంటి పేరంటానికి ?"

రామల : "మొగాళ్లుగాదే వాళ్లు, జడ్జీగారి అమ్మాయీలు."

వృద్ధ : "అమ్మాయీలూ!! మరా చొక్కాలు, లాగులు తొడుక్కున్నారేమిటే మొగకుంకల్లాగ సిగ్గయిన లేకుండ."

రామల : "ఏందో అత్తా రానురాను కాలం బలేగా కాలిపోతూంది ఆడ మొగ వ్యత్యాసం లేకుండా."

గీత : "మీవారేరండి?" అని పద్మ నడిగింది.

పద్మ : "లోపలున్నారు, వస్తారులెండి."

ప్రీత : "వారితో మేమొచ్చామని చెప్పండి పోతాం."

పద్మ : అత్తగారినుద్దేశించి "మీ కొడుకుతో ఈ పిల్లలేమో మాట్లాడల్నట చెప్పండి" అన్నది.

రామల : సగర్వంగా "నాయనా రాజూ! జడ్జీగారి అమ్మాయీలు నిన్ను పిలుస్తున్నారురా" అన్నది.

రాజు లోపలనుంచి "గీత, ప్రీత, వచ్చారా? ఇదిగో వస్తున్నానని చెప్పు" అన్నాడు.

వృద్ధ : "ఆ వయసొచ్చిన పిల్లలకు వీడితో ఏమి స్నేహమే రామలక్ష్మీ"

రామల : "అబ్బే. ఏమిలేదు. క్లబ్బులో మనవాడితో టెన్నిసాడే స్నేహితం; అంతే" అన్నది.

ఇంతలో చేతులు తుడుచుకుంటూ రాజువచ్చి "హౌడూ" అంటే "హలో" అనుకుంటూ ఆ పిల్లల ఎదురుగా నిలుచున్నాడు.

గీత : ఇప్పుడే టెన్నిసుకోర్టునుంచి వస్తున్నామండీ"

ప్రీత : మీరీ రోజు క్లబ్బుకు రాలేదేం ? "

రాజు : " ఇదిగో ఇంట్లో కొంచెం పనుండడంచేత రాలేదు "

గీత : " రేపు మన యిద్దరికి మ్యాచ్ అండోయి "

రాజు : "ఓ, రెడీ. కాని మీరో పాట పాడండి. వినాలనుంది. గీత, ప్రీత, ముసిముసి నవ్వులతో ఒకరి మొఖాలొకరు చూసుకొని, అప్పటికి నాల్గు వారాలుగా ఆ ఊళ్లోని వైతరణి టాకీసులో ఆడుతూవుండే, " నీయమ్మ " అనే ఫిలింలోని నాయకా నాయికలు పాడిన డ్యూయట్ పాటను ఊపిరి తిప్పుకోకుండా దంచేశారు. రాజు మాత్రం ఒంటరిగ చప్పట్లు తట్టి " అద్భుతం ( ఎక్సలెంట్ )" అంటూ వారిద్దరికి షేక్ హ్యాండు యిచ్చాడు.

వృద్ధ : "గొంతులు బాగానే వున్నాయి కాని, ఇంత మంగళారతి పాడమనరా అబ్బాయి" అన్నది.

గీత : "నాన్సెన్సు, ఆ కంట్రీ పాటలేవీ మాకు రావని చెప్పండి."

పద్మ : "నీఊరుకోఅవ్వా! పుణ్యముంటుంది. నీవంతా పాతకాలపు మాటలు.

గీత, ప్రీత : "మిస్టర్ ! రాజూ ఇక మేంవెళ్లుతామండీ" అంటూ లేచారు.

పద్మ : "ఉండండి. తాంబూలం తీసుకొని వెళ్లుదురు గాని" అంటు కాళ్లకు పసుపు పూయబోగా.

గీత, ప్రీత : "ఓ! డర్టీ పసుపు వద్దండీ అని మొగాలు చిట్లించుకొన్నారు. పద్మ కుంకుమ పెట్టబోతే ఆమెనువారించి వారే కొంచెం చేతులకు తీసుకొని, ఆమె అటుతిరగగానే ప్రక్కన గోడకు పూసేశారు. పద్మ తాంబూలాలిచ్చింది. పుచ్చుకొని, తమ సంచులలో వేసుకొని "వస్తామండి నమస్తే" "బై, బై, మిస్టర్ రాజూ" అంటూ వికవిక వెకిలినవ్వులు నవ్వు కుంటూ, అది పరుగూకాదు, నడకాగాదు, అదో డాన్సెమో అన్నట్లు వెళ్ళిపోయినారు.

గిరిజ : "నేనుకూడా వెళ్ళాలండీ" అన్నది.

పద్మ : "పక్కయింటిదానివి నీవే తొందరపడితే ఎలాగే, హారతి కానిచ్చిపో" అన్నది.

వృద్ధ : "పద్మా అర్ధగంటనుంచి చూస్తున్నా ఒక్కరైన కమ్మని పాటొకటి పాడతారని, నీవైనా ఒకటనమ్మా విని పోతాను" అన్నది. పద్మ వెంటనే "రారమాయింటిదాక" అనే కీర్తన కమ్మగాపాడి అందరిని ముగ్ధులను చేసింది.

"ఎంతైన పద్మనిజంగా యింటికి మహాలక్ష్మేరామూ" అన్నాది ఆనందం ఆపుకోలేకవృద్ధ. రామలక్ష్మమ్మ ఆమాటలు విననివిననట్లుగా రాజమ్మగారిని పాటపాడి లలితకు హారతి ఎత్తమన్నాది. హారతెత్తుతూ, "హారతి గైకొనుమా శ్రీరామ చంద్ర" అనేపాట మూడున్నర శృతిలో పాడనారంభించగానే కుట్టుకారంతా పక్కని నవ్వసాగారు. రాజమ్మగారికి కోపం వచ్చి, హారతిపళ్లెం గబగబ త్రిప్పి "ఒక్కరికైన నోరుపెగలక పోయినా వెకిలినవ్వులకేమి తక్కువలా" అంటూ వెళ్లింది ఆ ఎట్టి నీళ్లు పారబోసేందుకు వాకిట్లోకి. పద్మ లలితచేత పెద్దలందరకు నమస్కారాలు చేయించింది. పంచ కజ్జాయం చప్పరిస్తూ "మరి నీప్రయాణమెప్పుడే" అని అడిగింది వృద్ధ. "పై బుధ వారం నాడవ్వా" అన్నది పద్మ. గిఱ్ఱున అటుతిరిగి యిటు చూచేసరికి ఆ బుధవారం రానేవచ్చింది. రాజు పద్మను, లలితను రైల్లో ఆడవాళ్ళ పెట్టెలో ఎక్కించి "ఊరుచేరడంతోనే రిప్లయికార్డువ్రాయి" అనిచెప్పాడు. రైలుకూసి కదిలింది. లలిత రైలు కూసినట్లు తనూకూస్తూ నాన్నను రమ్మని పిలిచినట్లు చెయ్యాడించింది.

---

# నాలుగవ ప్రకరణము

గుంటూరు స్టేషనులో, అప్పన్న, సుందరంవచ్చి, అత్తను చిట్టిమరదల్ని రైలుదింపి యింటికిపిలుచుకొని వెళ్ళారు. రైలు దిగిందిమొదలు ఇల్లుచేరేవరకు లలితబండ్లో, బావవళ్ళోనే కూర్చోని ముద్దులొలికే అమాయకపు మాటలతో ఆనందసాగరంలో ముం చేసింది.

పద్మావతి వచ్చిన రెండుమూడు రోజులలోనే, పుట్టింటి ఆర్థికపరిస్థితి, మేనల్లునికీ, ఇంట్లోమిగతావారికి పొద్దస్తమానాలు జరుగుచుండే కీచులాటలు, పూర్తిగాఅవగాహన మైనాయి. కాని ఆమెకూడ తనతల్లిలాగే "తిరుపతయ్యే లేకపోతే యీకాపురం ఒక్కక్షణమైన ముందుకుసాగునా" అనే అభిప్రాయంలోనే వుంది. ఆ కుటుంబానికి చెందిన ఆస్తిపాస్తులే ఊళ్ళోఉన్నాయి. ఊళ్లో కెవరికెంతెంత యివ్వాలి, ఎంతెంత వడ్డీలకు అప్పులు తెచ్చారు, ఎంతెంత చెల్లించాలసింది, మక్తాలెంతవస్తాయి, శిస్తు లెంతచెల్లించాలి, తుదకు నెలకింటికెంత వెచ్చానికి సెలవౌతుం దనేదికూడ తిరుపతయ్యకుతప్ప మరొక్కరికి తెలియదు. అలా తెలియకుండానేవుంచి యింతకాలం జరుపుకొచ్చాడు ఆమహాను భావుడు. ఇటీవల తెలుసుకుందామని పలుమారు ప్రయత్నించిన సుందరాన్ని, అందరు నోరుమూయిస్తూవచ్చారు. తుదకింట్లో జరుగుబాటుకే తకరారారంభమైంది. ఒకరోజు తనెవరికడనో చేబదులు తెచ్చానని యిర్వై రూపాయలిచ్చాడు. ఎన్నాళ్ళు జరుగుతుంది, ముష్టియిర్వై రూపాయలతో ఆకాపురం. అంచు...

వెంకాయమ్మగారి పెత్తనంలో ! నాలుగు రోజులయ్యేసరికి, మరే మమ్మూదామని వెదకటమారంభమైంది.

ఇంతలో కుందనమల్లు అనే మార్వాడి, తనకురావలసిన పాతిక వేల రూపాయలకు ఇంటిమీద, అందులోని చరాస్తిమీద, జప్తీ ఉత్తరువుపొంది, అమలుజరపడానికి అమీనాను పిలుచుకొని, యింటికివచ్చాడు. తక్షణం అప్పన్ననుపంపి తిరుపతయ్యను పిలిపించారు. వెంకాయమ్మ ఏడుస్తూ భోజనాలింట్లో ఒకమూల దిగజారి ఊరుకుంది. పంతులుగారు నడుమువిరిగినట్లు, గదిలోని చాపమీద చతికిలబడ్డాడు. జోగారావు ఆఫీసురూములో దాక్కున్నాడు. "ఈసమయంలో నేనెందుకు కిక్కడికొచ్చానా భగవంతుడా" అన్నట్లుగ దిక్కుదోచకుండా కంటతడిపెడుతూ ఒకమూలచేరింది పద్మ. "ఎందుకమ్మా ఏడుస్తున్నావు" అని చిట్టితల్లి అడిగేసరికి, చప్పునచెరగుతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ "ఏడవలేదమ్మ కంట్లో నలుసుపడ్డది" అన్నది పద్మ. "అయితే అమమ్మకూ్కడా కంట్లో నలుసుపడ్డాదా? " అన్నాదివెంటనే లలిత. "ఔనమ్మ" అంటూ, దానిముద్దుమాటలకు ఆనందపరవశయై, దాన్ని హత్తుకొని, నాలుగు ముద్దులు తనివిదీర బెట్టుకొని, యీకూనఉండబట్టికదా, ఎంతకష్టంలోనూ కొంతసుఖం మనుసుకుకలుగుతూంది"అని అనుకుందిపద్మ.

పెరట్లో బాదంచెట్టుకిక్రింద చేరారు అప్పన్న, సుందరం. ఆకాశంవిరిగి నెత్తినపడ్డట్టు, ముఖంలో నెత్తురులేకుండా వున్నాడు అప్పన్న. "ఎందుకలా దిగులుపడతావు అప్పన్నా, అంతామంచికే. ఈ కారణంగానైనా వీళ్ళు యీయిల్లువదిలి బైటపడితే, ఏమైనా బుద్ధివస్తుందేమో చూదాం. మానాన్నకు,

షూ జాబ్మకు, లేనప్పుడు లేదనిచెప్పడానికి, లేనట్లు నడుచుకో డానికి అవమానమా? లేకపోయినా వున్నట్టువుట్టిపడే వారికీగతి గాక మరేమౌతుంది. ఇప్పటికైన తెలిసొచ్చి, నాలుగురాళ్ళ సంపాదించే మార్గమేమైనా నాన్న వెదుకుతాడేమో చూదాం" అంటూ తనసిద్ధాంతాలనంతా అప్పన్నముందు వెళ్ళబోస్తు న్నాడు సుందరం.

వాకిట్లో తిరుపతయ్య మార్వాడీతో ఏదో గుస గుసలాడి, లోపలికొచ్చాడు వెంకాయమ్మకడకు. ఆమె ఆయన్ను చూడ్డంతోటే, బోరున ఒక్కపెడ్బొబ్బపెట్టింది. ఆశబ్దంవిని పంతులూ, పద్మావతి, జోగారావు, వెంకాయమ్మకడకుచేరారు. కాని, లలిత పానకంలో పుడకలాగ ఏమైనా అంటుంటుందేమో నని దాన్నితీసుకొని పెరట్లోకివెళ్ళింది పద్మ. తిరుపతయ్య అంద రినిఓదార్చేమాటలు సాగించాడు, తుదకు "ఇంకా పదిరోజులూర కుంటే, ఆగనిలోనిసరుకు బైటపడుతుంది. అవతల మనబాకీలన్నీ ఒక్కరోజులో కొట్టెయ్యొచ్చు" అని ధైర్యంచెప్పాడు. "కాని అందాకా యీమార్వాడీ ఆగుతాడా" అన్నాడు జోగారావు.

"నేనుఎంతో చెప్పిచూచాను, కాని, వాడు ససేమిరా అంటూన్నాడు" అన్నాడు తిరుపతయ్య! "మరిప్పుడుగతి" అన్నది వెంకాయమ్మ. "మీరు అన్యథా భావించకుంటే నాకు తోచింది చెప్తాను" అన్నాడు తిరుపతయ్య. "ఏనాడైనా అలా భావించామా తిరుపతయ్యా! ఇప్పుడీగండంలోనుంచి ఏలా కడ తేరుస్తావో, నీదేభారం, నీవేంచెయ్యమన్నా సిద్ధంగా ఉన్నా" మన్నాది వెంకాయమ్మ. "ప్రస్తుతానికి సగంబాకీ అయినా కడితే, జప్తీ వాపసు పంపుతానంటాడు కుందనమల్లు. అందు కోసం పద్మావతెమ్మ పెద్దమనసు చేస్తే యీగండం తప్పు

తుంది" అని తిరుపతయ్యా అన్నాడు. "అయ్యో! రామా! వారత్తారి సంగతి తెలిసి, తెలిసి, పొరబాటు పడుతున్నావే తిరుపతయ్యా. ఎంగిలిచేత్తో కాకినైనా తోలడల్లుడు. ఎండితే తలుగు బోతుందంటుంది విద్యాపురాలు. ఎంతసేపటికి "తమకాయుష్యం, తమకారోగ్యం" అనేవారేకాని, మన తనఅనేది ఏకోశానాలేదుగా వారికి" అన్నది వెంకాయమ్మ.

తిరుపతయ్యన్నట్లు యీసమయంలో కొంచెం ఆదుకొని, ఆ నాలుగు రూపాయలు మార్వాడీకి పారేసి ఆఆడుమానం అల్లుడు తనపేర ట్రాన్సుఫరు చేసుకుంటే, ప్రస్తుతం మనకు యీగండం తప్పుతుంది. రేపాగనిలో సరుకురావడంతోనే తన డబ్బు తనకు దక్కుతుంది, మనయిల్లు మనకుకూడ దక్కుతుంది" అని గొప్ప లాపాయింటు చెప్పాననుకున్నాడు జోగారావు.

"అప్పుపట్టడమే అనర్థం. అందులో చుట్టాలకడ, ఇక చెప్పనే అవసరంలా; ఎందుకీ కానియోచనలన్నీ, భగవంతుడేవేళకేలాబెట్టాడో,ఆలాజరుగుతుంది. మొదట్నుంచి,మీఅమ్మా కొడుకుల పద్ధతంతా దాహామైనప్పుడు ఖావిత్రవ్వేరకం. ఇంత వయసొచ్చినా, ఆసుందరుడికుండే యోచన, జ్ఞానం, మనకు లేకపోయె. ఇప్పుడేడ్చే ప్రయోజనం" అని విరక్తితో అన్నాడు పంతులు.

"ఊఁ. ఇదయ్యావరస. మీరెలా మాట్లాడేగా వాడికింత నోరైంది"అని యింకాయేమేమో అనబోతుంటే తిరుపతయ్యా మధ్యలో "ఇప్పుడవన్నీ అనుకోని ప్రయోజనంలేదు. అందుకు

సమయమూకాదు. కర్తవ్యం ఆలోచించాలి. కాలహరణం చెయ్యకుండా - ఇదిగో చూడండి పంతులుగారూ! నేచెప్పింది అల్లుడికడ అప్పుపట్టమనికాదు. అమ్మాయిగారు ఆదుకునేందుకు మనస్కరిస్తే, ఆమె పైనుండే సొమ్మిచాలు ప్రస్తుతానికి. రేపు సరుకమ్మటంతోటే మళ్లీ విడిపించివ్వచ్చు" అన్నాడు "ఔను యీవిషయం మరో ప్రాణికి తెలియవలసిన అవసరం కూడ వుండదు. బాగుంది సలహా" అన్నాడు, వకీలు జోగారావు.

వెంకాయమ్మకు నచ్చిందీ యోచన. పంతులు మాత్రం ముఖంచిట్లించి యేమనేందుకు తోచక ఊరకున్నాడు. "ఏమండీ పలకరేం" అన్నాది భార్య వెంకాయమ్మ. "ఆడబడుచుసొమ్మే, కీడెంచి మేలెంచ మన్నారు. రేపొగని మోసంజేస్తే..." అంటూ దిగులు కనపర్చాడు పంతులు. "చాలూరుకోండి. శుభంపలకరా పెళ్లికొడకాఅంటె ఏమో అన్నట్టు వున్నాయి మీమాటలు. పద్మను పిలుస్తాను. ఈ విషయందాంతో చెప్పి మెల్లగ వొప్పించండి దాన్ని" అంటూ "పద్మా కొంచెమిలా రామ్మా మీనాన్నగారు పిలుస్తున్నారు" అని కేకవేసింది వెంకాయమ్మ.

పద్మ బిడ్డను అప్పన్నచేతికిచ్చి లోనికెళ్ళింది. సుందరం కూడా ఆమెననుసరించివెళ్లి, భోజనాలింటి వాకిటిమొత్త నాను కొని నిలుచున్నాడు. "ఏంనాన్న పిలిచారుట" అన్నది పద్మ. "నే పిలవలేదమ్మా మీఅమ్మే పిలిచింది. యీ విషయంలో నాకే జోక్యములేదు. మీరునలుగురు మీటింగుజేసి ఏంజేస్తారో చేసుకోండి. నేనీ బాధలు పడలేను. మొదటినుంచి, పెత్తనం

సాగించిన మీఅమ్మో యిప్పుడూ వెలిగించనీ" అంటూ పంతులు లేచి వెళ్ళి హాలులో యీజీచైర్‌లో వాలాడు. "ఇదమ్మో యీయినతంతు. మొదట్నుంచి యింతే. కొండంతకాపురం నానెత్తిమీదబెట్టి, తకరారొచ్చినప్పుడల్లా తప్పుకుంటుంటారు" అన్నాది వెంకాయమ్మ వెక్కివెక్కి యేడుస్తూ. అమ్మదుఃఖం చూడలేక పద్మ "ఏడవొద్దమ్మా. సంసారమంటే కష్టాలు రాకుంటాయా, ఏంజేయమంటావో చెప్పమ్మ చేస్తాను"అన్నది. ఆమాటలను లంకించుకొని మెల్లగ విషయం వెళ్ళగక్కాడు జోగారావు. మధ్యమధ్య తిరుపతయ్యా హామీయిస్తూ పద్మకు, ధైర్యంకలిగే ముక్కలునాలుగు వేశాడు. అంతావిని పద్మకు ఏమీతోచక కూచుంది. మలిసులో పుట్టినింట ఏర్పడిన పరిస్థితులను, మెట్టినింటివారి నైజాన్ని తలపోయసాగింది. అత్తగారిని తలచుకొంటే వొళ్లు కంపరమెత్తి మనసులో ఒక తుఫాను చెలరేగింది. చెప్పిందాని కేమి జవాబు రాకుండుట చూచి. వెంకాయమ్మ మరో యేడ్పేడ్చి, మార్వాడి డిక్రీని అమలు జరిపితే, యింటిల్లపాది ఏ గుంటో చెరువో చూచుకోవలసి వస్తుందన్నట్టు, ఒక అతి విషాదకరమైన దృశ్యాన్ని మాటలతోనే పద్మ కళ్ళముందు చిత్రించింది వెంకాయమ్మ. దాంతో పద్మకు మతిమారి "సరే కానీ అమ్మ" అని యింకా యేమేమో అనబోతుంటే, చప్పున సుందరం "ఇదిగో అత్తయ్యా! తొందర పడొద్దు. మీ యింటాయన సంగతి, మీ అత్తగారి సంగతి మాకంటేకూడా నీకు బాగా తెలుసు. నీవు తొందరపడి సొమ్మిచ్చేశావా, పిమ్మట చింతిస్తావు. ఆ గనిని నమ్ముకొన్ని, నీ సొమ్మంతా ధారబొయడం, ఏదో నమ్ముకొని యేట్లో దిగి నష్టొతుంది. అటుపైని నీయిష్టం" అన్నాడు. "మరెలాగురా,

అమ్మ నాన్న అందరు నడివీధిలో నిలుస్తారు గదరా" అంది పద్మ. "ఏమి పర్వాలా. అప్పటికైనా మాకు బుద్ధి వచ్చి పరువు ప్రతిష్టలంటు, బోకి బోర్లించుకొక, బ్రతుకుతెరు వేదైన వెతుక్కుంటాం. అడుక్కు తినడం నీచం గనుక, నౌకరీ చేయడం మేలని అప్పటికైనా మాకు తోచి, యికనైనా ప్రపంచాన్ని గ్రహించుకొని, నిజాన్నెదుర్కొనే, ధైర్యం కలుగుతుంది. కనుక, నీవిప్పుడు నీ సొమ్మిమి యివ్వకుండటం వల్ల మాకు నిజంగా మేలుచేసినదాన వౌతావు" అని అన్నాడు సుందరం.

వొళ్ళు మంటతో "వీడెక్కడ పుట్టాడే మనయింట్లో, యాదవకులానికి ముసలంలాగ. అంతా అచచ్చినదాని గుణాలు, విడ్డూరపు మాటలు, దుర్బుద్ధులు వచ్చాయి. కానికి తరంగాక పోయినా అధిక ప్రసంగానికి తక్కువలా. ఆక్షేపణలు చేయు నేర్చినవాడివి, నాలుగు కాన్లు సంపాయించు చూద్దాం" అని ఒక్క విదిలింపు విదిలించేసిందా సుందరాన్ని.

వాడు వెంటనే వుద్రేకంతో "ఇదిగో బామ్మా సన్నె న్నైనా అనుగాని, గతించిపోయిన మా అమ్మను మాత్రం ఏమన్నా నే నోర్వను. నేను సంపాదిస్తానో లేదో నీవే చూస్తావుగా" అని అత్తను చూచి "ఇదిగో అత్తా నాకు తోచింది నే జెప్పాను. వినకుండ నీ సొమ్ము యిస్తివా వెనక చింతిస్తావు. అటుపైన నీ యిష్టం. ఇక నా అన్నానికైనా నేను సంపాదించిగాని, యీ యింట్లో అడుగుబెట్టను". అంటూ గిఱ్ఱున తిరిగి వెళ్ళాడు, పద్మ పిలుస్తున్నా వినకుండ. "అయ్యో! రామా! ఈ కుఱ్ఱకుంకే అఘాయిత్యానికి పాలుపడతాడో!"

అని దిగులుతో అన్నాది పద్మ. "మరేం భయంలేదు లేవే! కడుపు కాలితే వాడే తిరిగొస్తాడు" అన్నది వెంకాయమ్మ. ఇంతలో తిరుపతయ్య "ఏం తేల్చారు" అని అడిగాడు. "తేల్చే దేముంది తిరుపతయ్యా. వీటిని తీసుకెళ్లి ఏంజేస్తావో చెయ్యి. తప్పుతుందా" అంటూ తన వంటిమీది నగలన్నీ వొలిచి యిచ్చింది పద్మ.

"దొంగతాత మా అమ్మ సొమ్మంతా తీసుకెళ్ళాడు" అని పలుమారు లలిత అనసాగింది. అంతా మట్టం బంగారమని, పొడి నిండావుందని, తరుగు చాలా పోతుందని, అందుకని వాటిపైన పంద్రెండు వేలిచ్చేసరికి, ఆమార్వాడీకి గుడ్లెళ్ళు కొచ్చాయని, ఒక పురాణం సాగించి, తిరుపతయ్య వెంకాయమ్మగారి కుటుంబాన్ని యీ గండంనుంచి తానే రక్షించిన వానిలాగు వాగాడు కాసేపు. సథ్యాసామాన్లు వీధిలోపడకుండ తప్పినందుకు, అందరు సంతోషించినా, పంతులకు ఆ జరిగినపని మనసుకొస్తూనే వుంది. పద్మకు సుందరమన్న మాటలు సదా చెవుల్లో గింగిరుమంటూ, అందుచేత కలిగే దిగులుతో "ఇక ఆగనిలోని సరుకు బాగా రావాలి తల్లీ" అని తులసెమ్మకు ప్రతిదినం మ్రొక్కులు మొక్కడం మొదలెట్టింది.



# ఐదవ ప్రకరణము

ఆ రోజు సాయంకాలం రైలుస్టేషన్‌లో "నవలలండీ నవలలు, సరికొత్త కథలతో శృంగార, హాస్యరసపూరితములైన నవలలండీ, నవలలు. ప్రయాణలంపట తెలియకుండ హాయిగా కాలం గడపొచ్చునండీ రైల్లో" అంటూ సుందరం, ఓ పాతిక పుస్తకాలను చంకబెట్టుకొని అమ్మసాగాడు. రైలు కదిలేలోపల సుమారు యిరవై పుస్తకాలదాకా విక్రయమైనాయి. వెంటనే తన కమీషను రూపాయిపావలా మిగిలించుకొని, మిగతపైకాన్ని పుస్తకాలను షావుకారుకు వాపసు యిచ్చి, యింటికి పొయ్యే మార్గములో రోడ్డు వెంబడి వేపచెట్టెక్కి సందెడు పుల్లలు విరిచి, చాకుతో చక్కగ వుండేవాటి నన్నిటిని ఆరేసంగుళాల పొడవున కోసి ముళ్ళు, గంట్లు లేకుండజేసి, కట్టకారేసి పుల్లల చొప్పున లెక్కబెట్టి కట్టి, తయారైన కట్టలన్ని, అర్ధరూపాయకొక సంచికొని దానిలో నింపుకొని, మిగిలిన ముప్పావలాలో ఆరణాలకు హోటల్లో భోంచేసి, రైలుస్టేషన్ మూడో తరగతి ప్రయాణీకుల కేర్పడిన బెంచీపైన శయనించాడు. కాని తన తలలో చెలరేగుచుండిన, పలురకాల యోచనలచేతనూ, ప్రయాణీకుల అలజడివల్లను, వచ్చిపోతుండిన రైళ్ళశబ్దాల వల్లనూ ఒక రాగాన నిద్రపట్టలా. ఆఖరుఝామున, కాస్తకునుక్కు పట్టేసరికి ఎదో రైలు రావడం, దాంతో అదిరిపడి లేచి, తలకిింద సంచిని తీసికొని, ప్లాట్‌ఫారంపైకెళ్లి "పందుంపుల్లలండీ, పందుంపుల్లలు, కట్టకాని అండీ, తాజా పచ్చి వేపపుల్లలు" అంటూ అమ్మసాగాడు. ఇంతలో

రామన్న అంగడికి పుస్తకాలు తెచ్చేందుకు గాను, తిరుపతయ్యా పట్నానికి టిక్కట్టుకొని, రైలెక్కబోతూ, తటాలున సుందరాన్ని చూచి నిర్ఘాంతపోయి "ఇదేంపని నాయనా ఇంత బ్రతుకు బ్రతికి కొసాకు" అంటూ యేమేమో అన బోతూంటే, ఆయన్ను సగంలోనే ఆపి "ఏం, దొంగిలించానా, మోసం జేసానా, కష్టపడి న్యాయంగ వ్యాపారం జేస్తున్నా? ఇందులో తప్పేమయ్యా" అన్నాడు. "అదికాదునాయనా పెద్దవాణ్ణి నా మాటకొంచెం..."అని తిరుపతయ్య ముగించక మునుపే "చాల్లేవయ్యా నీ పెత్తనం. అదే మమల్నిగతికి తెచ్చింది." అని తీవ్రంగా ఒకచూపు జూచి, పై పెట్టె వైపు కాలు సాగించాడు. ఒక పావలాపుల్ల లమ్మేలోగా, రైలుకూసి కదిలింది. సుందరం మిగతా పుల్లలు సంచిలో వేసుకొని ఊళ్లోకి ప్రవేశించాడు.

ఒకఫర్లాంగు వెళ్ళకమునుపే అప్పన్నఎదురై "ఎక్కడికి బొయ్యావు సుందరయ్యబాబూ, రాత్రంతా నీకోసం వెతికి, వెతికి సాలైంది. ఇంటిల్లిపాది దిగులుపడి కూచున్నారు. బామ్మగారైతే ఏడుస్తున్నారు" అన్నాడు. "బామ్మగారేడ్వకేంలే అప్పన్నా. ఆమెకెప్పుడూ నెత్తిమీద నీళ్లకుండే" అన్నాడు సుందరం. మరి పద్మావతెమ్మేమో నీవింటికొస్తేనేగాని భోంచెయ్యనని ఉగ్గబట్టి కుచోనుంది. ఆ చిన్నతల్లి లలితమ్మ, బావేడి, బావేడీ, అంటూంటే, జబాబుచెప్పలేకుండా సస్తున్నాము బాబూ, రాతండ్రీ యింటికిపోదాం. పెద్దోళ్లేదో విసుగుతో అంటే, అట్టే యెల్లిపోవడమేనా. రాబాబూ యింటికి" అంటూ అప్పన్న సుందరాన్ని గడ్డంబట్టుకొని ప్రాదేయపడ్డాడు.

లలితప్రీతికి, అప్పన్న అపేక్షకు లొంగిపోయి, సుందరం వానివెంట యిల్లు చేరుకున్నాడు. వాణ్ణిచూడ్డంతోనే లలిత "బావా" అంటూ వానిపై కెగబాకింది. పద్మవచ్చి సుందరాన్ని దగ్గరకుదీసి తలనిమురుతూ "ఉండే మనోవ్యథకుతోడు, నీవు కూడా యిలాచేస్తే మాగతేంకావాలి నాయనా. నీవెక్కడ తిరిగినా, వేళకింటికివచ్చి అంత ఎంగిలిపడిపోరా" అని బహు ప్రేమతో అన్నది. "అలాగేనత్తా" అన్నాడు సుందరం,ఏనాడు రానికోపంతో వాణ్ణి ఏమో బెదిరించవచ్చాడు జోగారావు. కాని, పద్మ అన్నను ఊరుకోమని సైగజేసి కాస్త ఉప్పుపిండి చేయించాను, తిందువురా సుందరం రాత్రి భోంచేశావో లేదో" అంటూ లోనికి పిలుచుకొని పోయింది. నాటినుంచి, సుందరం తన చిల్లర కమీషను వ్యాపారాలను సాగిస్తూనే వచ్చాడు. తన వ్యాపారంసంగతి, అప్పన్నకు తెలిసినా, యింట్లో చెప్పొద్దని వానికి ఆజ్ఞపెట్టాడు సుందరరావు.

•

## ఆరవ ప్రకరణము

పట్నంచేరిన తిరుపతయ్య, స్టేషన్‌నుంచి, తిన్నగ మాంబళంలోని శ్రీధరరావుగారి బంగళాచేరి, వారినిదర్శించి, క్షేమ సమాచారాలు విచారించి, తన అంగడికి కావలసిన పుస్తకాల జాబితా ఆయనచేతి కందించాడు. శ్రీధరరావుగారాపట్టీచూచి "ఫోంచేసి షాపుకువెళ్లి నేచెప్పాననిచెప్పి అక్కడ మేనేజరు వారికి, దీన్నివ్వండి, ఆయన చక్కజేస్తాడు మీపని" అన్నాడు. ఇంతలో రాధాదేవిగారు కాస్త ఆయాసంతో నడుస్తూ ప్రవేశించి తిరుపతయ్యను యోగక్షేమాలు విచారించి, "నీళ్లయింట్లోకివెళ్లి, ముఖంకడుక్కోండి. కాఫీ తాగుదురుగాని, మీరూరెళ్లే వరకు మరెచ్చటికి వెళ్లకూడదండోయి భోజనానికి" అని గట్టిగా చెప్పింది. సహజంగానే, పోయినచోట, బాదరాయణసంబంధం కలిపి తన్నావేసే తిరుపతయ్యకు అంతమాత్రం మాటంటే, ఇక చెప్పనే ఒక్కరలా. కాని యీమారు యింట్లో దుర్గక్కకు కాస్త అనారోగ్యంగా ఉండడంచేతనూ తన పరోక్షంలో గనికడనుంచి ఏ తెలివిమాలిన పనవాడైనా వచ్చి, అచ్చటి నిజం పంతులుతో వాగేస్తాడేమోననే దిగులుతోనూ ఆరాత్రి తిరుగుప్రయాణం కట్టాలి సొచ్చింది.

లలితప్రీతికి, అప్పన్న అపేక్షకు లొంగిపోయి, సుందరం వానివెంట యిల్లు చేరుకున్నాడు. వాణ్ణిచూడ్డంతోటే లలిత "బావా" అంటూ వానిపైకెగబాకింది. పద్మవచ్చి సుందరాన్ని దగ్గరకుదీసి తలనిమురుతూ "ఉండే మనోవ్యధకుతోడు, నీవు కూడా యిలాచేస్తే మాగతేంకావాలి నాయనా. నీవెక్కడ తిరిగినా, వేళకింటికివచ్చి అంత ఎంగిలిపడిపోరా" అని బహు ప్రేమతో అన్నది. "అలాగేనత్తా" అన్నాడు సుందరం,ఏనాడు రానికోపంతో వాణ్ణి ఏమో బెదిరించవచ్చాడు జోగారావు. కాని, పద్మ అన్నను ఊరుకోమని సైగజేసి కాస్త ఉప్పుపిండి చేయించాను, తిందువురా సుందరం రాత్రి భోంచేశావో లేదో" అంటూ లోనికి పిలుచుకొని పోయింది. నాటినుంచి, సుందరం తన చిల్లర కమీషను వ్యాపారాలను సాగిస్తూనే వచ్చాడు. తన వ్యాపారంసంగతి, అప్పన్నకు తెలిసినా, యింట్లో చెప్పొద్దని వానికి ఆజ్ఞపెట్టాడు సుందరరావు.

•

# ఆరవ ప్రకరణము

పట్నంచేరిన తిరుపతయ్య, స్టేషన్‌నుంచి, తిన్నగ మాం బళంలోని శ్రీధరరావుగారి బంగళాచేరి, వారినిదర్శించి, క్షేమ సమాచారాలు విచారించి, తన అంగడికి కావలసిన పుస్తకాల జాబితా ఆయనచేతి కందించాడు. శ్రీధరరావుగారాపట్టీచూచి "ఫోంచేసి షాపుకువెళ్లి నేచెప్పానని చెప్పి అక్కడ మేనేజరు వారికి, దీన్నివ్వండి, ఆయన చక్కజేస్తాడు మీపని" అన్నాడు. ఇంతలో రాధాదేవిగారు కాస్త ఆయాసంతో నడుస్తూ ప్రవేశించి తిరుపతయ్యను యోగక్షేమాలు విచారించి, "నీళ్లయింట్లోకివెళ్లి, ముఖంకడుక్కోండి. కాఫీ తాగుదురుగాని, మీరూరెళ్లేవరకు మరెచ్చటికి వెళ్లకూడదండోయి భోజనానికి" అని గట్టిగా చెప్పింది. సహజంగానే, పోయినచోట, బాదరాయణసంబంధం కలిపి తస్సావేసే తిరుపతయ్యకు అంతమాత్రం మాటంటే, ఇక చెప్పనేఒక్కరలా. కాని యీమారు యింట్లో దుర్గక్కకు కాస్త అనారోగ్యంగా ఉండడంచేతనూ తన పరోక్షంలో గనికడనుంచి ఏ తెలివిమాలిన పసవాడైనా వచ్చి, అచ్చటి నిజం పంతులుతో వాగేస్తాడేమోననే దిగులుతోనూ ఆరాత్రి తిరుగుప్రయాణం కట్టాలి నొచ్చింది.

———

# ఏడవ ప్రకరణము

శ్రీధరరావుగారు ఆగర్భ శ్రీమంతులు. మూడు తరాలుగా చెన్నపట్నంలో ఒక పెద్ద అచ్చాఫీసు పెట్టుకొని, పుస్తకములు అచ్చువేయడం, వాటిని అమ్మేందుకు చైనాబజారులో, ఒక పెద్దషాపుబెట్టి లక్షలకు సంపాదించినకుటుంబం ఆయనగారిది. రావుగారు చాలాసౌమ్యులు, ఉదారస్వభావులు మితభాషిను. తెలుగు జిల్లాలలో నుంచి, కోర్టుపనిమీదనో, సర్కారు విషయంగానో, వ్యాపారానికో, లేక వైద్యానికో, పట్నంవచ్చేజనంలో కనీసం నాలుగో వంతైనా శ్రీధరరావుగారి అతిథులుగానే ఉండేవారు. ఆయనగాని, భార్యరాధాదేవిగారుగాని, వచ్చినవారినంతా ఎంతోప్రీతితో విచారించి, "యింకానాలుగురోజులైనా ఉండకుండ అప్పుడే వెళ్ళుతున్నారే" అనేవారు. ఆదంపతులకు భగవంతుడు అన్నిసంపదలు పరిపూర్ణంగా యిచ్చాడు. కాని, సంతానం మాత్రం కలుగలేదు.

ఆమె పట్టని నోములు లేవు, మొక్కని దేవుళ్ళులేరు, మునగని తీర్థాలులేవు, అడగని జోస్యులులేరు, ఎవరి బిడ్డను జూచినా, తనకు లేనిచింత ఆమెను కుంగతీస్తుండేది. ఇరుగు పొరుగువారి బిడ్డలను దగ్గరతీసి, వారికి బిస్కత్తులు, పిప్పరమెంట్లు, ద్రాక్షపండ్లు యింకా రకరకాల తినుబండారాలు, ఆట వస్తువులు, అన్నీ పంచిపెడుతుండేది. పనిమనిషిపిల్లలకు క్రొత్త క్రొత్తచొక్కాలు కుట్టించేది. స్నేహితులతో మాట్లాడేటప్పుడు పిల్లల మాటవస్తే "ఇక నాకేం కలుగుతారండీ" అని నిష్ఠు

పాతే అంటూండేది. కాని, అదేమిటండీ అలా అంటారు. మా ఆశపడుచు అత్తగారికి కాపరానికి పోయిన ఇరవై యేళ్ళకు పుట్టాట్టకొడుకు" అనే దొకామె. బ్రహ్మ వ్రాస్తే ఆయుస్సుకొక్కొరవా యన్నట్లు, గీచిపెట్టుంటే ఎప్పుడైనా కల గొచ్చు" అనేది మరొక యిల్లాలు. "ఇంకా మీకేం వయసు మీరిందనండీ, ముప్ఫైఅయిదు నిండాయో లేదో. అయినా రామేశ్వరం వెళ్ళి నాగప్రతిష్ఠ చేసిరండి" అన్నాదొక పెద్ద ముత్తయిదువ. 'అదిపోయిన్నెల్లోనే చేసొచ్చానండీ" అన్నదిరాధా దేవి. "అయితే యీమాటు నెలతప్పకుంటే నా పేరు మార్చు" అని తనకు నాగప్రతిష్ఠపై నుండె పరిపూర్ణ విశ్వాసాన్ని వెళ్ళ బుచ్చిందా తల్లి. ఆమె అన్నట్లు రాధాదేవికి, నెలతప్పింది. ఇప్పుడేడో మాసం. పచ్చంగ బంగారు ఛాయతేలి, వొళ్ళునిండు కొని, సాక్షాత్తు మహాలక్ష్మిలాగున్నాది రాధాదేవి. ఆరోజు కన్నడ తప్పావేసిన తిరుపతయ్యకూడా కొడుకు పుట్టాలని ఆశీర్వ దించి వెళ్లాడు.

---

# ఎనిమిదవ ప్రకరణము

తిరుపతయ్య ఊరుచేరి, యింటికి వెళ్లి స్నాన పానాదులు ముగించుకొనేలోగానే పంతులుగారింటికి జిల్లాడాక్టరును పిలుచుకొచ్చేందుకు, జోగారావు వెళ్ళడం తెలిసి ఆదరాబదరా పని ముగించుకొని పంతులుగారింటికి వెళ్లేటప్పటికి విషయం తెలిసింది. అంతకొక గంట ముందుగ, గని దగ్గరనుంచి మనిషొచ్చి, గడ్డ విరిగిపడి, నలుగురికి ప్రాణాలు పోయాయని, ముప్ఫైమందికి బలమైన గాయాలు తగిలాయని, ఊరి మునసబు పోలీసుక్కబురంపాడని, ఆ గనిలో కాని డబ్బైత్తు సరుక్కూడ చిక్కదని చెప్పడం, యీ వార్తలతో, పంతులకు తల తిరిగి మెట్లపైనుంచి క్రిందకి దొర్లి స్మారకం తప్పడం, అందరు పట్టి ఆయన్ను మంచంమీదికి చేర్చి, డాక్టరుకు కబురంపడం జరిగింది. డాక్టరొచ్చాడు. పరీక్షచేశాడు. నాడి చూచి తెల్లపోయాడు. "అయినా ఒక యింజక్షన్ యిస్తాను" అని సూది పొడిచాడు. ఒక్క నిమిషానికి పంతులు కళ్లు తెరిచి దాహమన్నట్లు సైగ చేశాడు. డాక్టరు గ్లూకోసు నీళ్లిమ్మన్నాడు. వెంటనే పద్మ నీళ్ళు తెచ్చి గ్లూకోసు కలిపి, ఒక గ్రుక్కెడు త్రాగించింది. అంతటితో పంతులు ఆమె కళ్ళల్లోకి చూస్తూ కంట తడిపెట్టాడు. పద్మ "ఎందుకు నాన్నా! నన్ను గురించి నీవేం కష్టపడొద్దు. ఏదెల్లైన పరవాలేదు. ఇంకొక్క గ్రుక్కెడు త్రాగు కాస్త బలివొస్తుంది" అని మరో గ్రుక్కెడు ఆయన నోట్లో పోసింది. కాని, ఆనీళ్ళు బైటికొచ్చేశాయి. పంతులుగారు కళ్ళు తేలవేశారు. ఒక్కపెట్టున అందరూ గొల్లుమన్నారు.

ఇరుగూ, పొరుగూ చేరబారారు. అల్లుడికి తంతి పంపడ మైంది. ఊళ్ళో రావలసినవారంతా వచ్చారు. పంతులువారి సవారి సాగిపోయింది. సుబ్బరాజు, రామలక్ష్మమ్మ, సంచయ నానికి వచ్చిచేరారు. "ఏదెలా వున్నా ఆయనకేమి తక్కువ లేకుండ కొనవరకు జరిగింది. ఇప్పుడు ఆకాస్త కర్మకూడ సలక్షణంగా జరిపించు నాయనా" అంటూ విచారింపుకొచ్చిన చుట్టాలంత అని వెళ్ళారు. ఏంబెట్టి చేస్తాడు జోగారావు. తిరుప తయ్యతో సలహాపడ్డాడు. పద్మ సొమ్ము అమ్మి అడుమానం తీర్చి మిగిలినదాన్ని ప్రస్తుతం ఉపయోగించడం తప్పవేరేమార్గం లేదన్నాడా వృద్ధజంబుకం. "తెచ్చిన అప్పుతీర్చ గలిగిననాడు నగలే క్రొత్తవిచేసి యివ్వలేక పోతామా" అని అలాగేచేయ మన్నాడు జోగారావు. చెప్పిందే చాలునని, మిగిలిన దాంట్లో సగానికి సగం కాజేసి, ఇంతేనని కర్మాంతరాలకు మోయను పైకం తెచ్చిచ్చాడు తిరుపతయ్య. ఏలాగో క్రతువులు జరిగి పోయాయి. పైంకుశసమారాధన, ఆశీర్వచనాలు అన్నిముగి శాయి. యీ లోగానే పద్మ నగల సంగతి భర్తకు అత్తగారికి తెలిసి కారాలుమిరియాలునూరుతు, ఊరికి పొయ్యేరోజు, అత్త గారు కోడల్ని పిలిచి "బిడ్డ ముక్కుపోగుతోసహా, సొమ్మంతా తీసుకొని మరినాయింటి గడపతొక్కు. అందాకా యిక్కడే మురిగిచావు" అని వెళ్లింది. దాంతో పద్మకు నడుములు విరిగాయి. ఏంజేస్తుంది. ఎవర్ని అడుగుతుంది? మింగలేక, కక్కలేక దినదినానికి కృశిస్తూవుంది.

---

# తొమ్మిదవ ప్రకరణము

సుందరం మాత్రం తనచిల్లర వ్యాపారాలను సాగిస్తూనే వచ్చాడు. ఒకరోజు వాడి వ్యాపారాలను గురించి తిరుపతయ్య ఇంట్లో మాటమాటా ప్రస్తావనలో జారవిడిచాడు. దాంతో వెంకాయమ్మకు, జోగారావుకు వొళ్లుమండుకొచ్చి, వాడింటికి రావడంతోటే లంకించుకున్నారు చెరోవైపు. "నీకేం పోయె కాలం వచ్చిందిరా" అని వెంకాయమ్మ, "నన్నిఊళ్లో తల యెత్తుకోని తిరగనిచ్చేటట్టు లేదేనీవు" అని జోగారావు, "నీవల్ల మా పరువు ప్రతిష్టలు మంట గలిశాయి ఊళ్లో" అని మరల వెంకాయమ్మ, "నీకి అపరబుద్ధు లేలా పుట్టాయిరా" అని జోగారావు, "ఆ చచ్చినదాని పిదప, దానిబుద్ధులన్ని వీడికి వచ్చాయి," అని వెంకాయమ్మ, "మీతాత నిన్ను పూర్తిగా పాడుచేశాడురా" అని జోగారావు, "వీధుల్లో అడుక్కుతినడం నేర్చిన వాడివి, యింటి కెందు కొస్తున్నావు పిండాకూటికి" అని యీలా నాన్న తప్పితే బామ్మ, బామ్మ తప్పితే నాన్న, దులిపేశారు సుందరాన్ని.

ఇట్లా వారు వాగి, వాగి, కాస్త తగ్గేసరికి, "ఊ మీధోరణి చూస్తే నేనేమో కూనీ చేసినట్లో, లేక, మానవులెవ్వరు చేయరాని బహునీచమైన పనేదో చేసి నట్టుంది.. ఏమి? నే చేసిందాంట్లో తప్పేమి? దొంగిలించానా? ద్రోహం చేశానా? లేక బిచ్చమెత్తానా? కష్టపడి ఒక సాహుకారుసరుకును, తిరిగి, తిరిగి, ఊళ్లోవాళ్లకమ్మి, న్యాయంగా ఆయనిచ్చిన కమీషను

పుచ్చుకొన్నాను. నేనెవర్ని మోసం చేయలేదే, ఎవరికొంపలు కూల్చలేదే, కష్టంచేసి సంపాయించుకుంటే అవమానమా? ఏ శాస్త్రంలోవుందలా ? కానీ సంపాదించే యోగ్యతలేక పోయినా, అర్థంలేని అభిజాత్యాలకేమి తక్కువలా ! ఏం కూలి వాడికి పరువులేదా ? తోటివాడికి మానంలేదా ? ప్రొద్దస్తమానాలు కాయకష్టంచేసి, ఓ రూపాయిడబ్బులు సంపాదించి, వారి, వారి, కుటుంబాలను, వారి, వారి, యోగ్యతకు తగినట్లు పోషించుకొని, మనకంటెచాలా మానంగానే బ్రతుకుతున్నారు. కొందరు చదివినవారుద్యోగాలు చేసి సంపాయిస్తారు. చదువులేనివారు కాయకష్టంతో పొట్టబోసుకుంటారు. ఉభయ వర్గాలుచేసేది కృషే. ఆకృషి యేవిధమైనా మానమే. శరీరంలో బలముండి, బోలెడు చదువు చదివి, ఒక్కడికి ప్రయోజనం లేకుండ, భూమికి భారంగా వుండే జీవితాని కంటె మానమే" అని, సుందరం తీవ్రంగా ఆరంభించే సరికి, జోగారావుకు దొంగకు తేలుకుట్టినట్లయింది. కాని, ఊరుకుంటే చిన్నవాని కోడినట్లౌతుందని దురభిమానంతో "ఆ ఏడు పేదైనా ఒక ఆఫీసులో గుమస్తా పనో, ఏదో యేడవరాదు. వీధులవెంట, రైళ్లదగ్గర పుల్లా, పుడక అమ్ముక తినక పోతే" అన్నాడు. "అన్ని ప్రయత్నాలు చేసే యిందుకు దిగాను. ఈ కాలంలో బ్రహ్మాగాడికి నౌకరిచ్చే వాడెవడు" అన్నాడు సుందరం. "నీక్కావలనంటే మీ నాన్న సిఫారసు చేసి నీకోమంచి నౌకరిచూసి పెట్టకపోయాడ?" అన్నది వెంకాయమ్మ. "ముందాయన్నే సంపాదించుకోమను. అవతల నా సంగతి యోచించవచ్చు"అన్నాడు - సుందరం. "అయినా పెద్దాచిన్నా, మట్టుమర్యాద, లేకుండ పొయ్యిందేమిరా నీకు.

పండుంపుల్లలమ్మి పదికాన్లు సంపాదించి, ఘనుడవైనావను కుంటున్నావేమో! నీ వెధవసంపాద్యం ఒక్కపూట కాఫీనీళ్ళకైనా చాల్తుందేమో చూస్తాను. ఒరేయ్ జోగిబాబూ! నాలుగురోజులు కూడులేకుండాచేస్తే యీ వెధవరోగం కుదురుతుందిరా? ఒరేయ్ సుందరాయి, ఆలాగే రేపట్నుంచి సంపాదించుకొనితిను. అదిచూస్తాను, ఎన్నాళ్లుతింటావో" అని బహు ఆక్రోశంతో అన్నాది వెంకాయమ్మ.

పద్మ మధ్యలో ప్రవేశించి ఉభయ పార్టీలను సర్దే ప్రయత్నాలు చేస్తూనే వుండింది కాని, ఒకరైనా వింటేగా. అన్నీ ఆ తానులోని పేలికలేగా. ఆఖరుకు బామ్మ మాటలతో రోషమెక్కి సుందరం చప్పున తన గదిలోకివెళ్లి చేసంచిని తీసుకొని ఏమీ అనకుండా వీధులోకెళ్లాడు. పద్మ పిలుస్తూనే వుంది కాని వాడు వినుపించుకోలా. "నీవుండవే వెట్టిబాగులదానా. నాలుగు రోజులు తిరిగి, అన్నమో రామచంద్రా అంటూ వాడేవస్తాడు" అని పద్మను కసురుకున్నాది వెంకాయమ్మ.

ఆబయులు దేరడం సుందరం తిన్నగా విశాఖపట్నం వెళ్లాడు. రెండో ప్రపంచయుద్ధం ప్రారంభమైన రోజులవి. ఏ ఊళ్లోచూచినా మిలటరీ లారీలే. ఆడమనిషి కూలి రోజు కారణాలనుంచి, ఒక్కరూపాయ వరకు పెరిగింది. మొగవాళ్లి లసలు చిక్కడమేలా. ఎవరు చూచినా పటాలంలో చేరడమే. ఎంగిలిబీడీ ఏరుకుంటున్నవాడు, పటాలంలోచేరి సిగరెట్టుపట్ట నారంభించాడు. "దొరలపెట్టె" అంటూ ప్లాట్‌ఫారం మీద తప్పుకొని పోతుండిన రైతు రెండోక్లాసు పెట్టెలోకి సరాసరి ప్రవేశించ నారంభించాడు. వడ్లధర రెట్టింపై చీకటి బజార్లు

ప్రబలిపోయాయి. ఎటువంటివానికి ఏదో ఒక నౌకరి చిక్కనే చిక్కుతుండింది.

విశాఖపట్నం చేరిననాడే మన సుందరం రిక్రూటింగు ఆఫీసుకు వెళ్లి అర్జీదాఖలు చేసుకున్నాడు. ఆ మరునాడే వాడికో నౌకరై, మూడోరోజే రైలెక్కించి, కలకత్తా వైపు పంపారు. కలకత్తాలో స్టీమరెక్కేవరకు, బర్మాకు పోతున్నట్లు వానికే తెలియదు. రంగూనులో ఒక మిలిటరి క్యాంపులో గుమాస్తా పనిలో చేర్చారు. పనిలో చేరిన క్రొత్తలో అనూరారు జనంమధ్య వాడిపని, క్యాంటినులో కావలసినంత భోజనం, సాయంకాలమైతే ఏదో సినిమా చూడడం ఇలా ఒకవిధంగా సరదాగానే గడచిపోతుంది వాడికాలం.

---

# ప ది య వ ప్ర క ర ణ ము

మామగారి కర్మాంతరాలకు వచ్చియున్నప్పుడే కొంచెంగా దగ్గుతో బాధపడుతుండినాడు సుబ్బరాజు. తిరిగి కాకినాడ వెళ్లడం తోటే ఆదగ్గు పగ్గిబలి కఫంతోపాటు నెత్తురు కనుపించసాగింది. డాక్టరుకు చూపాడు. ఆయన క్షయన్నాడు. అందుకు మదనపల్లె వెళ్లాలన్నాడు చికిత్సకు. "మీచేతకాద"న్నాది రామలక్ష్మమ్మ. కాకేమి, కాని యిక్కడవుండి చికిత్సపొందాలంటే బోలేడు ఖర్చౌతుందని, రోజు కావలసినన్ని పళ్లు, బంగారు యింజక్షనులు మంచిగాలికి తిరగడం, వొంటికి లంపట కలుగ జేసుకోకుండా వుండడం, యింకా యింకా యేవేవో లక్ష షరతులు చెప్పాడు డాక్టరు. అయినా పర్వాలేదు ఆరంభించమన్నది రామలక్ష్మమ్మ.

ఆరంభమైంది వైద్యం. వారంరోజులైన గుణమేమీ కనుపించలేదు సరేకదా నెత్తురుపడడం జాస్తయింది. మనిషి మంచాని కంటుకపోయాడు రోగికి ఇంక బ్రతుకనేమో అనే దిగులు ఆరంభమై బిడ్డను, భార్యను, చూడాలనే ఆశకలిగింది. గుంటూరుకు త్వరం వ్రాయించాడు తల్లిచేత. కొడుకు చెప్పిన ప్రకారమంతా వ్రాసి ఆఖరున "నేను గుంటూరులో నీనగల విషయమై చెప్పినదాన్ని మరువక అన్నీ తీసుకరాకపోతే కష్ట పడతావు" అని షరా వ్రాసి పోస్టుకంపింది. ఒకరోజు గుంటూర్లో బిళ్లలేకుండావచ్చిన జాబొకటి పోస్టువాడు పద్మావతెమ్మకు యిచ్చి రెండణాలు వసూలు చేసికొనిపోయినాడు.

నిజంగ బేడకు కక్కుర్తిపడి రామలక్ష్మమ్మ బిళ్ళలేకుండా పోస్టుకంపిందో, లేక తప్పక చేరుతుందనే ఉద్దేశమో అది ఆమెకే తెలుసు. కాని పద్మ జాబు చింపి చదివేలోపల వియ్యపురాలి నైచ్యాన్ని వేనోళ్ళ ఆడిపోసుకుంది వెంకాయమ్మ. ఇంతలో పద్మాపతమ్మ జాబులోని విషయాలు చదువుకొని కండ్లనీళ్ళతో నిండి, పొంగివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగుతూ "ఏమిటేసంగతి" అని తల్లిఅడిగిన దానికి నోటమాట రాక ఆ జాబు నామెచేతి కిచ్చేసి ఉన్నచోటనే నిలువున చతికిల బడింది. అమ్మపిలవగానే డిక్షనరీ మూసేసి జోగారావువచ్చి, షరాతోసహా జాబంతా చదివాడు. ఎవ్వరికి నోటమాట రాలేదు ఒకక్షణం. వెంకాయమ్మ మాట ప్రకారం అప్పన్న తిరుపతయ్యను పిలుచుకవచ్చాడు. పద్మ ప్రయాణానికి కేదైనకాస్త పైకం సర్దుబాటుచేయ మన్నారు. ఆయనసరేనని వెళ్ళాడు.

"అదికాదన్నయ్యా; ఆషరాసంగతేమిజేస్తావు" అన్నది. నీకు తెలియనిదేమున్నదమ్మ. ఇప్పుడు నన్నేమిచేయమంటావు" అన్నాడు జోగారావు. "అలా అంటె ఇక నాకాయింట్లో పుట్టగతులుంటాయా? అసలు రేపు పోతే యింట్లోకైన రానిస్తుందా మా అత్త" అన్నది పద్మ. "ఆ! రానీకేంజేస్తుందే? ఈ సమయంలో యేదైనా అల్లరి బెట్టిందంటే, ఊళ్లో నలుగురు ఆమెనే వుమ్మేస్తారు" అన్నది వెంకాయమ్మ. "ఆమె సంగతి మీ కింకా తెలియదమ్మా. ఆమె బ్రహ్మదేవుడికూడ వెఱవదు. ఆమెకు డబ్బే దైవం. ఊరివారంతా ఆమె నోటికి వెరిచేవారే కాని, ఆమెకు చెప్పేవారెవరు. మీరూ యిలా అంటే, యీజన్మకు నాకాయన ముఖం చూచే భాగ్యమే లేక

పోతూందే" అని వస్తుండే దుఃఖాన్ని అపుకుంటూ పలకింది పద్మావతెమ్మ. "అయితే మమ్మల్నే చెరువులో దూకమంటావే యిప్పుడు? మేమేందాచుకొని లేదంటున్నామా? ఈ మారేమో ఆ క్రాస్ వర్డ్సులో తప్పకుండ జయం కలుగుతుందని, చాలా నమ్మకంతో ఉన్నాడు మీ అన్నయ్య. ఇన్ని కష్టాలు పెట్టిన భగవంతుడు ఆలాంటిదేదో ఇవ్వనే యిస్తాడు. అందరి ఋణాలు తీర్చి, మేము సుఖపడతాం నా మాటలు నమ్మ" అన్నది వెంకాయమ్మ. ఆలాంటి అదృష్టం పట్టేదెవరి కోలే" అన్నది పద్మ.

ఇంతలో వాకిటి పంచలో ఆడుకుంటూండె లలిత ఎవరో పిలిచినట్లు లోపలికొచ్చి, పద్మ ఏడవడం, అమ్మమ్మ గట్టిగా మాట్లాడడం విని, అమ్మ వొళ్ళోచేరి, ఆమె చెంపలను తన రెండు చేతులతో తడువుతూ. "ఎందుకమ్మా ఏలుత్తున్నావు? అమమ్మ కొత్తిందా? మనం బామ్మ దగ్గిలికి పోదామమ్మ. ఈ అమ్మమ్మ చెడ్డది. నిన్ను ఊలికనే ఏలిపిత్తుంది" అన్నది ఆ కుఱ్ఱదాని తెలిసీ తెలియని మాటలకు, వెంకాయమ్మకు కోపం పొడుచుకొచ్చి "ఔనే నేను దుర్మార్గురాల్ని. మీ బామ్మనీ కొరిగిస్తుందిపో" అన్నది. "ఆ కూనన్న దాని కలుగుతా వెందుకమ్మ నీవు. దానికేం తెలుసునని" పద్మ అంటూండగ వాకిట్లోనే తంతి జవానిచ్చిన తంతిని, పాతిక రూపాయల రొఖంతో కూడ పద్మచేతి కిచ్చాడు తిరుపతయ్య ప్రవేశించి. తంతి చూడ గానే పద్మకు కాళ్ళూ చేతులు వణక సాగాయి. ఆత్రంతో చించి చదువుకొని దుఃఖాన్నాపుకో లేక పోయింది.

ఆ తంతిని జోగారావుతీసుకొని చదివి, అల్లుడపాయస్థితిలో నున్నాడనిచెప్పాడు అమ్మకు. తన తల్లేడవడమెందుకో తెలియకుండానె లలిత కూడ యేడ్పుమొదలెట్టింది. అప్పన్న ఆ బిడ్డ నెత్తుకొనివీధిలోకి తీసుకెళ్ళాడు ఆమాట యీమాట చెబుతూ. "ప్రాణం తో వుండగానే, యీలా యేడవగూడదమ్మ. నీదిచాలా గొప్ప హృదయం. భగవంతుడు నీకు మేలు చేస్తాడు తల్లి. మీ వారికీ గండం తప్పి పోతుందిలే తల్లీ" అంటూ తిరపతయ్య కొంత ఉపశమనపు మాటలు పలికి "లేచి కాస్త యెంగిలిపడు యీలోగా నేను బండి తెస్తాను. రైలుకు వేళైంది." అని వెళ్ళాడు.

ఆ సమయంలో చెప్పవలసిన ధైర్యపు మాటలన్నీ జోగారావు, వెంకాయమ్మ చెప్పారు. భోజనానికి లెమ్మన్నారుగాని, "నాకీపూట మెతుకైన దిగదమ్మ" అని పద్మ తనపెట్టె, పక్క సవరించుకొంది. లలితను పిలుచుకెళ్ళి అమ్మమ్మ అంత మెతుకు తినిపించింది. తిరుపతయ్య బండి తెచ్చాడు. అప్పన్న లలితను ఎత్తుకొని బండి దగ్గర కెళ్ళాడు. "వెళ్ళొస్తానమ్మ" అని చెప్పడానికి అమ్మవైపు తిరిగిన పద్మకు ఆపుకోలేనంత దుఃఖం తన్ను మీరి పొంగి పొరలివచ్చి అమ్మచేతుల్లో వాలి వెక్కివెక్కి ఏడువ నారంభించింది. అంతటి కర్కశహృదయుడు తిరుపతయ్యకు కూడ ఆ దృశ్యాన్ని చూచి కళ్ళు చెమ్మగిల్లాయంటే ఇంక వెంకాయమ్మ, జోగారావు సంగతి చెప్ప వలెనా! మెల్లగ అందరు ఆమెను సముదాయించి బండెక్కించారు. తిరుపతయ్యతో

సహా బిడ్డ, తల్లి బండెక్కారు. బండి కదిలేముందు "ఊరు చేరడం తోటే అన్ని విషయాలకు తంతి" యిమ్మని జోగారావు చెప్పాడు. బండి సాగింది. వెనక బండి పట్టుకొని నడుస్తూ వుండిన అప్పన్న పద్మావతి కెంతెంతో ధైర్యం కలిగించేందుకు మాట్లాడుతూనె వుండినాడు, కాని, లోకమే శూన్యమైనట్లున్న ఆమె కామాటలు చెవుల్లోకి దూరనేలేదు.

# పదునోకండవ ప్రకరణము

జోగారావుకు తను చెప్పినట్లుగానే మరుసటి రోజు సాయం కాలానికి అల్లుడు దివంగతుడై నాడనిపద్మయిచ్చిన తంతి చేరింది. అమ్మా కొడుకులు నిశ్చేష్టులైనారు. తండ్రి గతించి మూడుమాసాలైనా పూర్తిగా కాలేదు. నాటినుంచి నేటివరకు ఆ కుటుంబానికి తగిలిన కష్టపరంపరను తలుచుకుంటే చూచే వాళ్ళ కే వొళ్ళు జలదరించేది. "వద్దమ్మా పరమ విరోధికూ్కడ వద్దీలాంటి కష్టాలు" అన్నది మూలింటి హనుమాయమ్మ. "చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ అన్నట్లు" వద్దంటే పోతాయా? పూర్వ జన్మలో ఎంత జేశారో యిప్పుడీలా పడుతు న్నారు. యింకా యేమనుభవించడానికో అందరాయుస్సు పోసుకొని బ్రదుకుతూ వుందా వెంకాయమ్మ" అన్నాదా యింటి ఉప్పుతిన్న అన్నపూర్ణమ్మ. ఇంతటికి పద్మ ప్రాణంతో వున్న భర్తను చూచేందుకు నోచుకోలేదు. మొదటి రెండు రోజుల్లో జరగాల్సిందంతా జరిగి పోయింది. వారికుండే కొద్ది మంది చుట్టాలు చేరబారారు. తన అన్నయ్యైనా రాలేదేమా అని పద్మ యెంతో యోచించింది. కాని కారణమేమీ ఆమె మనస్సుకు తగల్లేదు, ఎవరొచ్చి ఏంజేస్తారులే అని సమాధానం పడి ఊరకుంది. మొగుడు చచ్చి మొత్తుకుంటుంటే, రంకు మొగుడురాళ్లేశాడన్నట్లు, ఇంతలో రామలక్ష్మమ్మ నగలు తేలే దని కోడలికి లఘార్చన మొదలెట్టింది. నలుగుర్తూ వచ్చి "ఇది సమయం కాదూరుకోమని" అమె నోరొక విధంగా మూయిం చారు. "అర్ధాయుష్యు చావుకార్భట మెందుకని" తొమ్మి

దోరోజు ఆరంభించి కర్మంతా కూలి బ్రాహ్మడిచేత జరిపించారు. వచ్చిన వారందరు వారిదోవవారు చెప్పకుండా వెళ్ళారు. ఇక నన్నడిగేవారు లేరన్నట్లు రామలక్ష్మమ్మ మళ్ళీ నగలమూటెత్తు కొని, కోడలిని యిల్లు వెడలి పొమ్మన్నాది. "ఈ యింట్లో నాకు మాత్రం హక్కు లేదా" అని పద్మ అన్నదానికి, ఆస్తంతా తన పేర నున్నాదని రిజిష్టరు చేయించుకొన్న వీలు నామా చూపి పద్మను గడపదాటించింది. కట్టుబట్టతో బిడ్డను చంకనేసుకొని దిక్కుమాలినదై, ఏంలేక పోయినా పిడికెడన్నం పెట్టడా అన్నయ్య అని పుట్టింటికి దారి బట్టింది పద్మ.

---

# పంద్రెండవ ప్రకరణము

తిరుపతయ్య మిగత నాలుగువేలు శ్యామశాస్త్రికి సమర్పించి, ఆయన కొమార్తైను అమ్మణిని మోహానుడికిచ్చి వివాహముహూర్తం నడిపించాడు. ఒకే కొడుకు, అందులో తల్లి లేని బిడ్డని అయిదురోజులు పెళ్ళి చేస్తున్నాడు తిరుపతయ్య. పిల్లి తండ్రి వధువుకు పదహారేండ్లనిచెప్పి,అందుకు తగిన జాతకం బనాయించినా, చూచేవారంతా పద్ధెనిమిదైనా నిండుంటాయి అన్నారు. నిజమేమైనా వరుణ్ణి మించిన వధువు, మోహానుడి కంటే బెత్తెడు జాస్తీను, మంచి పుష్టిగల శరీరం. దినానికంత యింట్లో వాడుకకు కావలసిన నీళ్ళన్ని తిరుపతయ్య యింటి పాతాళపు భావిలోనుంచి తను వక్కతే చేద పోయ గలదు. అందుగ్గాను సుబ్బడి కిస్తుండే అయిదు రూపాయలు మిగిలిపోతా యని కూడ అనుకున్నాడు తిరుపతయ్య.

మోహానుడికి పెళ్ళాన్ని చూస్తే ఒకవైపు ఆనంద మౌతున్నా ఓవైపు దాని చూపులకు చేష్టలకుభయంకూడా కలిగేది. ఆమతింపు సమయంలో వేడుకల సాకుతో అప్పడాలతో యీడ్చి చురుగ్గా తగిలించేది. గంధం పూసేమిషతో చక్కిలిగింత పెట్టేది. మోహానుడికా, విపరీతపు చక్కిలిగిలి.అమ్మణ్ణి ముట్టుకుంటేనే పొట్టపగిలేనవ్వుతో పీటమీదినుంచి విఱుచుక పడేవాడు. వాడు ముట్టబోతే గుడ్లెఱ్ఱచేసి, వానివైపు చూచేది. దాన్ని కాస్త తాకవలెనని వానికెంతో ముచ్చట ఒకవేళ దానిచూపులను గమనించక వాడుదానిని తాకెనా, ఎవ్వరికి తెలియకుండ వాడిని

గట్టిగా గిల్లేదాపిల్ల. దాంతో ఉన్నట్లుండి వెట్టికేక బెట్టేవాడు బాధతో మోహనుడు. "ఏమిట్రా ఏమైంది నాయనా" అని తిరుపతయ్య అడిగితే "గిల్లింది నాన్నా" అని ఏడ్చేవాడు. "ఆఁ వేడుకకలా అంటేనే మరీఅఘాత్యం చేస్తాడమ్మా అబ్బాయి" అని పెళ్ళి కూతురి తల్లి సరేసేది.

మోహనుడు వట్టి వెట్టిబాగుల పెద్దమ్మని మొదటి చూపుతోనే గ్రహించింది అమ్మణి అంతే గాదు, రామన్న తెలివి తేటలు వాడి చూపులు మాటలు చూచి పెళ్ళిముగిసేలోగానే అమ్మణి తలలో క్రొత్త ఆలోచనలను రేగదీశాయి. దుర్గక్కకి సంబంధం అంతగ పట్టక పోయినా, తన కప్పటికే అనారోగ్య మేర్పడి యుండడం చేత, ఎదిగిన పిల్ల, ఏదోయింత కాచి గుక్కలో పోసేందు కుంటుందిలే" అని సమాధాన పడింది. కాని మోహనుడి కంటే పెద్ద...న తన కొడుకు పెళ్లి విషయమే మరిది గారు తలబెట్ట...సి మత్సరం మాత్ర మామెలో నాటుక పోయింది

హారిబువ్వం నాడు, పెళ్ళికూతురు పెళ్ళికొడుకు కంచంలో యెంగిలి వేసింది. మోహనుడు దాని కంచంలో కొంచెంలడ్డు వేశాడు. దాంతో అమ్మణి తను మిగిలిన పదార్థంతో కూడా కంచాన్ని అమాంతంగా వాడి కంచంలో వేసి లేచి వెళ్ళింది. చాలా మందికి దాని చర్య ఏమాత్రం నచ్చలేదు. దుర్గక్క కొంచెం చీదరించుకొని మళ్ళీ వెళ్ళి కూచోమని గసురుకుంది. అమ్మలక్క లంతా వచ్చి కూచోమన్నారు. ససేమిరా అంటూ వంటింటిమూల నుంచోనే ఉంది. ఆఖరుకు రామన్న చెప్పే

సరికి వెళ్ళి మళ్ళీ మోహనుడి పక్కన కూచుంది. పోనీ తన కొడుకు మాటైన వింటుందికదా అని దుర్గక్కకు కొంత తృప్తి కలిగింది.

తర్వాత శేష హోమమైె అంపకాలైనాయి. వియ్యాల వారంతా (అంటె ముగ్గురే, పిల్ల తల్లి, తండ్రి, మరొక బ్రాహ్మణుడును) తరిలారు రైలుకు పోతూ పెళ్ళికూతురు తండ్రి కుమార్తెను చాటుకు పిలిచి అరవంలో ఏమో చెప్పి వెళ్ళాడు. అన్ని భాషలు తెలిసిన పేరయ్య ఆ సంభాషణవిని, ఆవతల చాలా కాలానికి చాటున మాటున మాటల్లో "నీ కన్నీ అనుకూలంగా వుంటే వుండు లేకుంటే మరోకుంకవుతాడు ఈపిచ్చికుంకే శాశ్వతమా" అని కూతురికి బుద్ధిచెప్పి వెళ్ళాడనీ, ఆ పిల్లనింతకు ముందే హైదరాబాదులో ఒకరికి కట్టిపెట్టి, అక్కడేదో జరిగి పుట్టిల్లు చేరిందని, యింకా యీలాంటివేమో అంటూండే వాడు.

అమ్మణ్ణికి, అరవయాసతో తెలుగు, మాట్లాడు తుండేదే కాని, వ్రాయను, చదవను మాత్రం తెలియదు. కాని శ్రద్ధతో రామన్న అమ్మణ్ణికి, తెలుగు నేర్పసాగాడు. వేలుచూపితే చెయ్యి మింగేరకం గనుక, ఒక్కనెలలో చక్కగ, వ్రాయను, చదవను నేర్చుకొని, రామన్న తనషాపులో నుంచి తెచ్చిచ్చే, శృంగార రసభరితములైన నవలలు, మోహినిలాంటి పత్రికలను చదువుట కారంభించింది. అయిదువేలుపోసి కొన్నపిల్ల, హద్దు మీరి పోతుందేమో నన్నట్లు, లేనిరోగాలు కల్పించుకొంటూ, ఇంటిపనంతా అమ్మణ్ణిమీదతోసి తాను స్వస్థంగా కూచోమరిగింది

దుర్గక్క. ఎద్దంత మనిషిగనుక ఇంటిపనంతా క్షణములో చేసేసి, పుస్తకాలు చదివేందుకు కావలసినంత కాలాన్ని మిగిలించుకొనేది అమ్మణ్ణి. శీఘ్రంలోనే రామన్న విషయంలో దాని నడవడిక, దుర్గక్కకు అర్థమైంది. కాని, చూచీచూడనట్లుండేది. పిచ్చికుంక మోహానుడికేమీ తెలియదు.

# పదమూడవ ప్రకరణము

ఆరోజు పగలు, పదిగంటలకు, పంతులు కోమాంత్రై పద్మావతెమ్మ వచ్చి తిరుపతయ్యను పిలుస్తుందని, ఆయన కెవరో చెప్పగా, వెంటనే తిరుపతయ్య వీధిలోకి వెళ్ళిచూచి, ఓ నూరు గజాల దూరంలో వేపచెట్టు క్రింద నిలుచోనున్న పద్మావతెమ్మను, గుర్తించి ఆమెను సమీపించి, భర్త వియోగానికామెనుఓదార్చి, విశేషాలడగ నారంభించాడు. "పద్మ" తిరుపతయ్యా! మాయింటికి సీలువేసుందే, ఏమైందేమిటి, అమ్మ, అన్నయ్య యెక్కడున్నారు"అని అడిగింది. పద్మావతెమ్మ కాకినాడకు ప్రయాణమైన మరునాడే తిరుపతయ్య, పెళ్ళివిషయమై పాలఘాటు వెళ్ళాలిసొచ్చింది. తను తిరిగివచ్చేలోగా, ఆకుందనమల్లు, మళ్లీ జప్తీతెచ్చి ఇంటికి సీలువేసింది, దాంతో వెంకాయమ్మ, జోగారావు లెవ్వరికి చెప్పకుండా ఊరు విడిచి వెళ్ళింది, అన్నీ పూసగ్రుచ్చినట్లామెతో చెప్పేసరికి, ఆమెకు పట్టరాని దుఃఖమొచ్చి, తన అత్తగారు చేసిన అఘాయిత్యం అంతా చెప్పి "మరి నాకిప్పుడు నిలవను నీడగాని, కడుపుకన్నంగాని లేకపోయెనే తిరుపతయ్యా! ఏ గుంటో చెరువో చూచుకుందామన్నా యీ కూన ఒకతె ప్రతిబంధక మాయెనే" అంటూ భోరున ఏడ్చింది. తిరుపతయ్య ఆమెను సమాధానపరుస్తూ "నిన్నీ స్థితిలో యింట్లోకి రమ్మనడానికి లేకపోయెనే, ఏం జేయను తల్లి! నీకేమైనా డబ్బుకావలనంటే యిస్తాను. కొద్దిరోజు లెక్కడైనా తలదాచుకో. ఆ పైన కలుసుకొని ముందాలోచన చేస్తాము" అని అన్నాడాయన. కొంతసేపాలోచించి, తనకడనుండిన,

ముక్కుపుడకను, మాంగల్యాన్ని, ఆయన చేతికిచ్చి వాటినమ్మి ఏవైన రెండు చీరలు, ఒకచేతిపెట్టె తెచ్చి యివ్వమన్నది పద్మావతెమ్మ. విధిలేక పుచ్చుకున్న వానిలాగా నటించి "ఇప్పుడే వస్తానుండమ"ని యింటివైపుకు వెళ్ళి కొంతసేపైన తర్వాత, రెండు కట్టుచీరలు, యిరవై రూపాయలు రొఖం, ఒక చిన్న ట్రంకుపెట్టె, కొన్ని పిండివంటలు తెచ్చి ఆమె కిచ్చాడు తిరుపతయ్య. ఆ చెట్టుక్రిందనే కూర్చొని ఆ తిండిని కాస్త పిల్లకు బెట్టి, తానుకొంచెం తిని, ఆయన తెచ్చిన మంచి నీళ్లు త్రాగి "మరి నే నొస్తా తిరుపతయ్య" అంటూ లేచింది.

"మరెక్కడి కెళ్లేటట్టమ్మ" అన్నాడాయన. ఎక్కడికని చెప్పను? ఇల్లు లేనివారికి దేశమంతా ఇండ్లే, అట్లాపడిపోతాను. ఏ మహాతల్లైనా కనికరిస్తే వాళ్ళింట్లో ఇంత చాకిరి చేసు కొనైనా బ్రదుకుతాను"అన్నది పద్మావతెమ్మ. "రామ, రామ ఎంతకష్టం వచ్చింది తల్లీ! నీకు ఏమైనా పూలమ్మిన ఊళ్లో కట్టె లమ్మినట్టు, ఆ పని యీ ఊళ్లో చెయ్యకమ్మ. మరేఊరైన మేలే" అన్నాడు తిరుపతయ్య. "నేను అదే అనుకొన్నా. ఇంకేంచేయను. మరి వెళ్లొస్తా తిరుపతయ్య" అని రైలు స్టేషన్ వైపు దారితీసిందామె. ఆ చీరెలు మోహానుడి పెళ్లిలో కట్నాలక్రింద వచ్చినవే, ఆ పెట్టె కొడుక్కూ కోడలికి వుంటా యని కొత్తగా పెళ్ళికిముందే తిరుపతయ్య కొన్న ఒకటోరకం జోడుపెట్టెల్లో ఒకటి. పద్మావతెమ్మ యిచ్చిన బంగారపు వస్తువులు తిరుపతయ్య సందుకా చేరినవి.

# పదునాలుగవ ప్రకరణము

గుంటూరులో తిరుపతయ్య యిచ్చిన రోఖంతో చెన్న పట్నం చేరింది పద్మ. పట్నంచేరిన రెండురోజుల్లోనే చేతిలో చిల్లర కాస్త, తీరిపోయి భుక్తికే తకరారు ప్రారంభించింది. ఎక్కడికిపోయినా, ఎవరినడిగినా, తుదకు వంటకు కాదుగదా, పాచిపనికూడా ఎవ్వరు ఆమెను పెట్టుకోలేదు. "వయసు మొగవాళ్లుండేచోట యీలాంటి వారిని పెట్టుకుంటే యింకేమైనా ఉందా" అనేదొకరు. "దాన్నిచూస్తే నౌకరి కొచ్చిన దానిలాగుందా. రేపు యింటి యజమానురాలై కూచోదు?" అనే యిల్లాలొకతే. ఇదెవతో గుడిసెప్రేటుది లాగుంది" అనేదొకరు. యీ విధంగా ఒక్కొక్కరు, ఒకొక్క రకంగా కడుపు కోత మాటలనేవారు. తుద కాకలి బాధకోర్వక పిడికెడన్నం పెట్టమని యెవరింటికన్నా వెళ్ళితే "యీ రేషన్ దినాల్లో యిదొకటి నేర్చారమ్మా" అంటూ అదిలించి తరిమేవారే కాని, పాపందలచిన వారెవ్వరులేరు. తుదకు బిడ్డకైన ఆకలి తీరుద్దామని, తప్పితవిరే మహాతల్లేదైన అంత తిండి నోళ్లోవేస్తే దాన్ని బిడ్డకుబెట్టి, రోడ్డు కొళాయినీళ్ళన్ని త్రాగించి, మిగిలిన మెతుకులు తెల్లవారి చిట్టితల్లి కుండనిమ్మని కొంగున కట్టుకొనేది.

ఒకరోజు ఎక్కడా ఏమీ చిక్కలేదు. రామస్వామిసత్రపు అరుగుమీద, తన చీర పరచి, ఆకలితో సొమ్మసిల్లిన బిడ్డను నిద్రబుచ్చి, కడుపులోని సొదవల్ల తను నిద్రరాక కూర్చొని, గతాన్నంత తలపోసి దుఃఖించసాగింది. చివరకు తనకు కాస్త

కూర్కు పట్టింది. ఆ నిద్రలోనే తన్నూ తన బిడ్డనుకూడ అ భగ వంతుడు యీ యాతన తప్పించి తన పాదాల కడకు చేర్చుకో కూడదా అని, అలాంటి గొంతెమ్మ కోర్కెలతో తెల్లవార్చింది. ఇంతలో బిడ్డ ఆకలే అంటూ లేచింది. "పోదాం లే అమ్మా. ఈ పూట యే ధర్మాత్ములైన అంత పెట్టరా ? చూదాం!" అంటూ, బిడ్డ, తన చేతి పెట్టె, తను మళ్లీ వీధుల వెంటబడి అక్కడక్కడా యాచించుకుంటూ, యెక్కడ యేమి చిక్కక ఆకలిబాధచేత, పెద్దగ యేడవడానికి కూడ శక్తిచాలని బిడ్డను సముదాయించుకుంటూ తిన్నగ నడచి మైలాపూరు బజారువీధి జొచ్చింది.

అప్పుడే కొందరంగళ్లు తెరచి, అన్నీ సర్దుకొంటున్నారు. ఒక పెద్ద షాపుముందు నిలిచి, లోపల కుర్చీలో కూర్చొని, ముందు బల్లమీది పళ్లెంలో నుంచి చంచాతో తీసుకొని తింటూ వుండిన ఒక వ్యక్తిని చూచేసరికి పద్మకు నోట్లో నీళ్లూరాయి. సాహసంచేసి లోపలికి ప్రవేశించింది. లలిత ఆకలితో ఆయన తింటూండే యిడ్డినవైపు చెయ్యిజాచి యేడ్చింది. పద్మ తన కష్టాన్ని చెప్పుకోలేక చెప్పుకోలేక చెప్పుకుంది. అతనికి మనసు కరగి, పనివానిని పిలచి, ఎదటి హోటలు కామెను పిలుచుకెళ్లి కావలసినంత ఫలహారమిప్పించి పిలుచుకరమ్మన్నాడు. పనివాని వెంట పోయింది పద్మ.

ఆ అంగడి యజమానుడే ఆయన. పేరు రంగనాయకులు నాయుడు. ఆయనకు సంతానం లేదు. సంపాద్యం మాత్రం బాగా వుంది. నాటకాలకు, సినిమాలకు కావలసిన చమికీ దుస్తులు నేటి నవనాగరికపు యువతీమణులు ధరించే, చమికీతో

పట్టుదారముతోను, రకరకాల చిత్రవిచిత్రములైన కుట్టుపనులు చేయబడ్డ రవికెలు, జంపర్లు, చీరెలు, లంగాలు, పావడీలు యిత్యాది సరుకులు తయారుచేయించి అమ్మే వ్యాపార పూ నాయుడుగారికి. ఆయనకు సుమారు యాభై సంవత్సరా లుంటాయి. ఇంకా పాతకాలపు పద్ధతిలోనే కట్టు, బొట్టు, జుట్టు ఇంత దైవభక్తి, బ్రాహ్మణులంటే గౌరవం యిత్యాది అల వాట్లు కలవాడు.

పద్మ హోటల్లో కడుపునిండా లలితకు పెట్టి, తను తిని, కాఫీ త్రాగి పనివానితోకూడ తిరిగి కృతజ్ఞత తెలిపేందుకు నాయుడుగారి అంగడి ప్రవేశించింది. నాయుడుగారి కప్పుడే బేరమారంభమైంది. ఎవరో యిద్దరు యువతీమణుల కాతడు సరుకులు చూపుతున్నాడు. అప్పటికే కొందరు కుట్టుపనిచేయు స్త్రీలు, పురుషులు వచ్చి, వారివారి పనులలో నిమగ్నులై యున్నారు. నాయుడుగారికి తీరిక చిక్కేవరకు అక్కడ ఒక మఖ్మల్ బట్టపై చమికీకుట్టుచున్న ఆమెకడ కూర్చుని చూస్తూ యున్నది పద్మ. లలిత ఆ బట్టను తన లేత చేతులతో తవి, తడివి "బాగుందమ్మా మెత్తగ నాకు గౌను కుత్తించవూ" అడి తల్లి నడిగింది. అలాగేనని పద్మ ఊరడిస్తూ, ఆ మనిషికుట్టులో తప్పు కనిపెట్టి "అమ్మా తప్పుపోయిందమ్మ లెక్క రెండు రెండుగ కుట్లు తగ్గించుకో వస్తూ, యీ చోట ఒక్కటే తగ్గించావమని పొరబాటున" అని అ తప్పుబోయిన తావును, ఆమెకు వ్రేలితో చూపించింది. ఆమె తన తప్పును గుర్తించుకొని, వేసిన కుట్లను కొన్నింటిని విప్పసాగింది.

ఇంతలో బేరం ముగించుకొని నాయుడుగారు పద్మ యున్నకడ కొచ్చారు. కుట్లువిప్పుతున్నామెను చూచి, ఎందుకు విప్పుతున్నావన్నాడు. పద్మ తప్పు కనిపెట్టి చెప్పిన విషయ మామె ఆయనతో చెప్పింది. "అయితే యీ పని మీకూ తెలుసు ననుకుంటాను. మీ పేరేమో కాని" అన్నాడు నాయుడు. "నా పేరు పద్మావతండీ! చిన్నప్పుడు బాగా బ్రతికిన రోజుల్లో, యీలాంటి పను లెన్నో చేశానండి" అన్న దామె. ఆయన కొంచెం యోచించి, "యిలా రామ్మా" అంటూ ఆమెను పిలుచుకొని, తన గదిలోనికి వెళ్లి తాను కుర్చీలో కూర్చొని, ఆమెకు ఒక కుర్చీ చూపాడు. ఆమె సందేహించింది. కాని ఆయన నిర్బంధంవల్ల, ఆమె కూర్చోవలసివచ్చింది. అంతట నాయుడుగారామె పుట్టుపూర్వోత్తరాలను గురించి ప్రశ్నించ నారంభించాడు. ఆమెకు ఒక్కమారుగ గతమంతా గిఱ్ఱున స్మర ణకు వచ్చి, కళ్ళు నీళ్ళతో నిండి, "అయ్యా! మీరెవరో పుణ్యా త్ములు, రెండు రోజులనుంచి, మాడిన మా కడుపులను అడిగిన మాత్రానే చల్లపరచినారు. పైగ ఎవరో ఆత్మబంధువుల్లాగ, నా కష్టసుఖాలను అడగజొచ్చారు. నేనేమి చెప్పేందుకు నో రాడకుంది. నే నొక అభాగినిని. ఒకప్పుడు గౌరవంగ నలుగురికి పెట్టి, నేనూ తింటూ వుండినాను. నేటి కా కాస్త పసుపు కుంకుమ పోవడంతోటే నేను వీధిపాలు కావలసివచ్చింది" అన్నది. "అయితే చుట్టాలు పక్కాలు లేరాతల్లీ నీకు" అని నాయుడు అడిగాడు. "ఏం జెప్పను. అలాంటివారుండీ నాకీగతి గలిగిందంటే, వారుండీ లేనట్టేగా, కనుక నా కెవ్వరూ లేరనే తీర్మానించు కొన్నాను. యీకూనకోసం యింతావగుస్తున్నాను

లేకుంటే యీ కష్టాలెన్నో ఈ నోకదోవచేసుండేదాన్ని" అని పొంగి వస్తుండిన దుఃఖాన్ని మింగుకొనే ప్రయత్నం చేసింది.

నాయుడు గారికి ఆమెనుచూస్తే, ఏదో ఒక అకారణమైన, పితృ వాత్సల్యంలాంటిది మనసులో కలుగజొచ్చింది. ఆమెను ఊరడించేందుకు నాలుగు వేదాంత వాక్యాలు పలికాడు. ఒక అణాకు బిస్కత్తులు తెప్పించి, లలితకిచ్చాడు. ఆయన కరుణాపూరితమైన పెద్ద మనస్సును, పద్మ గుర్తెరింగి, సాహసించి, "అయ్యా మీరేమి అనుకోకుంటే, ఒక మనవిచేసుకుంటాను" అన్నది. "చెప్పమ్మా పరవాలేదు" అన్నాడాయన. "నాకు బిచ్చమెత్తి బ్రతకాలనిలేదు. కాని, ఎవ్వరి నడిగిన ఏ విధమైన కూలిపనికూడ యివ్వరైరి. అందుచేత పస్తుండలేక, యోచించడమైంది. నాకు కొంత మీ వ్యాపారానికి ఉపయోగపడే విద్య తెలుసు. దానిని మీరుపయోగించుకొని, నాకు నా బిడ్డకు ఇంత అన్నానికి బట్టకు యిస్తుంటే నేను తృప్తితో మీ నౌకరిచేస్తాను"అని అడిగింది. "నేనే అంచామనుకుంటే, నీవే అడిగావమ్మా. అలాగే కాని, చమికీ కుట్టడం తెలిస్తే, తులానికి రూపాయన్నర కూలీ యిస్తామమ్మ. మిగతా పనుల కన్నిటికికూడ వాటి వాటికి తగినట్లు రేట్లు ఏర్పడే వున్నాయి. కావలెనంటే, యింట్లోకూడా పనిచేసి తెచ్చిచ్చి కూలి పట్టుకెళ్ళవచ్చు" అన్నాడాయన. "చాలా కృతజ్ఞురాలను. కాని నా కిల్లంటూ యేమీలేదు. ఇక్కడనే కూర్చొని పనిచేస్తాను", అన్నది పద్మ. "ఎబ్బే అంగట్లో ఎలావుంటావమ్మా, ఒక వారమో, పది రోజులో, పనిచేసి కాస్త చేతిలో రూకలు మిగిలించుకొని, ఎవరింట్లోనైనా ఒక గది అద్దెకు తీసుకుందువుగాని,,

అందాకా మా యింట్లోనే కాస్త వండుకొని తింటూండమ్మా. మా ఆపెక్కూడ తోడుగానే ఉంటావు" అన్నాడాయన. దాంతో పద్మ కెక్కడ్లేని ధైర్యమూ, ఆనందమూ కలిగాయి. వెంటనే పనిలో ప్రవేశించింది. బిడ్డలు లేని కారణాన, లలితను తన వెంటనే తిప్పుతూ, పనివారిపైన తనికీచేస్తూ, వచ్చిపొయ్యే బేరములుచేస్తూ ఉండేవాడు నాయుడు.

ఆయనన్నట్లు, ఒక నెలపాటు తన ఇంట్లోనే, పద్మకు వసతిచేసి యిచ్చాడు. ఆయన భార్య అండాలమ్మకూడ చాలా మంచిదె. పద్మను. స్వంత కూతురిలాగ విచారించుకుంటూ వుండింది. మొదటి నెలాఖరుకు పద్మ సంపాదించిన దానికితోడు, పాతిక రూపాయలు అడ్వాన్సుగా యిచ్చి, నాయుడుగారే, రాయపేటలో ఒక చిన్న సందులోని యింట ఒక గది అద్దె కేర్పాటు చేసిచ్చి, అందులో ఆమెను ప్రవేశపెట్టాడు. తనకు కావలసిన నాలుగు చిన్న చిన్న పాత్రలు కొనుక్కొని, స్వంత కాపురం ఆరంభించింది పద్మ. రోజూ ఉదయమే వంటచేసుకొని బిడ్డకుపెట్టి, తాను తిని, రాత్రి యింటికి తెచ్చుకొని కుట్టిన బట్టలు వగైరాలతోసహా తీసుకొని, మధ్యాహ్నము లలితకు ఒక అల్యూమినియం డబ్బిలో కొంచెం పెరుగన్నం కలుపుకొని పెట్టి, అన్నింటిని, తన చేతి పెట్టెలో పెట్టుకొని, బస్సుఎక్కి మైలాపూరులో దిగి, నాయుడుగారి అంగడిచేరి, పనిచేసి, సాయంకాలం ఆరు గంటలకు మరల యిల్లు చేరడం, ఆమెగారి దినచర్య అయింది

---

# పదునైదవ ప్రకరణము

అదే మద్రాసులో, మాంబళములో వున్న శ్రీధరరావు గారి భార్యకు, నవమాసములునిండి, రెండు మూడు రోజులు నొప్పులుపడి, అందరూ "ఏమౌతుందో" అని భయపడుతుండగ, తుదకు సులభంగ ఒక ఆడ శిశువును ప్రసవించింది. ప్రసిద్ధి చెందిన ఒక లేడీ డాక్టరు, ఇద్దరు నర్సులు, ఆమెకు పురుడు పోశారు. ముందే టెలిఫోనాఫీసులో విచారించి, గడియారాన్ని సరిదిద్ది పెట్టుకొని ప్రసవించిన క్షణంతోసహా గంటను గుర్తు వ్రాసుకొని, జోస్యుని రావించి, జాతకం వ్రాయమన్నాడు శ్రీధరరావు. జోస్యుడు పంచాగం విప్పి, లెక్కలువేసి ఒక కుండలి తయారుచేసి, చాలా అదృష్టవంతురాలౌతుంది యీ బిడ్డ అనిచెప్పి, నూటపదహారు రూపాయలు, టెంకాయ తాంబూలం, అరవీశ కలకండ, అరటిపండ్లు అన్ని మూటగట్టు కొని వెళ్ళాడు. అంతటితో తృప్తిపడక, ఒక నాడీ గ్రంథం వానికడకేగి, తన బిడ్డ జాతకమందులోవుంటే వెదకమన్నాడు. ఆ నాడీ గ్రంథంవాడు వెదకి, అరవంలో కొన్ని పద్యాలు చదివి "ఆ బిడ్డ సకల సౌభాగ్యాలతో తులతూగుతూ పుత్రి పౌత్రుల మధ్య డెబ్బదిరెండేళ్లు జీవించి యుంటుందని" అర్థం చెప్పి, తన కానుక నూరు రూపాయలని పుచ్చుకున్నాడు. యథావిధిగా పదునొకొండవ రోజు, పురుడుతీరి, నవగ్రహి, నామకరణం, బ్రాహ్మణ సంభావన, పండిత సన్మానం, అన్న దానం, విపులంగా జరిపాడు శ్రీధరరావుగారు. అందరూ

బిడ్డను అన్ని విధాలా ఆశీర్వదించి వెళ్లారు. ఇక ఆ బిడ్డకుగాను ఆయన చేయని శెలవులేదు. ఒక వెండి ఉయ్యాలేనా, దానికి రంగు రంగుల రకరకములైన, చిన్న చిన్న బొమ్మలతోనిండిన చాందినీయేనా, అందులో చిన్న మఖ్మల్ పరుపు. ఇంటినిండ ఆట సామానులు, యంత్రనిర్మితములైనబొమ్మలు, ఒకటేమి, తుదకు బిడ్డను కూచోబెట్టి తోసుకపోయే రబ్బరు చక్రాల చిన్న బండినికూడ, అప్పుడేకొనిఉంచాడాయన. ఇంతేగాకుండా ఆ కూనకొక చిన్నరవలనెక్లేసు, పదివేళ్ళకువుంగరాలు, చేతులకు వొత్తులుకూడా చేయించి తొడిగాడు. రాధాదేవి సదా ఆ నలు సంత కూనను చూచుకొని మురిసిపోవడంతోనే సరిపొయ్యేది. నెల పురుడు తీరింది. ఆమెగారు మడిబట్టి వంటయింట్లోకి వెళ్లడ మారంభించారు.

ఒకరోజు తిరుపతయ్యగారు పట్నంలో రైలుదిగి తన చేతిపెట్టెతోకూడ శ్రీధరరావు గారిల్లు చేరి, ఆ దంపతుల క్షేమాతిశయాలు విచారించి, ఉయ్యాలలో నిద్రిస్తుండిన బిడ్డను దగ్గరకు వెళ్లిచూచి, "ఉడుతకు ఉడుతాభక్తి అన్నారు" అంటూ ఒక చిన్న వెండి ఉగ్గుగిన్నెను, జేబులోనుంచి తీసి, రాధాదేవిగారి చేతికిచ్చాడు. మామూలు ప్రకారం వారింట్లోనే కాఫీ, ఫలహారం ముగించుకొని, కావలసిన పుస్తకాల జాబితా రావుగారి కందించాడు. ఆయనగారూ పంపే యేర్పాట్లు చేస్తానన్నాడు. ఇంతలో స్నానానికి లెమ్మని రావుగారితో చెప్పి. రాధాదేవి, లోపలికి వెళ్లింది. తొట్లకడ నిలుచొని బిడ్డను చూస్తూ యున్న తిరుపతయ్యను యీ పూట, యిక్కడే వుండ

మని రావుగారంటే, "కాదులెండి. చైనాబజారులో కొంచెం పనుంది. దాన్ని చూచుకొని, అలాగే హోటల్లో భోజనంచేసి రైలుకు వెళ్ళుతాను" అన్నాడు తిరుపతయ్య. "సరే అలాగైతే మరి సెలవు" అంటూ శ్రీధరరావుగారు స్నానానికి వెళ్లారు.

# పదునారవ ప్రకరణము

యథాప్రకారం పద్మావతి తన బిడ్డనెత్తుకొని, చేతి పెట్టెను తీసుకొని, బయలుదేరుతుండగ, యిల్లుగల్లామె, తన బిడ్డకు ముందురోజుకొన్న ఒక చిన్న బంగారు నెక్లేసుచూపి, "బాగుందా" అని అడిగింది. దాన్ని చూడడంతోనే, తనకూ అలాంటి నెక్లేసు కావాలని లలిత మారాం చేయడం మొద లెట్టింది. "పోనీ యెందుకేడిపిస్తారు. దీన్నేవేసి తీసుకవెళ్ళండీ, సాయంకాలం మొచ్చినప్పుడివ్వచ్చు" అన్నది యింటామె. "ఆఁ- వద్దులేండీ కాసేపేడ్చి తానే ఊరుకుంటుంది" అంటూ లలితను కోపించుకుంటూ బస్ స్టాండుకు వెళ్ళింది పద్మ.

అక్కడ బస్‌కు కాచియుండగ తిన్నగ అక్కడికే వచ్చి చేరిన తిరుపతయ్య ఆమెనుచూచి, క్షేమం విచారించాడు. ఆమె తాను చేస్తూయున్న వుద్యోగం సంగతి చెప్పుతుండగా, బస్సుగ్గా నిద్దరు యువతులు వచ్చిచేరారు. వారి మెళ్ళల్లోకూడ ఒక్కొక్క నెక్లెసుండడంచూచి లలిత మళ్ళి నెక్లెసుగ్గా ఏడ్వారంభించింది. ఉదయంనుంచి నెక్లెసు కావాలని ఆపిల్ల చేస్తూండే మారామంతా పద్మ చెప్పేసరికి, తిరుపతయ్య చేతిలోని పెట్టెను క్రిందబెట్టి, జేబులోనుంచి పదిరూపాయల నోటొకటి తీసి పద్మకిస్తూ "ఒక గిల్టుదయినా నెక్లెసు కొనివెయ్యమ్మా పాపం. ఎందుకలా ఏడ్పించడం" అన్నాడు. పద్మయెంత వద్దని నిరోధించిన వినక తీసుకోమన్నాడు. పద్మ తనచేతిపెట్టెను క్రిందబెట్టి గత్యంతరం లేక ఆనోటును తీసుకొని, కొంగులో మూటకట్టుకుంటుండగ

తిరుపతయ్యా యెక్కేబస్సు వచ్చింది. ఆయనపెట్టె తీసుకొని అవసరంగా వెళ్లాడు. ఆబస్సు పోవడంతోటే, తనబస్సువచ్చింది. క్రిందనున్న చేతిపెట్టెను తీసుకొని పద్మకూడ లలితను పిలుచు కొని బస్సెక్కి వెళ్లింది.

మైలాపూరు బస్సులన్నీ ఆగేచోట, అందరూదిగుతూ యుంటే పోలీసులు ఒక్కొక్కరిని సోదాచేసి, ఎమీ చిక్కనందు వల్ల అందరిని వదలి వేస్తుండినారు. ఆఖరుకు పద్మ, ఆమెతో బాటు మరిముగ్గురాడవాళ్లు మిగిలారు. ఆనలుగురిని పోలీసు స్టేషనులోకి పిలుచుకవెళ్లి, అక్కడ ఒక ఆడమనిషిచేత సోదా చేయించారు. ఎవ్వరికడ, ఏమీచిక్కలేదు. ఆముగ్గురిని పంపివేసి పెట్టెలో యేముందో చూపమన్నారు పద్మను. తను రంగ నాయకులునాయుడుగారి షాపులో కుట్టుపనిచేసేదాన్నని, ఆ పెట్టెలో తను రాత్రియింటిలో కుట్టినబట్టలు, మధ్యాహ్నం బిడ్డకుగాను ఒక డబ్బిలో పెరుగన్నం మాత్రం యున్నాయని ఆమెచెప్పినా, వారుపెట్టె తెరచిచూపమని తొందరపెట్టారు. తన బీగంతో పెట్టెను తెరువబోయిన పద్మ ప్రయత్నించి విఫల మైంది. పెట్టె ఎందుకు తెరువుడు పడలేదో తనకే అర్థంకాలేదు. ఈ గందరగోళంలో లలితేమో నాకునెల్లకేసే అంటూ నిలపకుండా పోరుపెడుతూనేవుంది. తనకేమీ పాలువోక, ఆబీగం ఒకపోలీసు చేతికిచ్చి తెరువమన్నది పద్మ. ఆకానిస్టేబిల్ ఆ బీగాన్నందుకొని పెట్టెను తెరిచే ప్రయత్నాలెన్నో చేశాడు. కాని, అతనివల్ల కాలేదు. అంతట సబ్ఇన్స్పెక్టరు తాళం పగులకొట్టక తప్ప దన్నాడు. ఒక యినుపకమ్మినిపెట్టి త్రిప్పి ఆపెట్టెను తెరిచారు. మూత పైకిలేవగానే, దానిలోనుండిన దృశ్యాన్నిచూచి,

పద్మకు గుండెలాగి, అట్టే నిర్ఘాంతపోయింది. ఉన్నవారందరు, ఆశ్చర్యపడి పెట్టెనుమూసి, ఆమెవైపు చూడసాగారు. ఇంతటికి లలిత మాత్రం నెక్లేసు పాటనాపలేదు.

ఇన్‌స్పెక్టరు కమీషనరుకు ఫోనుచేశాడు. పద్మకు గ్రుడ్లు తిరిగిపోతున్నాయి. మెల్లగ అక్కడున్న బెంచిమీద కూలబడ్డాది. ఇన్‌స్పెక్టరు ఫోనులో కమీషనరుతో చెప్పిన దాన్నుంచి ఆ పెట్టెలోని శవం ఎవరో శ్రీధరరావుగారి చంటిబిడ్డదని, ఆబిడ్డ పైనవుండిన నగలు కనుపించలేదని, ఆమెకు అర్థమైంది. ఏం చేయును ఆమెకు దిక్కుతోచలా. నోటతడి ఆరిపోయింది. తానే పాపమెరుగనని యెంతమొత్తుకున్నావినకుండ, ఆమెను పోలీసు వ్యానులో నెక్కించి, కమీషనరు ఆఫీసుకు తీసుకవెళ్లి, అచట ఆమె వాఙ్మూలము తీసుకొని రిమాండులో వుంచారు పోలీసువారు.

ఆ పోలీసు ఇన్‌స్పెక్టరు, రంగనాయకుల నాయుడుని పిలిపించి, పద్మసమాచారము అతనికి తెలిసినంతవరకు చెప్పగా విన్నాడు. పద్మావతికి సంభవించిన గతికి నాయుడుగారుచాలా ఖేదపడి ఇన్‌స్పెక్టరు అనుమతితో, రిమాండులోఉన్న పద్మను చూచాడు. ఆమె ఆయననుచూచి భోరున యేడ్చింది. ఆయన ఆమెను సముదాయించి జరిగిన విషయమంతా విన్నాడు. తను యింట్లో బయలుదేరినది మొదలు, బస్‌స్టాండులో తిరుపతయ్యను సంధించి ఆయనిచ్చిన పదిరూపాయలూ తీసుకోవడం, వెంటనే బస్సురావడం, అందులో యెక్కి మైలాపూరులో దిగేసరికి, పోలీసులు పట్టుకోవడం, అటుపిమ్మట జరిగిన కర్మకాండంతా

వివరంగాచెప్పింది పద్మ. నాయుడంతా విని "తిరుపతయ్య యిచ్చిన పదిరూపాయలు దాచుకొనేందుకు పెట్టెను క్రిందబెట్టి నప్పుడో లేకుంటే మధ్యలో బస్సులోనుంచి దిగిపోయే ప్రయాణీకుడెవడైనానో ఆపెట్టెను మార్చివుండాలి" అని అన్నాడు. మంచివకీలు మాదిరి, తరచి, చాలా ప్రశ్నలు వేసి ఆమెకడనుంచి వెలువడే జవాబువల్ల ఏదైన అంతు చిక్కుతుందేమోనని చూచాడుగాని, ఏమి ఉపయోగంలేక పోయింది. తుదకు తన శక్తిసామర్థ్యాలన్నీ వినియోగించి, ఆమెను తప్పించే ప్రయత్నం చేస్తానని గట్టిగాచెప్పి, అమె దుఃఖాన్నిచూడలేక, తనూ చెమ్మగిల్లినకళ్లతో "ఇక్కడ నీతో లలితకూడా వుండడం భావ్యం కాదమ్మా; నే తీసుకొనివెళ్లి రోజు తెచ్చిచూపుతుంటానని" అన్నాడు. ఆమె దాన్నివదలి వుండలేనన్నది. కాని, నాయుడెన్నో విధాలబోధించి, జైలు అధికారుల అనుమతితో ఆబిడ్డను యింటికి తీసుకొనిపోయినాడు. లలితకూడ ఆయనకు చాలా మాలిమైనందున అట్టె గలభాయేమీ చేయక కూడావెళ్లింది. దోవలోనే అది కోరినదల్లా కొనిబెట్టి దానిని బుజ్జగించుతూ ఇంటికెళ్లి భార్యకా చిన్నబిడ్డ నప్పగించి, జరిగిన కథంతాచెప్పి, పద్మకేకీడు జరగకుండా బయటపడితే కొండకొచ్చి కానుక చెల్లించుకుంటానని వెంకటేశ్వర్లుకు మొక్కుకున్నాడు.

# పదునేడవ ప్రకరణము

లేకలేక అబ్బురంగ పుట్టినబిడ్డ బలవన్మరణానికి పాలు కావడంవల్ల ఆతల్లిదండ్రులు, అందులో రాధాదేవి, ఊరడింప బడకనే యుంది. అప్పటికే బిడ్డకై సేకరింపబడిన చిల్లరవస్తువులు ఆయింటిలో ఏమూలజూచినా పడియున్నాయి.ఒక్కొక్కవస్తువు చూడడం, బిడ్డను తలచుకొని ఒకయేడ్పు యేడవడంతో తెల్ల వారిపోతుంది ఆమెబ్రతుకు. వచ్చినవారంతా ఆమెకెన్నెన్ని విధాలనో చెప్పిచూచారు కాని, ఆమె దుఃఖమాగడంలేదు.

ఆబిడ్డ కళేబరాన్ని పోస్టుమార్టెం పరీక్షచేసి గొంతుపిసక డంవల్ల ఊపిరాడక ప్రాణంపోయియుండవలెనని చిన్న పెట్టెలో ఆశరీరాన్ని యిమడ్చడంలో, చేతులలోను, కాళ్ల లోను కొన్ని యెముకలు విరిగియుండవలెనని, శవం చిక్కినరోజే సుమారు ఉదయం గ॥10 లకు ప్రాణంపోయి యుండవలెననియు డాక్టరు సర్టిఫికేటిచ్చినాడని తెలిసి, మరిగొల్లుమన్నదామె. ఆ కేసుసంబంధంగా, యెప్పుడేప్రస్తావనవచ్చినా విచారించడానికే పోలీసు అధికారివచ్చినా ఆమెను పట్టశక్యంగాక పొయ్యేదెవరి కూ్కడాను. "ఈవిధంగా కుళ్లుతుంటే, నీవు బ్రతకటమే కష్ట మౌతుందే" అని శ్రీధరరావెన్నోమార్లు చెప్పాడు. కాని, "నేను మరువలేకున్నాను. నన్ను మీరివస్తుంటేనేనేంజేయను?" అనేదామే. ఆ పోయినబిడ్డకు సంబంధించిన ఏవస్తువుగూడా ఆమెకంటబడకుండ దాచేశాడు. అప్పటికీ ఆమె పద్ధతిమారలేదు.

క్రమేణ కాలమే ఆమె దుఃఖాన్ని ఉపశమింప జేయవలసిందేకాని మనుష్యమాత్రుడివల్ల సాధ్యమయ్యేటట్టులేదని ఆయన విసుగుతో ఊరకుండేవాడు.

## పదునెనిమిదవ ప్రకరణము

కొద్ది రోజులలోనే మేజస్ట్రేటుకోర్టులో పోలీసువారు పద్మావతిపై కేసుదాఖలు చేశారు. అక్కడ ఆకేసు మామూలు కర్మకాండ నెరవేర్చుకొని సెషన్స్ కోర్టెక్కింది. అక్కడ విచారణలో, తనకెవ్వరూ లేరని, తనకేమీ తెలియదని, తాను నేరస్తురాలు కాదనేదితప్ప ఆమెనోట మరొకమాట రాలేదు. ముద్దాయికి సాక్ష్యంలేక పోవడంచేతను, మృతకళేబరంతో పోలీసులకు చిక్కడంచేత, కేసుబలపడి, జడ్జీ జ్యూరితో ఏకీభవించి, ఆమె నేరస్తురాలని తీర్మానించి పన్రెండు సంవత్సరములు కఠిన శిక్ష విధించాడు. దాంతో ఆమెగుండెపగిలి అక్కడే కూలింది. ప్రక్కనేవున్న ఒక ఆడజయిలరు ఆమెను లేవదీసి నిలువబెట్టింది. నేరస్థురాలిబిడ్డను పోషించుటకు ఎవ్వరూలేరని తెలియుటవలన ఆబిడ్డను ఊళ్లోవుండే అనాధశిశుశరణాలయంలో చేర్చవలెననియు, నెలకొకమారు తల్లివచ్చి బిడ్డను చూచి పోవచ్చుననియు, అందుకై జయిలధికారులు కావలసిన సౌకర్యమేర్పరచ వలసినదనియుగూడ జడ్జీఆర్డరువేశాడు దాంతో ఆమెను బైటవేచియున్న వ్యానుకడకు తీసుకొని పోయినారు.

అంతవరకు లలితనెత్తుకొని కోర్టులోనే వేచియుండి, శిక్ష చెప్పడంతోటే దుఃఖంపట్టజాలక బయటికొచ్చిన నాయుడు గారుకూడ ఆమెకడకు వచ్చాడు. పద్మ లలితను ఆయన చేతుల్లోనుంచి జవురుకొని, గుండెలకు గట్టిగా అదుముకొని దాని వొళ్ళంతా ముద్దులు పెడుతూ, తన కన్నీళ్లతో దాన్ని తడిపి

వేస్తుంటే, ఏమీ తెలియని ఆ బిడ్డ తల్లి మెడ కరుచుకొని, తానూ పెద్దగ యేడువసాగింది. చుట్టూ చేరిన ప్రతిఒక్కరు కంట తడిపెట్టనివారులేరు. ఆమెను చూస్తే అలాంటి హంతకు రాలనేందుకు ఎవ్వరికీ మనసురాలేదు.

"ఇక పంద్రెండేండ్లు! అబ్బ!!! అన్నాళ్ళు కారాగారవాసం ఎలా అనుభవించను? ఆత్మహత్య చేసుకుంటేనేమి? మరి లలిత గతో? ఏనాటికైనా బయటపడి దాన్ని చూచుకుంటూ మిగత జీవితాన్ని గడిపేయడం మేలుకదా! అందాక అనాథశరణాల యంలో చదువుకుంటుంది. నెలకొకమారు చూడవచ్చుగా!" అని యిలా తనలో తాను తర్కించుకుంటూ వుంది పద్మ. ఇంతలో "ఎంతసేపీ నాటకం. కానీ, ఆబిడ్డ నా నాయుడు చేతి కిచ్చి నీవు బండి యెక్కు" అని కటికవానివలె గదిరించాడా సబ్ ఇన్‌స్పెక్టరు. ఆమె యోచనలన్నీ పలాయనమై, మళ్లీ పెళ్ళగించుకొని దుఃఖం పైకొచ్చి, బిడ్డ నెవ్వరికి యివ్వనన్నట్లు, మరీ గట్టిగ హత్తుకొన్నది. కాని, ఆ పాషాణహృదయుడు సబ్‌ఇన్‌స్పెక్టరు (ఆయనకు బిడ్డలు లేరేమో) ఆ బిడ్డను ఆమె చేతుల్లోనుంచి పెళ్ళగించి నాయుడి కందించి, ఆమెను రెట్ట బట్టి లాగి బండెక్కించాడు. ఆ బిడ్డ నిజస్థితి యెఱిగిన దాని వలె, చూచేవారందరికి గుండెలు నీరయ్యేటట్టు "అమ్మా నేను వత్తానే! అమ్మా" అంటూ పెద్దగా రోదించింది. నాయుడికి నోట మాటరాలేదు బిడ్డ నోదార్చేందుకూ్కడ. వ్యాను తలుపు లను మూసి గడియవేసి, డ్రైవరు తన తావున చేరి బండిని సాగించాడు. బుఱ్ఱున అది వెళ్లిపోయింది.

సబ్ ఇన్‌స్పెక్టరు ఆ నాయుణ్ణి, బిడ్డనూ పిలుచుకోని, ఆ ఊరి అనాధశరణాలయానికి వెళ్ళి, లలిత నచట చేర్చాడు. ఇంతలో నాయుడుతాతను కూడా వదలజాలక ఆబిడ్డ హాఠం జేసింది. కాని, ఆ శరణాలయంలోని అధికారి చాల శాంత స్వభావురాలునూ్నా. బిడ్డల నోదార్చడంలో బహునేర్పుగల మనిషగుటచేత వెంటనే లలితకు కొన్ని, ఆటసామానులు ముందుబెట్టి, నాయుడుగారిని వెళ్లి, బిస్కత్తులు, ద్రాక్షపండ్లు, యింకా యేవేవో తెమ్మని చెప్పి (ఊరకనే) ఆయనను పంపి వేసి, లలితను తీసుకొని మిగత పిల్లలుండే కూటంలోనికి వెళ్ళి వాళ్ళమధ్య వదలి, వాళ్ళతోపాటు తాను కొంచెముసేపు ఆడు కుంటూ కూర్చుంది. ఈడూ జోడు పిల్లలు చాలమంది యుండడంచేతనూ, ఆడుకునేందుకు కావలసినన్ని ఆటవస్తువు లుండుటచేతను, ఆ అమాయకపు చిట్టితల్లి, అన్ని మఱచి, ఆబిడ్డలతో, కులాసాగా ఆడుకోనారంభించింది.

---

# పందొమ్మిదవ ప్రకరణము

ఆనాటి రాత్రి రైలులోనే, పద్మను వేలూరుకు పంపించారు. ఆ మరునాడు వేలూరు జైలులో ఆమెను దాఖలు చేసి వెంట వచ్చిన పోలీసులు, పట్నానికి మరిలారు. జయిల్లో చేరినతోడనే, ఆమెను పిండి విసిరేందుకూ, వంట చేసేందుకు అధికారులు నియమించారు. కాని ఒక్క వారం రోజులలో, ఆమె గుణాతిశయాలను గమనించి, ఆమెను కొంచెం సుళువైన పనులలో పెట్టనారంభించారు. మరికొన్ని రోజులయ్యేసరికి, జెయిలు సూపరెంటెండెంటుగారికి ఆమెపై చాలా కనికరం కలిగి, మొరటు పనులేమి ఆమెకివ్వక, ఆమె చక్కగ చేయగలిగిన కుట్టుపనులు చేయవలసినట్లు ఉత్తర్వుచేసి, అందుకు వలసిన పరికరముల నామెకు సప్లయి చేయించాడు. అందుచేత ఆమెకు శరీరకష్టము తప్పింది. కాని, తనకు సంభవించిన దుస్థితి, బిడ్డతో కలిగిన ఎడబాటు, ఆమెను సదా కోస్తూనే ఉండినది. ఉన్నట్టుండి ఒక్కసంగతి, ఆమెకు జ్ఞాపకానికి రావడం, ఆమె కళ్ళల్లోనుంచి ధార ధారగా. నీరు కారడం, ఇది రోజుకొక వందమార్లయినా జరిగేది.

ఇంతలో మొదటినెల గడిచిపోయి, ఆమెను బిడ్డను చూచి వచ్చేందుకు పట్నం పంపే యేర్పాటు జైలధికారి చేశాడు. ఒక రోజు, ఒక స్త్రీ వార్డరు, ఇద్దరు పోలీసులతో కూడ, ఆమె పట్నంచేరి, అనాథ శరణాలయానికి వెళ్ళి, అచటి అధికారి జ్ఞానాంబగారికి తన్ను తెలియబరుచుకొని, ఆబిడ్డను

పిలువగా, పద్మ దానిని జపురుకొని గుండెలకేసి అదుముకొని ముద్దులతో నింపి, ఆనందభాష్పాలతో ముంచేసింది.

లలితకు పట్టరాని ఆనందంవచ్చి ఏమేమో, అమ్మనడగ దలచుకొని పూర్తిగా మాటలన్నీ రాని కారణంచేత, "అమ్మ ! అమ్మ! చూడు! చూడు! నివ్వే" అంటూ, కాసేపు తడబడి, తుదకు పద్మకూచోడంతోటే ఆమె వొళ్ళోచేరి "అమ్మా నన్నొదిలిపెట్టి పోయినావా, నామీద కోపమా నీకు" అన్నది. "అయ్యో! పిచ్చి తల్లీ! నీమీద కోపం లేదమ్మా ! నీవు నా బంగారు తల్లివే" అని కౌగలించుకొని మళ్లీ ఒక ముద్దు పెట్టింది. "మరైతే నీ వెక్కలికి పోయ్యావు యిన్నాళ్లు? ఇంకెక్కలికి పోవుకదూ? నాతో కూలానే వుండాలి. ఈ అత్త (జ్ఞానాంబను చూపుతూ) చాలా మంచిదమ్మా ! పప్పలమెంట్లు, బిచికత్తులు, అన్నీ యిత్తుంది. నీకు యిత్తుంది. మనమిద్దలం బొమ్మలు పెత్తుకొని ఆలుకుందాం" అని లలిత తల్లి చెంపలు పట్టుకొని అడిగింది. దాని పలుకులకొక వైపు ఆనందమౌతున్నా, మరొకవైపు "దానికేం బదులు చెప్పనా" అని కలవరపడుతూంది పద్మ. ఇంతలో జ్ఞానాంబ "అలాగే కానీ అమ్మ. మీ అమ్మ పోదులే" అని ఓదార్చి పద్మతో మాట లారంభించింది.

జ్ఞానాంబగారు, పద్మనదే ప్రథమంగా చూడడమైనా ఆమెకేదో గ్రహపాటు చాలక, హత్యానేరం పైబడిందేకాని, వేరుకాదని, మనసులో తీర్మానించి, పద్మపై కరుణ, జాలి కలిగి లలిత విషయమై, తాను ప్రత్యేకశ్రద్ధ చూపుచున్నాననీ, యెల్లప్పుడు ఆలాగే చూపుతానని. తానేలాంటి దిగులు బిడ్డను గురించి పెట్టుకోనవసరములేదని, పద్మకు వాగ్దానం చేసింది.

పద్మ సంతసించి, "దాన్ని కన్నది నేనైనా, నీకూతురైం దిప్పుడు. ఇందరు బిడ్డలను సదా ఏలోపం లేక కులాసాగా పెంచుతున్న మీకు నేనధికంగా చెప్పనక్కరలేదు. పూర్వ జన్మలో నేనెంత పాపం చేశానో, ఏ తల్లీబిడ్డలను వేరుచేశానో, భగవంతుడిప్పుడిట్లా చేశాడు. అయినా నీ చేతిలో దాన్ని ఉంచడంకూడ యీ సమయంలో భగవంతుడు నాకు చేసిన మేలే అనుకుంటాను" అంటూ జ్ఞానాంబ చేతులు రెండు పట్టు కొని కన్నీళ్ళు కార్చింది. "నీబిడ్డ మంచి అదృష్టశాలి అవుతుం దని నాకు నమ్మకమమ్మా! నీవేమీ భయపడకు. ఎవరికి గాని, కష్టాలు సదా నిలచియుండవు. నీవు బయటబడే నాటికి పిల్లను బాగా చదివించి యెలా తయారుచేస్తానో నీవే చూస్తావుగా! ఇక్కడుండే యిందరు బిడ్డలలో యిదే మహాసూక్ష్మబుద్ధి గలది. దేవుడు మీకందరికి తప్పక మేలు చేస్తాడు" అని జ్ఞానాంబ అంటూయుండగ, గోడపైని గడియారం నాలుగు గంటలు కొట్టింది. బిడ్డలందరిని తోటలో ఆడుకునేందుకు పంపమని దాదికి చెప్పి జ్ఞానాంబ పద్మకు కొంచెం తేనీరు యిచ్చి, తాను త్రాగింది.

వెంట వచ్చిన ఆడవార్డరుకు కూడా టీ యిచ్చారు. ఆమె తాగి, రైలుకు బయలుదేరే వేళ అయిందని, పద్మను హెచ్చ రించింది. ఆ హెచ్చరికతో మరల పద్మకు గుండెలో పిడుగు పడింది. కాని, తప్పదుగనుక బిడ్డ నొకమారు ముద్దాడి వస్తానని, తోటలోకి వార్డరుతో కూడా వెళ్ళింది. అచ్చట అంతా మరచి పిల్లలతో ఆడుకుంటున్న లలితను చేరదీసి, యెత్తు కొని కావలసినన్ని ముద్దులు బెట్టి "తల్లీ! యిక్కడ యీ పిల్ల

లతో ఆడుకుంటుంటే నీకు హాయిగా వుంది గదమ్మా" అని లలిత నడిగింది. "ఆయిగావుంది. అయితే నీవుంటే బాగా వుంతుందమ్మా" అని అన్నది లలిత. "నేను మళ్లీ వస్తానమ్మా అప్పుడప్పుడు వచ్చి నిన్ను ముద్దాడి వెళ్ళుతూ ఉంటానమ్మా" అన్నది పద్మ. "ఊహు. ఎప్పుడూ యిక్కడే ఉండాలి" అన్నది లలిత. "ఇక్కడ పెద్దవాళ్ళు ఉండగూడదమ్మా, పసి పిల్లలు మాత్రమే ఉండాలి." "అంతా అబద్దాలు, పెద్దవాల్లూ వుంతారు, మేత్రలమ్మ, నలుసు, అంతావుందలా." "వాళ్ళు, మీ కంతా బువ్వ బెట్టేందుకు, చదువు నేర్పేందుకు, ఆడించు కొనేందుకు ఉన్నారు. మరెవ్వరు ఉండకూడదమ్మ. చూడూ! యీపిల్లల అమ్మ లెవరైన యిక్కడ ఉన్నారా" అని సమాధానం చెప్పే సరికి, లలిత కాస్త యోచిస్తూ ఊరకుంది. ఇంతలో వార్డరు పోదామన్నట్లు పద్మకు సైగచేసింది. ఇంతలో జ్ఞానాంబ వచ్చి చాటుగ కొన్ని పిప్పరమెంట్లు పద్మ చేతికిచ్చి, బిడ్డకిచ్చి పొమ్మ న్నది. వాటిని తీసుకొని, లలిత రెండు చేతులు నిండ నింపి, ముద్దులు బెట్టుకొని, నీళ్ళతో నిండిన కళ్ళతో దాన్ని తన చేతులతో జ్ఞానాంబ కందించి, సరక్కున తిరిగి వెళ్ళింది. లలిత "అమ్మా! ఎక్కలకమ్మా పోతావు నేను వత్తానే అమ్మా! అమ్మా!" అంటూ, పెద్దగా ఏడ్వ నారంభించింది.

ఇంతలో రోడ్డులోకి వచ్చి, తోట ప్రహరీ కటకటాల ప్రక్కగా వెళ్ళుచుండిన పద్మను చూచి, లలిత కటకటాల కడకు పరుగెత్తి, ఆకమ్మీల సందులోనుంచి, తనచిన్న చేతులను జాచి "అమ్మా! రావే! నేనూ వత్తానే అమ్మా!" అంటూ చూచిన వారి కంతా హృదయం భేదించేటట్టు దుఃఖించ

సాగింది. పద్మకు కాళ్ళాడలేదు. కాని ఏం చేయగలదు? "మళ్ళీ వస్తానమ్మా" అంటూ గబగబ వెళ్ళిపోయింది. జ్ఞానాంబ వచ్చి బిడ్డను యెత్తుకొని సముదాయించ బోతే "నాకు అమ్మ కావాలి" అంటూ యేడ్పు సాగిస్తూనే వుంది లలిత. "నర్సూ వీళ్ళమ్మను పిలుచుకొనిరా వెళ్ళు" అని నర్సుకు కంటితో సైగచేసి "ఏడవొద్దు తల్లీ! అమ్మ ఇప్పుడే వస్తుంది. పోయిందిగా నర్సు అమ్మను పిలుచుకొని వచ్చేందుకు" అంటూ, ఏవేవో మరపించే మాటలు చెప్తూ లలితను లోపలికి తీసుకెళ్ళింది.

•

# ఇరువదియవ ప్రకరణము

బిడ్డపోయి రెండు మాసములకు పైబడ్డా, రాధాదేవికి రోదనం మాత్రం తగ్గలేదు. ఇంట్లో ప్రతి పనికి, ఒక్కొక్క నౌకరుండడం వల్ల, ఆమెగారికి వేరేపని లేక, సదా బిడ్డను తలచుకొని దుఃఖించడమే పనైంది. దీన్ని గమనించిన శ్రీధర రావు గారి మిత్రుడు, సబ్ జడ్జీ చేసి పెన్షన్ తీసుకుంటున్న రామేశంగారు, ఒక రోజు రాధాదేవి వింటూండగ చూడండి! శ్రీధరంగారూ! బిడ్డ పోవడంతో, సాధారణంగా ప్రతి తల్లికీ దుఃఖం సహజమే. కాని రాధాదేవి గారికి ప్రొద్దుబుచ్చుకు నేందుకు యే వ్యాసంగం లేక పోవడం, ఆ దుఃఖాన్ని మరింత రెచ్చగొట్టింది. ఒకమాటు దోవ పడింది గనక, మీకు మళ్ళీ సంతానం కలుగవచ్చు. ఎందరు పుట్టినా, తినేందుకు కావలసి నంత ఐశ్వర్యము యిచ్చాడు భగవంతుడు. కనక నాకు తోచే దేమంటే, ఎవరినైనా ఒకచిన్న ముచ్చటైన బిడ్డను తెచ్చి మీరు పెంచుకుంటూండండి. ఆ బిడ్డతో ఆడుకుంటూ, దాన్ని ఆడించు కుంటూ, ఆమెగారు శీఘ్రంగా గతాన్ని మరచి పోతుంది". అన్నాడు రామేశంగారు. ఆ సలహా శ్రీధరరావుగారికి నచ్చి, భార్య అభిప్రాయాన్ని అడిగాడు. ఆమెగూడ "అదిచూదాం" అన్నది.

•

మరియిక యెవరు బిడ్డనిస్తారు, ఏలా సంపాదిద్దామనే యోచనపుట్టింది శ్రీధరరావుగారికి. అందుకు రామేశంగారేసలహా యిచ్చారు. ఆవూళ్ళోని అనాధ శరణాలయానికి వెళ్ళి

చూద్దామని. సరేనని ఉభయులూ వెంటనే కారెక్కి అనాధ శరణాలయానికి వెళ్ళి జ్ఞానాంబగారిని దర్శించారు. ఆమె వారిని చాలా మర్యాదచేసి, తన ఆఫీసు గదిలో కూర్చోబెట్టి క్షేమ సమాచారాలు విచారిస్తూ "తమ శరణాలయానికి ప్రతి సంవత్సరం తప్పకుండ నూటఒక్క రూపాయ విరాళమిచ్చి పోషిస్తున్న రాజపోషకులలో శ్రీధరరావుగారొకరని" రామేశంగారికి తెలియజెప్పింది. "ఓహో! అలాగా! వీరు యీలాంటి ధర్మాలెన్నో సదా చేస్తూనే ఉన్నారు. నేనెరుగుదును. దేహీ అంటూ వచ్చిన ప్రతి ఒక్కరిని, ఏదోవిధంగా తృప్తి పరచి పంపడం వీరి నైజగుణం" అన్నారు రామేశంగారు. మాశరణాలయానికింత ఉపకారం చేస్తూ కూడ, ఒక్కరోజు మేమిచ్చట ఏంజేస్తున్నామా అని చూడడానికి కూడ వచ్చిన వారుకారు. ఏదో మా అదృష్టవశాత్తు నేడిలా వచ్చారు. రండి లోపలికి వెళ్లి మా ఏర్పాట్లను, యిచ్చటి అనాధలను చూచి మీసలహాలేమైనా వుంటే యిద్దురుగాని" అంటూ లేచి వారిని లోపలి కాహ్వానించింది. వారామెవెంట వెళ్ళారు.

ఆమె ఆ భవనాన్నంతా వారికి చూపి, తామచ్చట జరిపిస్తున్న కార్యక్రమాన్నంతా వారికి తెలియజెప్పి, ఆఖరుకు పిల్లలందరూ ఉన్న కూటంలోకి తీసుక వెళ్ళింది. అక్కడికి వారు ప్రవేశించినతోడనే, ఆ పిల్లలగుంపులోనుంచి, "అత్త అత్త" అంటూ లలిత జ్ఞానాంబ కడకు పరుగెత్తి వచ్చి, ఆమెను కలుచుకుంది. "దాన్ని ఆమె చంక నెత్తుకొని ముద్దాడుతుండగా ఆ బిడ్డ ఎవరి బిడ్డ, చూస్తే యీ మిగతా రకాల లాగలేదే" అన్నారు రామేశంగారు. "ఔనండీ! ఇంతా రెండు

నెలల క్రిందటనే మాకడ కొచ్చింది యీ పిల్ల. అనాధ. పాపం. చాలా బుద్ధిమంతురాలీ లలిత'' అన్నది జ్ఞానాంబ. ఆ బిడ్డను కన్నార్పకుండ ప్రక్కన నిలచి చూస్తున్న శ్రీధరరావుగారు ఆ అమ్మాయి గడ్డంబట్టి దాని ముఖాన్ని తన వైపుకు త్రిప్పుకున్నాడు. లలిత ఆయన కళ్ళల్లోకి చూస్తూ ఒక్క చిరునవ్వు నవ్వి, ఆయన కోటు జేబులోని పాంటేన్ పేనాను సరక్కున లాగివేసుకుంది. "అయ్యో! వద్దమ్మ, తప్పు" అంటూ జ్ఞానాంబ ఆ పేనాను దాని చేతులోనుంచి తీయబోతూ వుంటే "ఉండనీయండి పరవాలేదు" అంటూ శ్రీధరరావుగారా పిల్లను, "నాకడకొస్తావా" అన్నట్లు తన రెండు చేతులు జాచాడు. ఏమో చిరకాల పరిచితం లాగ,లలితజ్ఞానాంబ చంకలోననుంచి, ఆయన చేతుల్లోకి వాలింది. ఆయన దాన్నెత్తుకొని "నీకీపేనా కావలె నా అమ్మాయి" అన్నాడు. "ఊ" అంటూ ఒకచేత్తో పేనాను గట్టిగ బట్టుకొని, మరోచేత్తో ఆయన జేబు గడియారపు బంగారు గొలుసును లాగ సాగింది. జ్ఞానాంబ 'అలాచేయకూడదమ్మా' అంటూనా్న "పరవాలేదులెండి చిన్నపిల్ల దానికేం తెలుసు పాపం. నే చూసుకుంటున్నానుగా! ఏమీ కాదులెండి" అని శ్రీధరరావుగారు సమాధానం చెప్పి లలితను ప్రక్కనున్న మేజాపైన దించి, తన గడియారాన్ని గొలుసుతోసహా బయటికి తీసి, లలిత చెవులకడ కాస్సేపు పట్టుకొన్నాడు. అది టిక్ టిక్ అని చేస్తుండే శబ్దానికి, లలిత ఆశ్చర్యంతో, ఆనందంతో దాన్ని ఆయన చేతిలోనుంచి తీసుకొని, తానే చెవిదగ్గర పలుమారు పెట్టుకొని తీసి "అత్తా యిత్తాలా, దీన్ని చూలు తిక్కు,. తిక్కు అంతూంది" అన్నది. ఆ మాటల కానందపడి శ్రీధరరావుగారా అమ్మాయి చెక్కిళ్ళొత్తా డొక్కమాటు.

దీన్నంతా గమనిస్తుండిన రామేశంగారి కప్పుడే శ్రీధరం గారి అభిప్రాయంగోచరమై, దగ్గరకు జేరి "ఈబిడ్డే తే రాధాదేవి గారికి, మరేజ్ఞాపకం లేకుండ ప్రొద్దు పోతుందండీ" అన్నాడు. "నేనూ అదే అనుకుంటున్నాను. అయినా చూడండీ! ఈ ఋణానుబంధం ఇంతా ఇప్పుడే కదా నన్నీబిడ్డ చూచింది. ఇంతలో ఎంతమాలిమైంది చూడండీ!" అన్నాడు లలితముఖాన్ని పరిశీలిస్తూ శ్రీధరరావుగారు. "క్రొత్తలేదు పిల్లకు. మరైతే యేదో తేల్చండి, శుభస్య శీఘ్రం" అన్నారు రామేశంగారు "ఓమారు మారాధకు కూడా చూపి, ఆమె సమ్మతి పుచ్చుకొని పైకార్యక్రమ మాలోచిద్దాం." అన్నారు శ్రీధరరావుగారు.

ఈ మాటల ధోరణిలోనే జ్ఞానాంబకు, వారి ఉద్దేశ్యం కొంత వరకు బోధ పడ్డది. ఆబిడ్డ శ్రీధరరావుగారి బిడ్డను హత్యచేసిన నేరానికి శిక్షననుభవిస్తున్న పద్మావతి కూతురని ఆమెకు ముందే తెలుసు. కాని, వారి శరణాలయపు చట్ట ప్రకారం, ఇచ్చటి బిడ్డల పుట్టు పూర్వోత్తరాలు, ఎవ్వరికి చెప్ప కూడదు గనుక, ఆమెముందుగానే, యీ బిడ్డ "అనాధ" అని చెప్పుకున్నది. ఈ జరుగుతున్న సంఘటన చూచి; ఆమె కేమీ తోచక యోచిస్తుండగా, ఇంతలో రామేశంగారు ఆమెనుదగ్గరకు పిలచి, శ్రీధరరావుగారి అభిప్రాయం తెలిపారు. అందులకామె "నాకు సంతోషమేకానీండి ముందు మా ఛేర్ మెన్ గారిఅనుమతి పొందవలసి వున్నది." అన్నది. "అలాగె కావచ్చు. ఆమె మాత్రం కాదంటుందా? కాని, యీలోగా యీ బిడ్డను ఒక మారు రావుగారింటికి తీసుకెళ్ళి, వారి భార్యగారికి చూపించి ఆమె సమ్మతి పొంది, అటుపిమ్మట మీరుమీఛేర్ మెన్ గారికి

తెలపటం భావ్యం అనుకుంటాను" అన్నారు రామేశంగారు. "ఆహా! భేషుగ్గా కావచ్చు" అన్నదామె. అలాగైతే ఇప్పుడే ఆ పని కానిచ్చి వస్తాం. మీరు కూడా వెంట రాగలిగితే మరీ సంతోషం" అన్నారు రామేశంగారు. అలాగే వస్తానని అచ్చటి నర్సులకు ఏవోకొన్ని ఆజ్ఞలిచ్చి, జ్ఞానాంబగారు ప్రయాణానికి సిద్ధమైనారు.

ఆ ముగ్గురు లలితను పిలుచుకొని కారులో శ్రీధరరావుగారింటికి పోయి, రాధాదేవికా పిల్లను చూపారు. రాధాదేవి కూడా ఆపిల్లను చూడడంతోటే, ఏదో ఒక ఆకర్షణ కలిగింది. వెంటనే లోనికేగి ఏవో రెండు బొమ్మలు, సీమబాదంపప్పులు, చీనాకలకండ పలుకులు, అంత ఎండుద్రాక్ష తెచ్చి లలితముందుంచింది. లలిత వాటిని చూచి, జ్ఞానాంబ ముఖంవైపు చూచింది. జ్ఞానాంబ దాని అభిప్రాయం గ్రహించి "తీసుకో తల్లీ" అనేసరికి, లలిత ఆ బొమ్మలను, తన వొళ్లో పెట్టుకొని పప్పులను తాను రెండు తిని, ఆ బొమ్మలకు కొంచెం నోళ్ళల్లో కూరే ప్రయత్నం చేస్తూ విఫలమౌతూంటే, అందరు దాని చేష్టలను, మౌనంగా చూస్తూ మధ్య మధ్య మొగవారిద్దరు, రాధాదేవి ముఖంలోని భావాలను గమనిస్తున్నారు. ఇంతలో రాధాదేవి "నీకీ బొమ్మలు, పప్పులు, కలకండ అంతా యిచ్చానే, నేను మంచిదాన్నికదూ" అని లలిత నడిగింది. "ఔను నీవు మంచిదానివి" అన్నది లలిత. "అయితే నాదగ్గఱకు వస్తావా" అన్నది ఆమె. "వత్తా" అన్నది బిడ్డ. "మరి రా" అంటూ చేతులు రెండూ జాపింది రాధాదేవి. లలితకూడ జ్ఞానాంబవైపు చూస్తూ లేచింది. ఆమెకూడా "వెళ్ళమ్మా" అన్నది ...

రాధాదేవి కడకు వెళ్ళి ఆమె తొడమీద కూర్చుంది. రాధాదేవి దానికో ద్రాక్ష తినిపిస్తూ "నా దగ్గరుంటావా, నీకు కావలసి నన్ని బొమ్మలు, పప్పులు, పండ్లు, మంచి గౌనులు, వొంటినిండ సొమ్ములు, అన్నీ యిస్తాను" అనడిగింది. "ఉంతా" నన్నది లలిత. "అయితే నీవీ అమ్మదగ్గరే ఉండిపో. నేను వెళ్ళుతా" అన్నది జ్ఞానాంబ. "కాదు అప్పులొచ్చిందే, బిచకత్తులు తెచ్చి చ్చెల్లా, ఆఅమ్మ" అన్నది లలిత. "ఈమె కూడా అమ్మేనమ్మ. యీయమ్మ యింకా చాలా చాలా యిస్తుంది నీకు" అని జ్ఞానాంబ అనేప్పటికి, "ఈ బిడ్డ అనాధంటిరే" అన్నాడు శ్రీధర రావుగారు.జ్ఞానాంబ కొంచెం తక్కువ శృతిలో "దిక్కులేని బిడ్డని ఒక పేదరాలు పెంచి, తనవల్లకాక మాకప్పజెప్పిందిలెండి. లేకుంటే మాకడకు చేరవలసిన అవసరమేమున్నది. మీరే చెప్పండి" అన్నది. "అమ్మా! రాధమ్మా. నీయిష్టమేమో చెప్పమ్మా" అని అడిగారు రామేశంగారు. "వారికి నచ్చితే నాకూ యిష్టమే" అన్నదామె. "అలాగైతే మీరు చేర్మన్‌గారికి తెలిపి, వారి అనుమతి పొంది రావుగారికి తెలిపితే, వారు వచ్చి బిడ్డను తెచ్చుకుంటారు" అని జ్ఞానాంబతో అన్నారు రామేశంగారు.

ఇప్పుడు తోచింది, జ్ఞానాంబకా విషయమంత సులభంగా తేలేదేనా అనే ధర్మసందేహం. తన ప్రాణానికంటే, అధికంగా ప్రేమిస్తున్న తల్లి, ఆ బిడ్డను మరొకరికి పెంపుడిస్తుందా? ఆమెను ఏలా ఒప్పించడం ? ఆమె వొప్పుకొని లిఖితపూర్వకంగ అనుమతిస్తేగాని తానేమి చేయజాలదుకదా ? అనే యోచన లామెను కలవర పెట్టసాగాయి. "ఏమిటి సందేహిస్తు

న్నారు". అన్నారు శ్రీధరరావుగారు. "మరేమి లేదండీ! ఇప్పటి కిలాంటిదేదీ మాశరణాలయంలో జరుగలేదు. మా చేర్మెన్‌గారు కూడ కమిటీ మెంబర్ల పూర్ణమైన సమ్మతి పొందందే, ఏమీ చేయజాలరు. ఈ మెంబర్లలో కొందరు, పెంకెతనంగా, కాదు, కూడదు అంటే చిక్కొస్తుందనే సంశయమేకాని, వేరు కాదు. మాకమిటీలో కొందరు పెంకెవారున్నారు. చెప్ప వద్దూ" అన్నది జ్ఞానాంబ. "ఆఁ-మీ వారందరికి తగిన సమా ధానాలు చెప్పి వొప్పించగలరని నా నమ్మకం" అని అన్నాడు రామేశంగారు. "నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. మరి శెలవా?" అన్నదామె. "మంచిది. కానీయండి" అని శ్రీధర రావుగారు కారు డ్రైవరును పిలచి, ఆమెనూ పిల్లనూ, వదిలి వేసి రమ్మన్నారు. ఆ బొమ్మలను, తినుబండారాలను, రెండు చంకల్లోను, చేతుల్లోను నింపుకొని, లలిత జ్ఞానాంబతో ప్రయాణమైంది. రాధాదేవి ఒక్కమాటూ బిడ్డను చెక్కిళ్లొత్తి ముద్దు పెట్టుకొని, "మళ్లీ వస్తావుకదూ" అని అడిగింది. "వత్తా" అని లలిత ముచ్చటగా అనింది. జ్ఞానాంబ లలితతో కారెక్కి వెళ్ళింది.

# ఇరువదియొకటవ ప్రకరణము

శరణాలయం చేరినవెంటనే జ్ఞానాంబ, రంగనాయకులు నాయుడిగారిని పిలిపించి, జరిగినసంగతంతా ఆయనతోచెప్పింది. ఆయన సంతోషపడ్డాడుగాని "మరి పద్మావతెమ్మ వొప్పుకుంటుందా అనే నాకూ సందేహం"అన్నాడు. "ఏమైనాసరే, మీరు, నేను, ఆమెనేలాగైనా యిందుకు వొప్పించాలి. లేకుంటే, యిలాంటిఅవకాశాన్ని, యీబిడ్డకు పోగొట్టినవాళ్ళం మనమే ఔతాం చూశారూ!ఆతల్లికిప్పుడేర్పడినఅపఖ్యాతియీబిడ్డకుకూడ ఆవరించి, తుదకు దీని జీవితమేగతౌందో యోచించండి" అన్నదామె. "అంతానిజమే, నాకుఅర్థమౌతుంది. కాని, ఆమెను వొప్పించడ మేలాగా అనే నాబాధ" అనిఅన్నాడు నాయుడు. "ఆపిల్ల కదృష్టముంటే ఆమె వొప్పుకుంటుందండీ! భగవంతుడి మీద భారంవేసి, మనకర్తవ్యం మనంచేదాం. కనుక మీరు నా వెంట, యీరోజు రాత్రివస్తే వేలూరు వెళ్ళుదాం" అన్నది జ్ఞానాంబ. నాయుడుకూడా సరేనని శెలవుతీసుకొని వెళ్ళాడు.

ఆ మరునాడే వారుభయులు, జైలులో పద్మావతిని చూచి, ఆమెకు శాంతంగా కడునేర్పుతో విషయాలన్నీ తెలిపింది జ్ఞానాంబ. పద్మకాసంగతి విన్నంతనె కళ్ళు తిరిగిపోయినాయి. "ఏమండీ! ఆఒక్క కూనకోసంగదా నేనింకా యీప్రాణాలు బిగబట్టుకొని ఉండడం. దాన్నే యిచ్చేస్తే నేనుండే దెందుకు చెప్పండి" అన్నది, పద్మ ప్రవాహంగా కారేకండ్లనీళ్ళను తుడుచుకుంటూ. "నీవు యిలాఏడ్వప్రారంభిస్తే మేమింక మా

ట్లాడలేమమ్మా! సావధానంగ, ఆబిడ్డ భావిజీవితమేమౌతుందా అనేది యోచించుకుంటే, నీకే అర్థమౌతుంది. మేముదానిమేలు కోరి చెబుతున్నామని" అన్నది జ్ఞానాంబ. "అమెగారు చెప్పే దంతావిని, బాగాయోచించుతల్లీ! నీమేలు, ఆబిడ్డమేలుకూడా కోరి, మేముచాలా దూరమాలోచించి, యీ తీర్మానానికి వచ్చాం. కాని, తొందరపడికాదు. ఈలాంటి అవకాశాన్ని పోగొట్టుకుంటే, మళ్ళీవస్తుందా, చూడు" అన్నాడు నాయుడు గారు. 'ఎవరండీ ఆ శ్రీమంతులు. ఈ పే ద రా లి బిడ్డకాశ పడ్డవారు" అని అడిగింది పద్మ. చప్పున జ్ఞానాంబ అందుకొని, "ఆవిషయంమాత్రం నీకు చెప్పకూడదు. చెప్పము గూడాను. ఎందుకంటావేమో, నీవెంతైనా కన్నతల్లివి. నీమనసు మేమె రుగుదుము. ఇక పదిపండ్రెండేళ్ళకు, నీవు విడుదలై వచ్చి, అప్పటికి సకలైశ్వర్యంలో, ఓలలాడుచుండే పిల్లను "ఇది నా కూతురు" అంటూలోకానికి తెలిపావంటే, ఇక దానిగతేమైనా ఉందా. నీవుచేయకపోయినా గొప్పఅపఖ్యాతి సంభవించింది. నీ కూతురని లోకానికి తెలిస్తే, ఇన్నేళ్ళు ఓర్చినది, చేసినది, అంతా క్షణములో మంటగలిపి నష్టౌతుందో లేదో యోచించు. కనుక నీవాబిడ్డ విషయమికముందు కలుగజేసుకొనే గూడదు. ఎన్న టికిగాని, దాన్ని గుర్తించేందుకుగాని, తుదకు దానివునికి తెలు సుకొనే ప్రియత్నంగానీ చేయకూడదు. అందుకు ముందు సమ్మతించి, యీ సమ్మతిపత్రింలో చేవ్రాలు చేయాలి. బాగా యోచించమ్మా" అని బహుఆదరంతో చెప్పింది జ్ఞానాంబ. "అమ్మా! నీవూ బిడ్డలుకన్నదానివి. నీవే యిలాచెప్పితే, ఇక నేనేమనగలను; ఎంత బీదవారైనా, ఎన్నికష్టాలలోఉన్నా, తమ కుండే ఒక్కకూననూ మరొకరికివ్వ సమ్మతిస్తారా? నే నేమ్మై

పోయాను. దానికోరకే కదా యీ దౌర్భాగ్య మనుభవిస్తూ కూడా బ్రితికియుండడం ?" అన్నది పద్మ.

"దౌర్భాగ్యమని, నీవే అంటున్నావుగనుక చెప్తావిను. లోకం నీకాపాదించిన యీ మచ్చను, నీవిక తుడిచివేయ గలావా ? పెద్దలపాపాలు పిల్లల నావరిస్తాయన్నట్లు, నీకూతురని లోకానికితెలిస్తే దాన్ని దగ్గఱకు చేర్చేవారైనా ఉంటారా ? దాని జీవితం ఏమికావాలో యోచించు. నీకా బిడ్డపైనుండే ప్రేమ, నిన్ను కేవలం స్వార్థపరురాలుగా చేస్తుంది. నీప్రేమ నిజమేనా ? నీప్రేమ నిజమయితే, దానికి లక్షణం త్యాగం కదా ? నిజంగా దాన్నినువ్వు ప్రేమిస్తే దానిక్షేమాన్ని నీవు తప్పక కోరినదానివై, మా మాటలువింటావు. దాని భావిజీవితం సుఖమయంగా ఉండాలనిగదా మేము నిన్ని త్యాగానికి ప్రేరేపించడం ? మమ్ములను అపార్థంచేసుకొనక, నిదానంగా యోచించు. తెలివిగలదానవు." అన్నది జ్ఞానాంబ.

నాయుడుగారుకూడ పద్మ కొంచెం దోవలో కొస్తున్నట్లు భావించి, "మా మాటవినమ్మ. నీబిడ్డ చాలా సుఖమనుభవించ బోతుంది. అందుకు ఆటంకం చెప్పకమ్మ. లలిత మహాదైశ్వ ర్యంతో తులతూగుతూ, ఒక గొప్పయింటి కోడలై సుఖంగా వుంటే, నీకుమాత్రం అంతకంటే సంతోషకరమైన విషయం ఏ ముంటుందిచెప్పు. నామనసు నీవెరుగుదువుకదా ? నాకుమాత్ర మెవ్వరున్నారు ? నీవు మాఅంగడి చేరిందిమొదలు, నిన్ను నా కూతురులాగ, ఆబిడ్డను నాముద్దుమనుమరాలిలాగ చూచుకుం టుంటినే ? ఇప్పుడు ఆబిడ్డను మరొకరికిస్తే నేనుచూచి దాన్ని

ముద్దాడేభాగ్యం కోల్పోతానని నాకు కష్టంగానేవుంది. కాని దానిసుఖానికి నేనుకూడా త్యాగంచేయకతప్పదని తీర్మానించుకున్నా" అని చెప్పాడు.

పద్మ వారిమాటలలోని సత్యం స్ఫురించక కాదు. కాని, ఆమె కా బిడ్డపైని మమకారంచేత వొప్పలేకున్నది. ఇక నెల కొక్కమారైనదాన్ని చూచేభాగ్యం లేకపోవడంగాక, యీ జన్మకే తనకూతురుతో యుండేయోగంగాని, తుదకు దాన్ని దగ్గఱకుతీసి మాట్లాడి తృప్తిపడడానికికూడా లేకుండా పోతుంది కదా అని ఆమెచాలా బాధపడసాగింది. ఈ యోచనలతో భరింపరాని దుఃఖమొస్తున్నదామెకు. జ్ఞానాంబగారు, నాయుడు గారు, ఆమె నెన్నోవిధముల ఓదార్ప ప్రియత్నించారు గాని, ఆమెదారికి వచ్చేట్టు, వారికి కనుబడలేదు. చివరకు జ్ఞానాంబ గారు కొంచెంవిసుగుచూపుతూ "ఏమిప్రయోజనంలేదు నాయుడుగారూ! తనబిడ్డ సుఖపడడం ఆమెకు నచ్చినట్లులేదు. మనం పడేది వృధాప్రియాస" అంటూలేచింది. దాంతో ఏమనుకుందో పద్మ తటాలున ఆమెచేతులు పట్టుకొని, "ఇవి కాళ్ళనుకో తల్లీ! నాకాలాంటి పాపిష్టి యోచనలేనేలేదు. సదా దాని సుఖమే నేకోరటం. అందుకెంత త్యాగమైనా చేస్తాను. కాని నాకొక్క వాగ్దానం మీరుచెయ్యాలి." అన్నది. "చెప్పమ్మ ఆబిడ్డ గౌరవానికి, సౌఖ్యానికి, యేలోటూరాని, వాగ్దానమేదైనాచేస్తాము" అని చెప్పింది జ్ఞానాంబ. "అదే నాకు కావలసింది మరేమీకాదు. నేనుబ్రితికి బాగుండి, యీ కారాగార వాసంలో నుంచి ఏనాడైనా బయట పడితే, దూరంనుంచైనా బిడ్డ నప్పుడు చూచి ఆనందపడే అవకాశాన్ని నాకు కలుగ

జేస్తామని చెప్పండి చాలు" అని జ్ఞానాంబ చేతులు వదలకుండ పట్టుకొనే ఉంది. అందుకు జ్ఞానాంబ కొంచెం ఆలోచించి, "నీవు యెప్పుడు కానీ, ఆ బిడ్డను చూచి నీ వాగ్దానాన్ని మఱచి నటించనని ప్రమాణం చేస్తే నీవు కోరిన అవకాశాన్ని మేము నీకు కలుగ జేస్తాం. ఏం నాయుడుగారూ! మీరే మంటారు"అన్నది. "తప్పకుండా నమ్మా. అంతమాత్రం కూడా చేయక పోవడానికి మనకేం హృదయాలు లేవా? కటిక వాళ్ళమా?" అన్నాడాయన. "దైవసాక్షిగా నేను దాని సుఖాన్ని కూలద్రోసే పని, యేనాడు చేయనమ్మా. నామాటలు నమ్ముతారా" అన్నది పద్మ. "తప్పక నమ్ముతాను తల్లీ! మరీ కాగితంలో సంతకం పెట్టు" అని కలం అందించింది పద్మకు జ్ఞానాంబ.

ధారావాహినిగా కారుచున్న కన్నీళ్ళతో, వణుకుతున్న చేతులతో మెల్లగ సంతకం చేసి ఆ కలమక్కడ వుంచి రెండు చేతులతో తన ముఖాన్ని మూసుకొని భోరున యేడ్చింది పద్మ. ఆమెనా యిద్దరు ఆశ్వసింప జేసి, ఆమె అనుమతి పొంది, తిరిగి పట్నం చేరుకున్నారు. ఆరోజంతా తన చేతులతో తన బిడ్డను తానే చంపుకున్న తల్లిలాగ యేడుస్తూనే యుండింది పద్మ. జైలుసూపరెంటెండెంటుగారుకూడా యెంతోఓదార్చారామెను ఆ జైలులో వున్న ప్రతి ఖైదీగాని, అధికారి గాని, ఆమె సుగుణాల వల్ల, ఆమెపై ఎంతో వాత్సల్యంతోను, మర్యాదతోను, నడుచుకుంటూ ఉండేవారు. అందుచేత ప్రతి ఒక్కరూ ఆమెను ఓదార్ప ప్రయత్నించిన వారే.

పట్నం చేరిన తోడనే, జ్ఞానాంబ శ్రీధరరావు గారికి కబురుచేయగా వెంటనే ఆయన వచ్చి, లలితను, జ్ఞానాంబను కారులో తన యింటికి తీసుకొని వెళ్ళాడు. రాధాదేవి యెంతో సంతోష పడింది. లలిత వస్తుందని ముందుగానే దాచ బడి యున్న బొమ్మలు వగైరాల్ని బయటకు దీసి పుంచింది. ఆ బోలెడు బొమ్మలను చూచే సరికి, లలితకు బ్రహ్మానందమైంది. ఒక్క మారుగా యెత్తుకుంటూ నన్నట్లు ఆ బొమ్మల్ని తన రెండు చేతుల్లో యిముడ్చుకొనేందుకు ప్రతిన్నించడం చూచి, రాధాదేవి "అలా కాదు నాయనా, నీవు చిన్న పిల్లవి కదూ, అన్నిటినీ యెత్తుకోలేవు. ఒక్కొక్కటిగా తీసుకొని ఆడుకో' అని ఒక బొమ్మను దాని చేతికిచ్చి, కొన్ని బిస్కత్తులు తినేందుకు యిచ్చి, మరొక మోటారు బండికి కీగమిచ్చి క్రిందకు వదలగానే అది నేలమీద తానుగానే వెళ్ళడం చూచి లలిత, ఆనంద పరవశ యై, చేతిలోని బొమ్మను పారవేసి ఆ మోటారు బండికై పరుగెత్తింది. దాని ఆటలు చూస్తూ, దాన్ని ఆడించుకుంటూ క్షణంలో రాధాదేవి ఆ ప్రపంచంలో లీనమై పోయింది. ఇంతలో శ్రీధరరావుగారు లోపలినుంచి కొన్ని పండ్లు, టెంకాయ, తాంబూలం, అన్నీ ఒక పళ్ళెంలో పెట్టించి, వంట వానిచేత తెప్పించి మేజాపైన వుంచి "రాధా! జ్ఞానాంబగారికి ప్రొద్దౌతున్నాదేమో! అన్నాడు, ఇదుగో వచ్చ" అంటూ, కుంకుమ భరణి అందుకొని, ఆమెకు కుంకుమ పెట్టి ఆ తాంబూల పళ్ళాన్ని ఆమె కందించింది. ఆమె "ఇవన్నీ ఎందుకండీ అన్నది "ఏదోమా ఆనందాన్ని కృతజ్ఞతను తెలిపే చిన్న మర్యాద. అంతే" అన్నది. ఆమె సరేనని ఆ పళ్ళాన్ని పుచ్చుకున్నది. రాధాదేవి దాన్ని అలాగే కారులోకి పంపింది.

జ్ఞానాంబ లేచి, "లలితా! నీవీ అమ్మతో ఆడుకుంటూ వుండు, నేను మళ్ళీ వస్తా" అన్నది. ఊఁ తొందలగలా అత్తా" అన్నది. జ్ఞానాంబ దాన్నొక ముద్దుపెట్టుకొని, ఆ దంపతుల శెలవు తీసుకొని వెళ్ళింది. లలితను వదలిపోతూ తను యేదోపోగొట్టుకున్న దానివలె సంకట పడ్డది జ్ఞానాంబ.

దినమంతా రాధాదేవిగారికి వేరే చింత మనసుకు రాకుండా కాలం గడిపింది లలితతో. ఆరోజే భార్యాభర్తలు బిడ్డను పిలుచుకొని, బజారుకు వెళ్ళి, అది కోరిన బట్టలు వగైరా లన్ని కొని, దర్జీవానికిచ్చి, కొన్ని నగలను తీసుకొని, దాని కంగట్లోనే శృంగారించి, అలా బీచి షికారుకు వెళ్ళి, రాత్రి యెనిమిది గంటలకు యిల్లు చేరారు. ఇన్నాళ్ళకు మళ్ళీ రాధాదేవి ముఖంలో కాస్త తెలివొచ్చి నవ్వింది కదా అని శ్రీధరరావుగారు బ్రహ్మానందం పొందారు. గ్రామాంతరం వెళ్ళియుండిన రామేశంగారా మరుసటి దినం తిరిగి వచ్చారు. వచ్చీరాకమునుపే రాధాదేవి గారొక ఆడపిల్లను, పెంపకానికి నిన్ననే తీసుకున్నారని, భార్య చెప్పగా విని, ఆయనగారా ఉదయయే శ్రీధరంగారింటికి వచ్చారు. గడప యెక్కుతుండగానే, రాధాదేవి, లలిత పకపక నవ్వుతుండే శబ్దం విని, రామేశంగారికి కూడా సంతోషం కలిగి లోనికి ప్రవేశిస్తూనే శ్రీధరంగారిని చూచి "నే జెప్పలేదండీ. ఈ అమ్మాయి మీ యింటి కొస్తే, మీ యింటికొక క్రొత్త కళ పడుతుందని. భేష్ రాధాదేవి గారూ! ఇప్పుడు మిమ్ములను చూస్తూంటే, నాకు బ్రహ్మానందంగా ఉన్న"దన్నాడాయన. "ఈ బంగారుతల్లి మహా తుంటరండీ! నాకే ఆటలు నేర్పుతానంటుంది." అంటూ, రాధా

దేవి భర్తను చూచి "ఏమండీ దీనికి చదువు ప్రారంభించాలండీ!" అన్నది. "దాన్ని కాన్వెంటులోని నర్సరీ క్లాసులో ప్రవేశ పెడదా మనుకున్నాను రాధా! రోజు పగలు ఒక మూడు నాలుగు గంటలసేపు వెళ్లి వస్తుంది. వెంట ఒక ఆడమనిషిని తోడంపుతుంటే, బాగుంటుంది" అన్నాడు రావుగారు. "మన పనిదాని కూతు , పండ్రెండు యేండ్ల పిల్ల లక్ష్మివుంది. దానికే దైనా యిస్తామంటే, అదే కూడావుంటుందమ్మాయికి" అని రాధా దేవి చెప్పింది.

ఇంతలో శ్రీధరరావుగారి కొక తంతి వచ్చింది. దాన్ని ఆయన చింపి చదువుకుంటూ యుంటే, ఆయన ముఖంలో కలిగిన ఆనందాన్ని రామేశంగారూ, రాధాదేవి కూడా గుర్తించి, యిద్దరు ఒకేమారు, "ఏందండీ సంగతి" అన్నారు. శ్రీధరరావుగారు తంతిని రామేశంగారికిస్తూ, "చూడు రాధా! రామేశంగారన్నట్లు, లలిత మంచి అదృష్టవంతురాలేనే? ఆరు మాసాల క్రిందట నాకొక, రూపాయి కొక లాటరీ టిక్కెట్టు అంటగట్టా డొకడు జ్ఞాపకముందీ!" అన్నాడు "ఔను అదేదో పాఠశాలకొక భవనం కట్టేందుకంటూ యిచ్చిపోయినాడు. ఇప్పుడేమైందేం" అన్నది రాధాదేవి "ఏముందీ ఇరువది యైదు వేల రూపాయలు మొదట బహుమతి మనకొచ్చిందని ఆ లాటరీ కమిటీవారు, తంతి యిచ్చారు" అన్నాడు శ్రీధర రావుగారు. "అయితే ఆడబ్బంతా యీ చిట్టితల్లిదే నండి." దాన్ని అతిప్రేమతో బుగ్గనలిపి ముద్దులు పెట్టింది రాధాదేవి. "దానిదేననుకో, కాని, దాన్ని మనకిచ్చిన, ఆ అనాధశిశు శరణాలయానికి, యీ డబ్బులోకొంత చెందడం ధర్మమని

నాకు తోస్తుంది. మీరేమంటారు రామేశంగారూ?" అన్నా డాయన. "చక్కగ అన్నారు. తప్పక ఆ సంస్థకేదైన చేయా లండీ! మీలాంటి శ్రీమంతులు, కాకపోతే మరెవ్వరు చేయ గలుగుతారు చెప్పండీ" అని అన్నారు రామేశంగారు. రాధా దేవికూడ "తప్పక యివ్వండీ" అన్నది

కొద్దిరోజులలోనే శ్రీధరరావుగారికి కలకత్తానుంచి 25 వేలరూపాయల కొకచెక్కు వచ్చింది. వెంటనే దాన్ని మార్చి, అందులోనుంచి, 15 వేల రూపాయలిచ్చి ప్రస్తుతం శరణాలయ ముండే యింటినే కొని, ఆ శరణాలయానికి దానంగా యిచ్చి వేశాడు శ్రీధరరావుగారు. వారి ధర్మబుద్ధి తెలిసిన వారందరు వారిని వేనోళ్ళ పొగిడారు. లలితను, నర్సరీ స్కూలుకు పంప డం జరుగుతూవుంది. ఇంట్లో ఉండే సమయంలో, ఇరుగుపొరుగు వారి చిన్నపిల్లలను, రాధాదేవి చేరదీసి, వారి మధ్యను తాను, లలితజేరి కొంతకాలం కులాసాగా ఆటల్తో వెళ్లదీస్తుండేది. ఒక సంవత్సరము యీ రీతిగా గడిచింది. పై యేడాది, భరత నాట్యం నేర్పేందు కొకరు, సంగీతం చెప్పేందు కొకరు, విద్యా భ్యాసానికి మరొకరు, ముగ్గురు మాస్టర్లను ఏర్పాటు చేశారు శ్రీధరరావుగారు. లలిత శీఘ్రకాలంలోనే, వీటన్నిటిలోను కడు ఆసక్తిని కనుపరచింది. దాని సూక్ష్మబుద్ధికి మేస్టర్లందరూ, దానియందు ప్రేమ గలిగి, తమ శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించి, విద్యలు నేర్పుతున్నారు. క్రమేణ లలిత ప్రతిక్లాసుతప్పకుండ ప్యాసై, శారదా విద్యాలయంలో, నాలుగోఫారం లోకి ప్రవేశించింది. ఆమె మూడోఫారం పరి తులో ఫస్టు మార్కులు సంపాదించినందున, ఆమెకు, సర్కారు

వారు, స్కాలర్షిప్ యిచ్చారు. ఆ సంవత్సరం స్కూలు వార్షికో
త్సవ సందర్భంలో, జరిగిన పోటీలలో, నాట్యానికి, వీణావాద్యా
నికి, లలితకే మొదటి బహుమతులుకూడ వచ్చాయి. తల్లిదండ్రు
లెంతో గర్వించారు. ఈ విధంగా లలిత విద్యా వ్యాసంగాలు
బహు తృప్తికరంగా సాగిపోతున్నాయి.

---

# ఇరువది రెండవ ప్రకరణము

రంగూనులో మిలిటరీ గుమాస్తాచేస్తున్న సుందరం, బర్మాలోనే అనేక క్యాంపులకు మార్చబడి, తుదకు జపానువారి బర్మాదాడిలో అందరితోపాటు తానూ స్వదేశానికి మరలాడు, కాని, అప్పట్లో రాకపోకల కవకాశంలేక, మన సైనికులైతే నేమి, బర్మాలో నివసిస్తుండే మనదేశపు ఇతర ప్రజలైతేనేమి అడవి మార్గాలద్వారా మనదేశం చేరుకోవడంలో యెన్ని ప్రాణాలు పోయినవో, ఎందరెన్ని కష్టాల పాలైనారో, లోక విదితమైన విషయమే. కొన్ని నెలలపాటు, సుందరం నడచి నడచి, కాళ్లు పుండ్లై, తిన తిండిలేక, త్రాగను నీళ్లుకూడాలేక, పైనుంచి జపానువారు వేస్తుండిన బాంబులను తప్పించుకొని, "దినగండం నూరేండ్లాయుస్సు" అన్నట్లు తుదకు మణిపురం చేరుకొని, అచటి మిలిటరి అధికారులకు తెలుపుకొని, కలకత్తా వచ్చి చేరేసరికి సుందరానికి అనారోగ్యమేర్పడి, మిలిటరీ ఆస్పత్రిలో ప్రవేశింపవలసి వచ్చింది. మూడు మాసాలపాటు చికిత్స పొంది, కొంత ఆరోగ్యం కావడంతోటే, అతనిని ఆస్పత్రిలో నుంచి పంపివేశారు. తను కలకత్తాలోనేయుండి, తన ఉద్యోగం నిమిత్తమై, అధికారులనెన్నో పర్యాయములు వెళ్లి చూచాడు కాని, తనకు సరియైన జవాబు చెప్పేవారు ఎవ్వరు కనుపించ లేదు. అతనికి రావలసిన కొలువ జీతముకూడా యిచ్చేదిక్కు లేక పోయింది. కలకత్తాలోనే యుంటే, జీవనోపాధికే కష్ట మయ్యేస్థితి సంభవించేటట్లు యుండినందున, ఒకరోజేమీ తోచక, వాల్తేరు ప్యాసింజరెక్కి విశాఖపట్టణము చేరుకున్నాడు.

మళ్లీ ఆంధ్రదేశములో అడుగు పెట్టడంతోటే, గట్టున ఉన్న చేప మళ్లీనీళ్ళలో పడ్డట్లైంది అతని ప్రాణానికి. విశాఖ పట్టణములో, ఒకయింట్లో, నాలుగు రూపాయల అద్దెకు ఒక చిన్నగదిని తీసుకొని, రోజు రొఖ్ఖం మార్చి, హోటలులో భోం చేస్తూ అచటినుంచి మిలిటరి అధికారుల కర్జీలు పంప నారంభిం చాడు. నెలరోజులైనా, ఒక్క అర్జీకీ జవాబువచ్చిన పాపాన పోలేదు. ఇంతలో తనకడనున్న నాలుగుకాన్లు, కడతేరి పోతు న్నాయి. అతనికేమీ తోచలేదు. ఆవూళ్లోనే ఎన్నోచోట్ల యేదైన నౌకరి చిక్కుతుందేమోనని ప్రయత్నం చేశాడు. కాని ఉపయోగం లేకపోయింది. ఒకరోజేమీతోచక, "స్వరాజ్యం" అనే తెలుగు వారపత్రిక నొకదాన్ని కొను క్కొని, బీచీకివెళ్లి ఇసుకపై కూర్చొని, పత్రికను చదువుతూ అందులో "చిన్నచిన్న కథలు. వ్యాసాలు, వ్రాసిపంపితే,నచ్చిన వాటికి బహుమానాలిస్తాము" అని యున్న ప్రకటనను చూచి, యింటికెళ్ళి, ఒక చిన్నకథను వ్రాయ నారంభించాడు.

రెండు రోజులలో, ఆ కథ పూర్తి అయింది. మూడో రోజు దాన్ని పట్టుకొని, ఆ పత్రికాలయానికి వెళ్ళి, సంపాద కుణ్ణి చూచాడు. ఆయ నాకథను పుచ్చుకొని, "రేపురండి చెప్తాను" అన్నాడు. మరునాడే సుందరం మళ్లీ వెళ్లాడు. సంపాదకుడు "మీకథ నచ్చింది. మీరువెళ్లి, మా ప్రొప్రైటరును చూడండి" అనిచెప్పి ఒక జవాన్నుపిలచి, సుందరాన్ని వానివెంట పంపాడు. "స్వరాజ్యం" పత్రికాలయం పెద్దదే. ముద్రణాలయంలో ఆపత్రికేగాక, చాలా వేరు, వేరు, అచ్చు పనులుకూడ జరుగుతాయి. అది పవర్ ప్రెస్సు. దాని సొంత

దారుడు రామస్వామిగారు. ఆ ముద్రణాలయం ద్వారా లక్షాధి పతయ్యాడు. సంపాదకీయ వర్గంలోనై తేనేమి, ముద్రణాలయం లోనై తేనేమి, సుమారు నూరుమంది పనిచేస్తున్నారు. అచ్చు పనులకు, ఆ చుట్టుప్రక్కల రెండు మూడు జిల్లాలలో పేరు పొందిన సంస్థఅది. సుందరం రామస్వామిని దర్శించాడు. ఆయన "మీకథ ఒకమోస్తరుగవుంది, యీమారు పత్రికలో ప్రచురించి చూస్తాను. ప్రస్తుతమిందుకుగాను పదిరూపాయలు పుచ్చుకోండి" అని ఒక పదిరూపాయల నోటు అతనిచేతికిచ్చి, రసీదు పుచ్చుకొన్నాడు. అప్పటికా పదిరూపాయలే, పదివేలుగ కనుపించాయి సుందరానికి. ఏలనంటే, అప్పటికే చేతిలో డబ్బులేక, హోటలుకు పోవడం మానివేసి, బయట చిరుదిండ్లు, అర్ధకడుపుకు తింటూ యుండడమారంభించి, మూడు రోజులైంది. ఆనాడాపదిరూపాయలు పట్టుకెళ్లి, అధికంగా రెండణాలిచ్చి పెరుగుకూడ వేయించుకొని, కడుపునిండ, భోజనంచేసి, గదికివెళ్ళి పండుకొని, కంటినిండ నిద్రపోయినాడు. మరుసటి రోజులేచి, మరొక చిన్నకథ వ్రాసేందుకు ఆరంభించాడు, సుందరం.

ఆపై వారం "స్వరాజ్యం"లో "మిలిటరీ ఉద్యోగం. రచన మధుకరుడు" అని తనకథ అచ్చుపడ్డది. చదువుకున్నాడు. తనుండే ఇంటియజమానుడికొక పత్రికనిచ్చి, ఆకథ ఎలాగుందో చదివి చెప్పమన్నాడు. ఆయన చదివి "చాలా బాగుందండీ! మీరువ్రాసిందా" అన్నాడు. ఔనని సగర్వంగా చెప్పాడు సుందరం. ఆ వారపుసంచిక చదివిన వారందరూ, మధుకరుని చిన్నకథ చాలాబాగుందన్నారు. ఇదే అభిప్రాయాన్ని వెలి

బుచ్చుతూ; చాలా ఉత్తరాలు కూడా, ప్రచురణాలయాని కొచ్చాయి. సుందరం తను వ్రాసిన రెండవకథ "బర్మా యుద్ధం" అనే దాన్ని తీసుకొని, రామస్వామి కడకు వెళ్లాడు. ఆయన ఆకథను సుందరం సమక్షంలోనే కాస్త చదువుకొని, మరల పదిరూపాయ లిచ్చాడు. సుందరం చాలదంచామా అని అనుకున్నాడు గాని, యీకథగూడ, అందరి ఆమోదాన్ని పొందితే, మరొకమారు హెచ్చువెలకు బేరం పెడదామనుకొని, వెళ్ళబోతుండగా, రామస్వామిగారతనిని మరల కూర్చుండమని, ఆమాట యీమాట మాట్లాడి, ఆఖరుకు తన పత్రికా సంపాదక వర్గంలో చేరి, నెలజీతముపైన యేల పనిచేయరాదూ! అని అడిగాడు. సుందరానికి ఆ ప్రశ్న నచ్చినా, కొంచెం బిగువుతగ్గకుండానే మాట్లాడి, తుదకు నెలకు డెబ్బది రూపాయల జీతానికి వొప్పుకొని, ఆ మరుసటిరోజే నౌకరిలో చేరాడు.

అతనికి ముఖ్యంగా, ప్రతివారం చిన్నకథ నొకదాన్ని వ్రాయుటే. కొద్ది రోజుల్లోనే, అచ్చటి మిగతా పనివాళ్ళందరితోనూ మంచి పరిచయము, స్నేహము కుదిరింది. అందరికి అతని లక్ష్యాలు, అభిప్రాయాలు, బాగా నచ్చేవి. కొన్ని నెలలు గడిచేసరికి, అతను చిన్నకథలు వ్రాయడంమాని, రామస్వామిగారి అనుమతిమీద "నర్తకి" అనేపేరుతో ఒకనాటకం వ్రాసి, ప్రతిఆదివారం దానిలోనుంచి ఒకటి రెండంకాలు, పత్రికలో ప్రచురింప సాగాడు. అది బయట పడనారంభించింది మొదలు "మధుకరుని" ఖ్యాతి మరీ రోజు రోజూ, అతిశయిస్తూ వచ్చింది. ఒకవిధంగా జీవితం, సునాయాసంగానే వెళ్ళిపోతుంది. కాని, మిలిటరీ డిపార్టుమెంట్లుకు, అర్జీలు వ్రాయడం మాత్రం అతను మానలేదు. వారతనికి సరియైన జవాబివ్వకనే యున్నారు.

ఇట్లుండ విశాఖపట్టణములో "స్వరాజ్యం" పత్రిక రోజు రోజుకు చాలావృద్ధి పొందింది. "నర్తకి" నాటకం ముగించి మరల సుందరం చిన్నచిన్న కథలు కొన్ని వ్రాయ మొదలు బెట్టినాడు.

ఇంతలో ఆవూరి మునిసిపాలిటీకి, ఛేర్మెన్ ఎలెక్షన్ వచ్చింది. ఇంతకాలం కాంగ్రెసు పక్షాన్నవలంబించు చుండిన, రామస్వామిగారొకనాడు, సంపాదకుని పిలచి, కాంగ్రెసు నాయకులలో నొకరైన, రాఘవరావును కాదని, ఎదుటి పక్షపు అభ్యర్థి పాత్రుడు గారినే, ఛేర్మెనుగా ఎన్నుకో వలెనని, వ్యాసాలు వ్రాయమన్నాడు. సంపాదకీయ వర్గములోని అందరికీ ఆవిషయము చాలాబాధ కలిగించింది. రాఘవరావు కాంగ్రెసుకుగాను తన సర్వస్వం ధారబోసి సేవచేసినవ్యక్తి. పాత్రుడు గారు చీకటి బజారులో, యుద్ధకాలంలో, విపరీతంగా దాచుకొన్న మహాశయుడు. అతన్నిచూస్తే వూళ్ళో అతనిలాంటి వారికితప్ప, తదితరుల కెవ్వరికిగిట్టదు. ఈ లాంటప్పుడు అతనిని సమర్థించి యేలా వ్రాయడమా అని వారందరికి తోచలేదు. పైగా ఉన్నట్టుండి, రామస్వామిగారికి, బుద్ధి యెందుకు మారించాఅని యెవ్వరికీ, కారణం గోచరించలేదు.

ఇంతలో అచ్చాఫీసులోని ఫోర్ మేను కీ సంగతి తెలిసి అతనన్నాడు: "పాత్రుడుగారు మొన్ననే, రెండువేల రూపాయలు, రామస్వామిగారికి, ప్రచారముకొరకు యిచ్చాడు" అని. దాంతో అందరికీ కడుపు మండింది రామస్వామిగారి ష్టానుసార మాడుతుంటే పత్రికకూ దాని సంపాదకులకు రామర్యాదేదక్కదని తీర్మానించుకొని, ఒకపూట ధైర్యంచేసి,

రామస్వామిగారికి, వారి అభిప్రాయాన్ని తెలిపారు. ఆయన వారి మాటలు చెవినిబెట్టక, "నా జీతంతిని, నాకు వ్యతిరేకంగ నడుస్తా మనడం ధర్మమా" అన్నాడు. "జీతమిచ్చినంత మాత్రాన్నే మీరేం చేయమన్న చెయ్యాలిసిందే నాండీ" అని సుందరం అన్నాడు. "తప్పకుండాను. పత్రిక పాలసీని మార్చ టానికి నా కధికారం వుంది. ఆక్షేపించేందుకు మీకే అధికారం లేదు"అన్నాడు రామస్వామి. కొంచెం వారికివారికి వాగ్వాదం జరిగితుదకు "ఈవిషయంలో మాత్రం, మీ యిష్టప్రకారం మేము నడచుకో జాలమండీ! అటుపైని మీయిష్టం"అని అన్నాడు సంపాదకుడు. దాంతో రామస్వామి కెక్కడలేని కోపంవచ్చి "అయితే మీరందరు, మీ లెక్కలు పరిష్కారం చేసుకొని, యీ క్షణమే, బయటికి నడవవచ్చు" అని గుమాస్తాను పిలచి, ఆనాటి వరకు వారికి రావలసిన, జీతాల నిచ్చివేయమన్నాడు. సుందరం అచ్చాఫీసులోనికెళ్లి, జరిగిన సంగతంతా అచటి వారికిచెప్పి, వారిని కాస్త రెచ్చగొట్టాడు. దాంతో వారు ఉద్రేకంతో, ఎక్కడి పనులక్కడనే వదలి, ఆఫీసులోకొచ్చి, తమ లెక్కలు తీర్చమని, రామస్వామి నడిగారు.ఆయనెంత చెప్పినావారు వినలేదు. వారిష్టానుసారమే అందరి జీతాలూ బట్వాడా చేయించి, ఆఫీసుకు బీగాలువేయించాడు రామస్వామిగారు.

తర్వాత "స్వరాజ్యం" పత్రికవారు చేసిన సమ్మె కొద్ది రోజులే సాగింది. పనివారు ఒక్కొక్కరుగ మళ్లీ వెళ్లి చేరు కోటమారంభించినారు. అచ్చాఫీసు మరల పని ప్రారంభమైనది. మరికొన్ని రోజులకు. పత్రిక వెలువడ నున్నదనితెలిసి, ఒకరోజు సుందరం ఆవైపు వెళ్లిచూచాడు. తన మిత్రులు కొందరప్పుడే

వ్యాసాలు వ్రాస్తుండడం గమనించాడు. "ఏరా ఝూలా చేశారు" అని సుందరమంటే "నీకేమోయి బ్రహ్మచారి గాడివి, నలుగురు పిల్లలు, సంసారం, గడుపుకో వలసిన మాకు తెలుస్తుందా కష్టం" అంటూ ఒక్కొక్కరూ ఒక్కొక్క సాకు చెప్పి తప్పుకొన్నారు. ఇదిగదా ప్రపంచం అని సుందరానికి బోధపడ్డది. మరి వేరే రెండు మూడుచోట్ల నౌకరీకి ప్రయత్నించాడుగాని, సమ్మె కట్టించే మొనగాడన్న ఖ్యాతొకటి అతని కేర్పడినందున, మరెచ్చటా నౌకరి చిక్కలేదు. ఇంతలో అదృష్టవశాత్తు, ఆవడి మిలిటరీ ఆఫీసునుంచి అతనికొక తాఖీదు వచ్చింది. "ముందు తనపేరు బర్మాలో మరణించిన వారి చిట్టాలో చేర్చబడినదనియు, తదుపరి తన అర్జీల మూలకంగ, బ్రతికి యున్నాడని తెలిసినా, తాను పనిచేయుచుండిన, పటాలం డిస్ బాండ్ చేయబడినందున, తనకు జీతం తాలూకు లెఖ్ఖప్రకారం 137-9-0 లు రావలసియున్న దనియు, తాను నేరుగావచ్చి, తానే సుందరరావని, అధికారికి రుజువుచేసుకొని, జీతం పుచ్చుకో వచ్చుననియు" ఆ తాఖీదులో యుండినది. సుందరరావు ఆ మరునాడే పట్నానికి ప్రయాణం కట్టాడు.

# ఇరువదిమూడవ ప్రకరణము

పట్నంచేరిన సుందరరావు, ఆవడి మిలిటరీ ఆఫీసుకు తెల్పుకొని, అతను కోరిన రుజువులు తృప్తికరంగాచూపి తనకు రావలసిన పైకం పుచ్చుకున్నాడు. ఏంచేయడమా అనే ప్రశ్న వచ్చింది. ఈ మద్రాసులోనే యేదైన ఉద్యోగ ప్రయత్నం సాగిద్దామనుకొని, తిరువళిక్కేణిలో ఒక చిన్న సందులో ఒక యింటి మేడపైన ఒకగది అద్దెకు పుచ్చుకొని, హోటల్లో భోజనంచేస్తూ, రోజూ నౌకరికోఅకు తిరగడ మారంభించినాడు. "ఒక నెల గడిచింది. రెండోనెల వెళ్ళిపోతూంది. ఎక్కడా పది రూపాయల నౌకరీకూడ చిక్కలేదు. చాలీచాలని జీతాల్లో వుండే వాళ్లకు, నౌకరి వూడి నప్పుడల్లా, యీలాంటి పరిస్థితి ఏర్పడుతూనే ఉంటుందిగదా!

మునుపటిలాగే పత్రికలకు ఏవైనాకథలు వ్రాసి, సంపాయిద్దామను కొన్నాడు, కాని పట్నం పత్రిక వాళ్ళదగ్గర అతని పప్పేమీ ఉడకలా. ఒక రిద్దరు చిన్నపత్రికలలో అతని కథలను ప్రచురించారు గాని, యిస్తానన్నడబ్బు యివ్వనేలేదు. ఇంతా వారిస్తామన్నది పదిరూపాయలు. దాని వసూలుకుగాను యిప్పటి కప్పుడే, నాలుగు రూపాయలు బస్సుచార్జీ క్రింద శెలవైంది. సుందరానికి, ఒకరోజు ఒక పత్రికాధిపతి అకస్మాత్తుగ బ్రాడ్వేకడ చిక్కాడు. అడిగితే "పత్రికపోయి నేనేడుస్తుంటే నీవేమిటయ్యా" అని విదిలించుకొని వెళ్ళాడు. మరోకాయనను, యింటికెళ్ళి చిక్కించుకుంటే "ఆళ్వారుపేటలో ఒక ఫిలిం కంపె

నీలో నాకు మూడువందలు రావలె మీకు హవాలా చేస్తాను. వసూలు చేసుకోండి మీ బాకీకైన" అన్నాడాయన. "ఇంకేవీ లేవా రాని బాకీలు?" అంటూ లేచివెళ్లాడు సుందరం. మరి రెండు రోజులకు కూటికి తకరా రారంభమైంది. ఒంటిపూట రెండు యిడ్లీలు సాంబారూతిని కొన్ని రోజులు వెళ్లదీశాడు.

ఒక రోజు నౌకరీకై తన పర్యటనలో, మంచి యెండ వేళ కడుపు రెపరెప లాడుతూంటే కొళాయి నీళ్లు కడుపు నిండ త్రాగి, మిగిలియుండిన ఒక్క సిగరెట్టును కాల్చి, బ్రాడ్వే లోని చిన్న పార్కులో ఒక బెంచిమీద కూర్చొని "ఏంగతి భగవంతుడా" అను యోచనలో పడ్డాడు. ఇంతలో ఆపార్కులోనే మరోమూల ఒక పెద్దచెట్టునీడను, కొందరు బిచ్చకత్తెలు, బిచ్చగాండ్రు గుంపుగూడి, యేదోలెక్కలు చూస్తున్నట్లు కనబడింది. అదేమిటాయని, ఆవైపే కాసేపు ధ్యానం పెట్టాడు.

ఆచెట్టుక్రింద ఒక యాభై యేండ్లకు పైబడ్డ ఒక స్థూలకాయుడు, చెట్టానుకొని కూర్చొని యున్నాడు. కొందరు బిచ్చకత్తెలు, చంటి బిడ్డలతోవచ్చి తాము సంపాదించిన డబ్బునూ, చంకల్లోని బిడ్డలను ఆయన కప్పగిస్తున్నారు. అతను మరోవైపు నిలచియున్న ఆబిడ్డల స్వంత తల్లులను బిలచి వారలకాబిడ్డల నిచ్చి, బిచ్చకత్తెలు తెచ్చిన డబ్బులో ఒక వంతు ఆతల్లులకు, మరోవంతు సంపాదించిన వారికియిచ్చి, మూడో వంతు, తన జేబులో వేసుకుంటున్నాడు. ఇంతలో ఒక చిన్న కొయ్యపెట్టెలాంటి బండిలో, ఒక కుంటివానినుంచుకొని ఆ బండిని లాగుకొని మరొకడొచ్చి నిలచి అతనికి రు. 1-8-0 చిల్లర నిచ్చాడు. "ఏమిరా యింతదానా నేడు" అన్నాడు

ఆ స్థూలకాయుడు. అందుకాతడు "అంతదా నీకు" అన్నాడు బండి లాగినవాడు. "అంటే ఏమిరా" అన్నాడతను. రెండు రూపాయలా పదణాలు చిక్కాయి. చెరి మూడణాలకు, కాఫీ యిడ్లీ తిన్నాము. సాయంకాలం సినిమా చూచేందుకు ముక్కాలు రూపాయ ఉంచుకున్నాము. నీకు రూపాయన్నర యిచ్చాము" అన్నాడు వాడు. ఇంతలో బండిలోని కుంటి వాడు మెల్లగ తన కట్లనన్నిటిని విప్పుకొని, వెనుకకు మడవ బడిన కాళ్లను సాపుగ నిగిడ్చి, జాడించి, బయటికొచ్చి నిలిచి నాడు. ఇదంతా చూస్తున్న సుందరానికి ఆశ్చర్యమౌతూంది. "సరెద ఆ బండిని ఇంటికాడ వదలి మీరు పొండిరా" అని ఆ స్థూలకాయుడచటనుంచి లేచి, రోజు తను కాస్త యెండవేళలో పడుకునే బెంచికడ కొచ్చేసరికి, దానిపైన సుందరం కూచో నుండడం చూచి, కాస్త సందేహించాడు. ప్రక్కనే ఆగి జేబులోంచి ఒక బీడీ తీసి కాల్చుకున్నాడు.

ఇంతలో సుందరానికి సిగరెట్టుమీద బుద్ధిపోయి జేబు లోని ప్యాకెట్ తీసిచూస్తే, అది ఖాళీ. దాన్ని విసుగుతో నలిపి అవతల పారవేశాడు. జేబులోని చిల్లర బయటికి తీసి చూసు కుంటే, మూడు కానులు మాత్రమున్నాయి. సుందరానికేమీ తోచలేదు. దీన్నంతా ఆ బిచ్చగాళ్లరాయడు చూస్తూండి, తటా లున తన చెడ్డీ జేబులోనుంచి ఒక ఏనుగమార్కు సిగరెట్టు ప్యాకెట్ బయటికి తీసి, సుందరానికొక సిగరెట్టివ్వబోయాడు. సుందరం తీసుకునేందుకు సందేహిస్తుంటే, "సర్దా తీసోకండి, పర్వాలేదు. అంతా మనద్దా" అన్నాడతను. సుందరం సిగరెట్టు తీసుకొనడంతోటే అతనే పుల్లగీచి వెలిగించాడు. సుందరం రెండు యీడ్పులు యీడ్చేలోగా, ఆ అరవసోదరుడు కొంచెం

ధైర్యంచేసి ఆబెంచీమీద కూర్చొని, "ఆంధ్రావాళ్లు అని తలుస్తాను" అన్నాడు. ఔనన్నట్లు తలవూపాడు సుందరం. "మనది ఏవూరో? బెజవాడనా?" అన్నాడతను. "ఏవూరైతేనేం, ప్రస్తుతమీవూరు" అన్నాడు సుందరం. "శానా విసుగ్గా ఉండారే? ఇంకా బోంచేయలేదని తలుస్తాను" అన్నాడతను. అందుకు సుందరమేమీ పలుకలేదు. "ఆంకలిపైన వట్టి సిగిరెట్టు తాగితే, ఇంకా కడుపు మండును. రండి, ఏమైన కాపీ బోంచేస్తాము." అని అతనన్నాడు. "నీవన్నమాటతోనే కడుపు నిండిందిచాలు. నీ డబ్బు ఎలా సంపాదించిందో తెలిసికూడ, నేను దాంతో నా కడుపు నింపుకోలేను" అన్నాడు సుందరం.

"ఏం సార్, నేను అందరిమాదిరిదా సంపాదిస్తాను. ఏమి దొంగిలిస్తినా, దార్లు కొట్టినా, ఏమో నాయేజంట్లుపోయి, నలుగురు పెద్ద మనుష్యులను అడుగుతారు. ఇస్తే తీసుకొని వస్తారు. అంతదానే" అన్నాడతను.

"ఏమైన బిచ్చమెత్తడం మహా నీచంగదూ! ఎక్కడనైన, కూలిచేసైన బ్రతకగూడదూ?" అన్నాడు సుందరం.

"సార్. యీ మునియాండి, ముప్పై సంవత్సరాలుగా, యీపనిదా చేస్తాడు. ఇదీ ఒకకూలిదా. అది పోనీండి. మీరేం చేస్తారు సార్" అన్నాడతడు.

సుం: "ఏదో చేస్తాను"

ము: "చెప్పండి సార్, నేను చెప్తాను."

సుం: "కవిత్వం, కథలు, నాటకాలు, వ్రాస్తాను."

ము : "సర్దా,సర్దా, అందుకుదా ముక్కాలణా జేబులో వుంది. కడుపులో ఆకలి వుంది."

సుం : "అదేమి ! నీ మాటలు నా కర్థం కావటంలేదు."

ము : "కవి రాస్తారు. అందుకుదా, దలిందరం మీకు. ఏంసార్ ! ఇంత సదివినారే, మీరే చెప్పండి. కవి రాసేవాడు, ఎక్కడైన దండిగ సంపాదించినవాడుండాడా?"

సుం : "ఏమీ?"

ము : "ఏమీ ఏంసార్, లఛిమి, సరస్పతి, ఒక్క తావు లోనే చేరుతారా! సూడండీ మీరే"

సుం : "ఓరి నీయిల్లు బంగారంగాను! అన్నా, బలే ముక్కన్నావోయి."

ము : "సూస్తివా! ఏం ప్రవోజనం మీ సదువంతా. బియ్యేలు, యెమ్మేలు సదివినవాళ్లు శానామందులు ఉండారు యీ సిటీలో. నా కొడుకులుగూడ సదివినారుదా ఏమి ప్రవోజనం. వాళ్లు నెలంతా సంపాదించేది నేను సగంనెల్లో సంపాదిస్తును."

సుం : "నీకెందరు కొడుకులు? ఏంచేస్తారువాళ్లు?"

ము : "ఇద్దరు ఉండారు. పెద్దవాడు ఆవడిలో మిలిట్రీలో వుండాడు. నెలకు నూటాయాభై రూపాయలు తీస్తుడు. వాడికి యిద్దరు బిడ్డలుండారు. రెండో పిన్నవాడు, పారీ కంపెనీలో మెకానిక్కు. యెన్బయి రూపాయలు తీస్తుడు. కాని

నెలాకరులో, నన్నుదా అడుగుతుడు పది రూపాయలియ్యి నాయినా అంటూ."

సుం : "అంతటి కొడుకులుండి, నీకి అడుక్కుతినే కర్మ మెందుకూ అంటా?''

ము : "ఏంబా, కర్మమంటావే. సుళువుగా ఒకనాటికి పది రూపాయలు సంపాయిస్తునే, అది కరుమమా. మునియాండీ అంటే ఏమి తలిస్తివి?"

సుం : "అంతటి పిచ్చివాండ్లా, యీ ఊళ్లో ఉండేవాళ్లు. నీవంటివానికి రోజూ పది రూపాయలు ధర్మ మిచ్చేందుకు.''

ము : "సరిదా! సదివినవాళ్లుదా, జాస్తి ముట్టాళ్లు. మా యేజంట్లు తెచ్చే దాంట్లో కమీషన్‌దా పది రూపాయలు. నేనే నేరుగా పూడిస్తినా యింకా శనా చిక్కును. వయసై పోయింది. యింతే సాలులే అని అందులోనే రెండు రూపాయలు సొంత శెలవుకు పెట్టుకొని, మిగిలింది మన భార్యదగ్గిర యిచ్చేస్తును."

సుం : "మన భార్య అనవద్దు. నా భార్య అను."

ము : "అదిదా నేను చెప్పింది. అదిగో ఆకారులోవుండె వాళ్ళకాడ ఇప్పుడే ఒక రూపాయ తీస్తును. సూస్తువా మునియాండివిద్యను. ఇక్కడదా వుండు. వస్తును" అంటూ, అటు రోడ్డుపైన కారులో కూర్చొని, కారుప్రక్కన నిలచియున్న కత్తిదారునితో మాట్లాడుచుండిన ఒక వకీలుకడకు వెళ్ళాడు.

"సార్, రాత్రి బిడ్డను కని, ఆస్పత్రిర్లో, సచ్చిపూడ్సింది. సార్ మన భార్య, దిక్కులేదుసార్, మీ మాదిరి నాలుగు మందులు, యేమైనా యిస్తేదా ఆ పీనిగను ఎత్తనుమాళును సార్, దేవుడు నాకీ వయసులో, యీకష్టం పెట్టినాడు సార్. పెద్దమనుసు చెయ్యండి సార్. ఆ బిడ్డను సూస్తే కడుపు మండి పూడుస్తుంది సార్, మీ కాళ్ళు పడ్తునుసార్" అంటూ కళ్ళ నిండా నీళ్లు...తూ నిజంగా యేడుస్తూ, వాళ్ళిద్దరి కాళ్ళు పట్టుకోబోయాడు మునియాండి. కారుప్రక్కన నిలచి మాట్లాడుతున్న పార్టీ గోదావరిజిల్లా మనిషి. కారులోని వకీలు రామనాథయ్యరు. వకీలుగారు మునియాండిని "ఛీ, ఛీ పోఅబ్బ. ఇక్కడేముంది", అని విదిలించేశాడు. కాని, కక్షిదారునికి మాత్రం, మునియాండి దుఃఖం మనసు కరగించింది. దాంతో జేబులోని ఒక్క అర్ధరూపాయ తీసి వానికిచ్చాడు. వకీలుగారు "అయ్యో! మీరేమండీ! మెద్రాస్ బిచ్చగాండ్ల విషయం మీకింకా తెలిదుమాదిరి వుంది" అన్నాడు. మునియాండి అంతటితోపోక, మళ్ళీ ఆ ఆంధ్రుని కాళ్ళు పట్టుకోబోతూ "అర్ధరూపాయతో, యేమౌనుసార్. పాపి ముండాకొడుకు, వాడు నాశంగాపోను, ఆ కట్టెదొడ్డివాడు ఒక గుండుకే ఒణ్ణఱ్రూపాయి తీస్తుడేసార్. నామీద దయ వుంచండిసార్, మీకాళ్లు పడ్తును. మీకొడుకై పుట్తును," అని పడ్చాడు. వకీలుగారు వద్దంటున్నా. ఆ కక్షిదారుడు, మరొక అర్ధరూపాయయిచ్చి, యిక వెళ్ళమన్నాడు. వకీలు "వీళ్లనంతా మీరు నమ్ముతారే వాడు చెప్పేది నిజమా?" అన్నాడు. "ఆఁ. ఉత్తపుణ్యానికే యెవడైనా భార్య చచ్చిందని ఏడుస్తాడండీ? ఎలా దుఃఖపడుతున్నాడో చూచారా" అన్నాడా పార్టి. ఈ మాటలు వింటున్న మునియాండి "నేను అబద్ధందా

చెప్తిని. అరిచ్చంద్రుడు తన పట్టం, యీ వకీలుకుదా యిచ్చి పూడ్సినాడు. ఏంసార్, ఇచ్చే మారాజునుకూడ చెడుపుతారు. ఎవరుదా సావకుండారు సార్. మనమంతాదా ఒక రోజు పూడవ్వలసిందేదానే, పుణ్యాత్ముడు" అని వాళ్ళు వినేటట్లు గానే అనుకుంటూ వెళ్ళాడు. అప్పుడు అర్థమైంది ఆంధ్రసోద రునికి తాను మోసపోయినానని.

ఆ రెండర్ధరూపాయలను తీసుకొని, సుందరం కడకొచ్చి చూస్తూ మునియాండి, "సూస్తివా? సూస్తివా? అంటును?" అన్నాడు. "ఛీ. ఛీ. ఒక్క ముష్టిరూపాయకోసం మాణిక్యం లాంటి భార్యను చంపావు. ఘోరమైన అబద్ధాలాడావు" అన్నాడు సుందరం. మునియాండి "సర్దా అబ్బా మగా, మగా బెద్దమను షులు, యెంతో కిలాడి వేలె అంతా చూపుతురు లోకంలో, వాళ్ళకు దుడ్డు వుంది. కార్లోపోతురు వాళ్లంతా, వాళ్లేం చేసినా చెల్లిపోను. నేను పేదవాణ్ణి, నేనేం చేసిన తప్పుదా. ఇప్పుడు లోకంలో యిదిదా న్యాయం.—సర్దా. అదంతా పోనీ మీ. ఆంకలి అవుతాది. కాఫీ బోంచేస్తాము రాండిసార్."

సుం : "నాకొద్దు, నీవు తిను పో"

ము : "మీ వయసు పిన్నవాళ్ళంత యిట్లదా మాట్టా డ్తురు. ఆంకలితో నీవుంటే నిన్ను విడిచి తినునా యీ ముని యాండి. అంతా యీ కడుపుకోసం దానేసార్, కష్టంపడు తాము. నామాట విని రామి" అంటూ సుందరం చెయ్యిపట్టి లాక్కొని, కాఫీహోటలుకు తీసికొనివెళ్ళి అతనికి కడుపునిండా పెట్టించి తానూ తిని, వాకిటి కిళ్ళీదుకాణంలో అతనికొక సిగరెట్టు ప్యాకిట్టు, అగిపెట్టె, తాంబూలం తీసియిచ్చి, తనూ

ఒక బీడా నములుతూ, మళ్లీ యథాస్థానానికి, పిలుచుకొని వచ్చాడు. తానా రోజు మహానీచకార్యం చేసినట్లు బాధ పడ్డాడు సుందరం.

ము : "ఏం సార్? యోచనచేస్తావు? ఏంరా వీడి దుడ్డు తిన్నామే అని తలుస్తువా? ఫర్వాలేదు సార్. యీ మునియాండి దుడ్డు శనామంచి దుడ్డుసార్" అంటూ తన నిక్కరు జేబులోనుంచి, ఒక కట్ట రూపాయనోట్లు సుమారొక నల్లైయ్యాభైఅయినా వుంటాయి, అందులోనుంచి పదిరూపాయలు తీసి, సుందరం జేబులో తురుముతూ "పెట్టుకో ఎందుకైన వాదవును" అన్నాడు.

సుం : "వొద్దొద్దు. ఇప్పటికి తిన్నదే చాలయ్యా?" అంటూ ఆ నోట్లను తీసి వాపసివ్వఃబోతే, అతను "ఉంచబ్బా, నామాట సూడు, దీంతో నీకు బగమంతుడు అదృష్టమిస్తాడు. నేను మంచిమనస్సుతో యిస్తిని. నీ విప్పుడు శనా గాజీలోదా వుండావు నాకు తెలుసును" అని ఆ నోట్లచేతిని వెనక్కు త్రోసేశాడు. సుందరానికి వాని బలవంతం చూస్తే తను ఆడబ్బు పుచ్చుకోక తప్పదని తోచింది. ఆలోచించాడు కాసేపు. వాడు మళ్ళీ "వుంచుకో. యెందుకు సందేగం పడ్తువు. సమయానికెందుకైన వుండును వుండనీ" అని నిర్బంధంచేశాడు. సుందరానికి గత్యంతరం లేకపోయింది.

"అయితే చూడు మునియాండీ నేనీ డబ్బును అప్పుగ పుచ్చుకుంటాను. నాకేదైన నౌకరి చిక్కితే నీకు దీన్ని వడ్డీతో సహా వాపసిస్తాను" అన్నాడు సుందరం. "సర్దా పో, అట్లానే చెయ్యిమీ, నీవు సంపాదించవాల. అంతదానే కోర్తును. నీవు

యెప్పుడు వచ్చిన, హైకోర్టు బస్‌స్టాండులో ఏ ముష్టిదాన్ని అడిగినా మునియాండి వుండే తావు చూపును అంటూ కొత్వాలు చావడివైపు దారిపట్టాడు మునియాండి.

# ఇరువదినాలుగవ ప్రకరణము

ఆరోజు సాయంకాలము, సుందరానికి యేమీ తోచక తిన్నగా మరీనా బీచికి వెళ్ళాడు. అక్కడ నీళ్ళవొడ్డున యిసక పైన వెల్లికిల పండుకొని, నాటి సంఘటననంతా ఒక్కమారు తలంపుకు తెచ్చుకున్నాడు. పట్నంలో ఒక చిన్న బిచ్చగాడి కుండే సంపాదన కూడ ఒక చదువుకున్నవానికి లేదుగదా! అనుకున్నాడు. ఇంకా యేమేమో యోచిస్తూ వుండగా, ఆకాశములో మబ్బులు గ్రమ్మి, చినుకు లారంభమైనాయి. క్షణంలోనే తుంపరల్లా పెద్దవానగా పరిణమించింది. అచటి వారందరు తలా ఒక దోవను పరుగెత్తసాగారు. సుందరం కూడా పరుగెత్తి వచ్చి, ప్రెసిడెన్సీ కాలేజి వరండాలో, గోడ కానుకొని నిలుచున్నాడు. కొంతసేపటికి లోపలినుంచి, ఎవ రివో మాటలు వినవచ్చాయి. మూయబడియున్న ఒక వాకిలి యొద్దకు వెళ్ళి చెవి యొగ్గి విన్నాడు. ఏదో తెనుగు నాటకా నికి, ఒద్దికలు జరుగుతున్నట్లున్నది. మరికొంతసేపు ఆలకించి వినగా, తను "స్వరాజ్యం" పత్రికలో ప్రకటించిన "నర్తకి" అనే నాటకమేనని అతనికి రూఢియై, లోనికి వెళ్లాలనే కుతూ హలం కలిగింది. ఎటు చూచినా అన్ని వాకిళ్లూ మూయబడి, లోవైపు గడియలు వేయబడి యున్నాయి. ఓపికతో ప్రతి తలుపు లాగిచూడ నారంభించాడు. తుదకొక తలుపు తెరుపుడు పడ్డది. లోనికి తొంగి చూచాడు. హాలంతా చీకటిగా వుంది. కాని, స్టేజిమీద కొందరు యువతీ యువకులు దీపాలక్రింద ప్రాక్టీసు చేస్తున్నారు. అందులో ఒకరు ఉపాధ్యాయుడు

కాబోలు, నట, నటీ బృందానికి, అప్పుడప్పుడు సలహాలిస్తూ ఒద్దికలు నడుపుచున్నాడు. మెల్లగ సుందరం లోపలికి ప్రవేశించి తలుపులు మూసుకొని, హాలులో ఒక బెంచీమీద కూర్చొని విన నారంభించాడు.

ఆ వద్దికలలో నర్తకి పాత్ర మన లలితదే. అప్పటికొక సీను ముగిసి మరొకసీను ప్రారంభించబోతుండగ, లలిత మేస్టరును చూచి "సార్ ఈసీను చాలా ప్రకృతివిరుద్ధంగ కనిపిస్తుందండీ. అసలు కథలోనే, ఈ కవి ఆడవాండ్లను బహు నీచంగా చిత్రించాడండి! అతనికి స్త్రీ జాతంటేనే గిట్టదేమో! ఈ నాటకమెందుకు తీసుకున్నామా అనిపిస్తూంది నాకు" అన్నది. "ఏమమ్మా! అంత అసహజంగా యిందులో యేముంది. ఎవరో చాలా అద్భుత సంఘటనంలోని కుళ్లునంతా వెళ్లగక్కి, నిజమైన ప్రేమ అంటే యేమిటో, కామమేమిటో, హిందూ సంసార ధర్మమనే దేమిటో, చక్కని సంవిధానాలతో, ముచ్చటైన మాటలతో, హృదయానికత్తే హత్తుకుపోయే భావాలతో, బహు అద్భుతమైన సాంఘికనొక్కదాన్ని యిన్నాళ్ళకు వ్రాశారుగదా యని నేనానంద పడుతుంటే, నీవేమిటిలా అంటున్నావు లలితా?" అన్నాడా ఉపాధ్యాయుడు. "మీ మగవాడు గనుక. యీ నాటకం అలాగే ఉంటుందిలెండి! మా ఆడ కళ్లతో చూడగలిగితే, మీకు అర్థమౌతుంది యీ వ్రాసినవాడొక దద్దమ్మని" అన్నది లలిత విసుగుతో. "అలాంటి అసహజమైనది, స్త్రీ జాతికి అపకారంచేసే సంఘటన యేమున్నదమ్మా" అన్నాడాయన. "కాకపోతే యేమిటండీ! చూడండీ? సరస్వతమ్మ నలుగురు బిడ్డలతల్లి. భర్తకొకవేళ నర్తకిమీద మోహం కలిగితే

మాత్రం, భార్యే ఆ నర్తకిని మొగుడికి తార్చిందంటే యెవరు నమ్ముతారండి? అపని ప్రపంచంలో ఏ స్త్రీకూడ చేయదు. మొగుడు అలా మరో స్త్రీతో స్నేహం జేస్తేనే భార్య కడుపులో కుళ్లుతూ ఉంటుంది. అది స్త్రీ నైజం. అది పోనిచ్చి, తానే తార్చిందంటే, యీ వ్రాసినవానికి బొత్తుగా లోకజ్ఞానమే లేదని నేను దూఢిగా చెప్పగలను" అన్నాది లలిత. "అలా తొందరపడి అనకమ్మా! లోకంలో యెన్నెన్ని చిత్రాలు జరుగుతున్నాయో నీ వెరగవు. పసిదానివి. ఈలాంటి పనులు ధనాభావముచేతనో, భర్తకు ఎదురాడలేకనో, మరే దౌర్భాగ్యం వల్లనో, జరగటంకద్దు. ఈ గ్రంధకర్త చాలా లోకానుభవం కలవాడని నా అభిప్రాయం" అని అన్నాడాయన. "మీరు మెచ్చుకోవాలిసిందే యీ రచనను. ఏ ఆడదీ వొప్పుకోదీ తప్పుడు నాటకాన్ని" అన్నది లలిత.

అప్పటికే ఆ అమ్మాయి వ్యాఖ్యానాన్ని భరింపలేని సుందరానికి యీ కడ వాక్యంతోగూడ వుద్రేకం కలిగి, ఓర్వలేక, బెంచిమీదనుండి లేచి తిన్నగా స్టేజి సమీపించి "నిజం చెప్తితే నిష్టూరమే నమ్మాయి. ఆడవారి సంగతి ఆడవారికే వెగటు, మొగవారి సంగతి మొగవారికే వెగటు. మీరీ యిద్దరిని వదలితే నాటకమే లేదు. నీవు చెప్పే సంఘటన కల్పితంగాదు. అది నిజంగా జరిగిన విషయమే, అందుకని ఇంగ్లీషులో, "కల్పితానికంటే, నిజమే అధిక ఆశ్చర్యకరంగా ఉంటుందని, సామెత పుట్టింది" అన్నాడు సుందరం. చీకట్లోనుంచి ఉన్నట్లుండి ఆ హాలు యీనిండా అన్నట్లు యీయన యెవరో పుట్టుకవచ్చి, యీలా గ్రంధకర్తను సమర్థించడం చూచి, అందరూ రెప్ప

లార్పకుండా సుందరాన్నే చూడసాగారు. అతని మాటలు విని లలితకు కొంచెం కోపం, మళ్లీ 'జరిగిన విషయం' అంటున్నాడే అని ఒకవైపు. తను వోడిపోతానేమో అనేభావం, యీలా పలురకాల భావాలతో "అసలు మీరెవరండీ? ఎలాగు లోని కొచ్చారు? ఎవరు మిమ్ము రానిచ్చారు?" అని కొంచెం అధికార ధోరణిలోనే అడిగింది. "నన్నెవ్వరూ రానివ్వలేదు. తలుపాకట్టి తీసుంచడం, నా నాటకాన్ని మీరు నేరుస్తుండడం చూచి లోపలకొచ్చి కూర్చొని వింటున్నాను." అని అన్నాడు సుందరం ఆశ్చర్యంతో. "నా నాటకం" అంటే మధుకరు మీరేనా"? అని అడిగాడు ఉపాధ్యాయుడు. "చిత్తం" అన్నాడు సుందరం. తక్షణమా ఉపాధ్యాయుడు, సుందరాన్ని చెయ్యిబట్టి, స్టేజిమీదకి పిలుచుకొని పోయి ఎంతో ఆనందంతో అతన్ని కౌగలించుకొని, ఈ నాటకాన్ని పత్రికలో చదివిందిమొదలు నాకు దీనిమీద, వ్రాసినవారిమీద చాలా అభిమానం, గౌరవం కూడఏర్పడింది. గ్రంథకర్త ఎంతో లోకానుభవం కలవాడు. తుద కొక అరవై యేళ్లేనా ఉంటాయేమో అనుకుంటుండే వాణ్ణి. ఇప్పుడుచూచి,యింత చిన్నవయసులోనే యిలాంటి గ్రంథాన్ని వ్రాయగలిగినారని మరీ నా ఆనందం హెచ్చింది. భేష్, ఈ రోజు మిమ్ములను చూడగలిగినందుకు చాలా సంతోషం మధుకరం గారూ!" అన్నాడా ఉపాధ్యాయుడు. "నా పేరు సుందరరావు. అది కలం పేరు. గనుక, మీరునన్ను సుందరరావనే పిలవండి" అన్నాడు.

ఈ సంభాషణ వింటూండిన అచటి విద్యార్థుల కందరికీ చాలా సంతోషంగానే యుంది. కాని, లలితకు మాత్రం కొంచెం సిగ్గుగా ఉండింది. "ఎక్కడినుంచో ఊడిపడ్డట్టీయన,

యిప్పుడిక్కడి కెందుకురావలె. ఈ సమయంలోనే, నేనా వ్యాఖ్యానము యెందుకు చేయవలె, ఇదంతా నాకర్మగదూ?" అనుకుంటూ సుందరంవైపు చూచేందుకు, సాహసించ జాలకుండింది లలిత.

ఉపాధ్యాయుడు సుందరాన్ని క్షేమాతిశయాలు విచారించి, "ఎటూ రానేవచ్చారు, పై శనివారమే వార్షికోత్సవం. గనుక ఈ వారం రోజులు మీరే యీ నాటకాన్ని యీ పిల్లలకు నేర్పి జయప్రదం చెయ్యాలని నా కోరిక. ఆరోజు మిమ్మల్ను, గౌరవించాలని కూడా నాకున్నది" అన్నాడు.

"నేను రేపే వెళ్లవలసి యున్నదండీ! ఏదోవచ్చినపని అయింది. ఇకజాస్తి రోజులుండేందుకు కూడ, నేను సిద్ధపడి రాలేదండీ!" అన్నాడు సుందరం.

"మరేమి ఫర్వాలేదులెండి! మాకుగాను మీరిక్కడనుంటే మీసౌకర్యాలు మేము విచారించుకోమూండి, చెప్పండి మీరే హోటల్లో ఉన్నారో, అక్కడనే మీకు మేము అన్నివసతులు మాఖర్చుతో ఏర్పాటుచేస్తాము"అన్నాడాయన."నేను హోటలులో లేను, ఒకగది తీసుకొని ఉన్నాను. కాని, మీకీ శ్రమఅంతా యెందుకూ! మీరే జరుపుకోండి"అన్నాడు బిగువు వదలకుండా సుందరం.

"అలా కాదండీ! మీరే యీ వద్దికలు నడిపితే, ఈనాటకం చాలా అద్భుతంగా తయారౌతుందని, నాకు నమ్మకం. కాబట్టి, మీరు వొప్పుకోవాలి" అని జవాన్ను పిలిచి, ఆఫీసు గుమాస్తాను పిలవమన్నాడు. గుమాస్తా రాగానే, సుందరాన్ని ఆయనకు పరిచయంచేసి, " వీరికి సంఘం డబ్బులోనుంచి యాభై రూపా

యలు ప్రస్తుతమివ్వండి" అన్నాడు. ఆ మరుక్షణంలోనే గుమాస్తా పైకం తెచ్చియిచ్చాడు. సుందరం కొంత బిడియం తోనే పుచ్చుకొన్నాడు. "ఇక యీ నాటకం బాధ్యతంతా మీ పైననే ఉంది. సుందరరావుగారూ! మఱిచాను. లలిత యేదో అనుభవంచాలక, తెలియక అన్నమాటలు మీరుపాటించకూడదు" అన్నాడు ఉపాధ్యాయుడు. "అలాగేలెండి. కాని, తమ రెవరో తెలియకున్నది" అన్నాడు సుందరం.

"నేను యీ కాలేజీలో తెలుగు పండితుణ్ణి. పేరు శంకర శాస్త్రి. యీ ఆంధ్ర సంఘానికి, యీ సంవత్సరము నేనే ప్రెసిడెంటునుకూడాను. మరి ప్రారంభిద్దామా" అన్నాడు.

పై సీను ఆరంభించి సాగుతూఉంది. నాటకంలో సర స్వతమ్మ భర్త పాత్రధారికి, కొన్ని విషయాలుచెప్పి, యిక కానీయండన్నాడు సుందరం. అక్కడక్కడ అందరికి చక్కని సలహాలిస్తూనే వచ్చాడు. కొన్నిచోట్ల కొందరికి, తాను నటించి చూపాడు. క్రమేణ అతని తెలివితేటలకు, అందరు మెచ్చుకోసాగారు. లలితకేమో మరీ తలగొట్టినట్లైంది. సుందరం చెప్పినట్లల్లా నటించింది. ఒద్దికలు ముగిసినవి. అందరు యిండ్లకు బయలుదేరారు. లలితకై కారు కాచుకొని ఉంది బయట. మిగతవారి నందరిని పోజూచి, లలిత సుందరాన్ని సమీపించింది. అతను "ఏమమ్మాయీ" అంటూ ఆమెవైపు తిరిగాడు. "మీతో ఒక్కమాట" అన్నాది. సుందరం లలితను సమీ పించాడు. లలిత అతన్నిచూచి, "నేనేదో తెలివితక్కువగా తొందరపడి అన్నమాటలకు, మీరు నన్ను క్షమించాలి. మీరు

వ్రాసినసీను, నిజంగా జరిగినదని మీరు చెప్పేవరకు, అది అసంభవమని నేను నమ్మియుండినాను " అన్నది.

" మరేమీపర్వాలేదమ్మ ! అందుకై నీవింతగ చెప్పుకోవలసిన అవసరంలేదు. అదప్పుడే మరచాను. నేను సృష్టించిన నర్తకి పాత్రను నీవు కడుచక్కగ నటిస్తున్నందుకు నేను నీకు కృతజ్ఞుడను" అన్నాడు సుందరం. అందుకామె " నా నటనలో తప్పులుంటే మీరు సంకోచపడకుండ దిద్దండి. మీకడ నేర్చుకోవలసిన విషయాలు చాలాఉన్నవని నాకు తోస్తూంది " అన్నది. "నన్ను మీరు చాలాగొప్పవాణ్ణి చేయకండి ! నేను చాలాసామాన్యుణ్ణి, బీదవాణ్ణి " అన్నాడు సుందరం. " మీరలా అనకూడదు. నమస్కారం " అంటూ లలిత కారెక్కి వెళ్లింది.

ఆమరుసటి రోజు, సుందరం కాలేజికివెళ్లి ఒద్దిక నడిపాడు. అందరు నటులు చాలా కుతూహలంతో, తమతమ పాత్రలను నటించారు. ఆరోజు సాయంకాలమింటికి వెళ్లుతూ సుందరంతో " ఒక మారు మాయింటికిరారూ ? మా బాబయ్య మిమ్ములను ఒక మాటు యింటికి పిలుచుకొనిరమ్మన్నారు " అన్నది లలిత. " దానికేం సంతోషంగావస్తాను" అన్నాడు సుందరం. " రేపు శనివారం. కాలేజిలేదు గనుక మీ అడ్రసు చెప్తే మధ్యాహ్నం మూడు గంటలకు, కారు తీసుకొనివస్తాను" అన్నది లలిత. సుందరం తనుండే కిష్కింధ కాపిల్లను రప్పించడమిష్టపడక, " ఎందుకులెండి ! నేను రేపు కొంచెంపనిమీద వెళతాను. మీ అడ్రసు చెప్తే, నేనే ఆవేళకు మీ యింటికివస్తాను. అన్నాడు సుందరం.

లలిత తన అడ్రెసు ఆయనకువ్రాసి యిచ్చింది. దాన్ని పుచ్చుకొని, సుందరం హోటలుకుపోయి భోజనంచేసి తనగదికి వెళ్లి పండుకున్నాడు. మునియాండియిచ్చిన, పదిరూపాయలు ఖర్చుకాకమునుపే, మరొక యాభై రూపాయలు చిక్కాయి. అన్నట్లువాడి డబ్బు మంచిదేనేమో అనుకుంటూనిద్రపోయాడు.

ఆ మరుసటి రోజు మూడు గంటలకు సుందరం శ్రీధర రావుగారి యిల్లు చేరాడు. లలిత ఆయనను తన తల్లిదండ్రులకు పరిచయంచేసింది. శ్రీధరరావుగారతని, కుల గోత్రాలు, స్వగ్రామం వగైరా విచారించాడు. సుందరం తాను నియోగి బ్రాహ్మణుడనని, తాను ఒంటరివాడనే నని, ఏదోఅలా కథలు, నాటకాలు, వ్యాసాలు వ్రాసి జీవయాత్ర సాగిస్తున్నాని చెప్పాడు. "ప్రస్తుతమేంజేస్తున్నారు?" అని అడిగారు శ్రీధరరావుగారు."ఊరకనేయున్నానండీ"అని అన్నాడు."మీరు వ్రాసిన నాటకం చాలాబాగుందని అన్నది మా అమ్మాయి. కాని, లలితకు మీకు మొదటి పరిచయమేవిధంగా జరిగిందికూడా చెప్పి, చాలా పశ్చాత్తాపపడింది" అన్నారు శ్రీధరరావుగారు సుందరం నవ్వి "ఏదో యిలాంటివి జీవితంలో సహజమే గదండీ" అన్నాడు సుందరం.

ఇంతలో కాఫీ, ఫలహారం సిద్ధమైనాయి. లలిత కూడావచ్చి కూర్చుంది. అందరూ ఆరగించారు. కొంత సేపు లోకాభిరామాయణం సాగించారు.

"ఇక రిహార్సలుకు వేళైంది వెళ్లుదామా!" అంటూ లలిత లేచింది. సుందరంకూడా లేచి శ్రీధరరావుగారికి, రాధాదే

గారికి నమస్కరించి లలిత వెంబడి కారులోకి వెళ్లాడు. ఆనాడు కాలేజీలో మామూలు ప్రకారం వొద్దిక జరిగిపోయింది. అందరు యిండ్లకు వెళ్లుతున్నారు. లలిత "రండి కారులోనే మిమ్ములను, మీయింట్లో దించి వెళ్లుతాను" అని అన్నది సుందరంతో. "ఎందుకూ! దగ్గరేగా! నే వెళ్తానులే అమ్మాయి" అన్నాడు సుందరం. "ఏమండీ! నేనొక మారు మీయిల్లు చూడగూడదా!" అన్నది లలిత. "ఎబ్బే, ఎందుకు చూడగూడదూ!" అన్నాడు. "అయితే రేపు మధ్యాహ్నం మూడు గంటలకు మా యింటికొస్తారూ?" అన్నదామె! "తప్పక వస్తాను" అని వెళ్లాడు సుందరం.

# ఇరువది యైదవ ప్రకరణము

ఆ మరునాడు ఆదివారం గనుక, లలిత యింట్లోనే వుంది. సరిగ్గా మూడు గంటలకు సుందరం వచ్చాడు. అప్పుడే ముస్తాబై, గదిలో అద్దంలో అందం చూచుకుంటూ ఉంది లలిత. "లలితా! సుందరరావు వచ్చాడు చూడూ!" అన్న శ్రీధర రావుగారి మాటలు ఆమెకు వినిపించాయి. దాంతో వాళ్లున్న చోటికి వచ్చి "ఈ పూట నన్ను, 'టీ' కి పిలిచారాయనగారు. వెళ్లొస్తా నాన్నా!" అంటూ సుందరంవైపు చూచింది లలిత. ఈ మాటలు పిడుగువలె పడ్డాయి సుందరం చెవులలో. తన గదిని యిన్నాళ్లూ చూపకుండా తప్పించుకుంటున్నాడు. ఇప్పుడా పిల్లవేసిన అస్త్రానికి తప్పిందికాదు. ముందుగానైనా ఇలా అవుతుందని తెలిసియుంటే, అందు కతను ఒక విధంగా సిద్ధపడి యుండేవాడేమో! కాని, ఇప్పుడు విషయం మించి పోయింది. ఇక తప్పదని తీర్మానించుకొని, ఒక బలవంతపు నవ్వు నవ్వి, "ఔనండి!" అన్నాడు సుందరం. "మంచిది, వెళ్ళి రండి" అని శ్రీధరరావుగారు, వారిని కారులో యెక్కించి పంపాడు.

దారిలో కారులో, యిద్దరూ కాసేపు మౌనంగా కూర్చొని ఉన్నారు. తర్వాత కొంతసేపటికి "ఎందుకీపని చేసానా? ఇతనికి బాధగాయున్నట్లుందే?" అని లలిత కలత పడుతోంది. "ఇప్పుడు గదికెళ్ళి ఏం చేయనా" అని, అతనాలోచి స్తున్నాడు. ఇలా మాట్లాడకుంటే, లలిత ఏమనుకుంటుందో

నని అతను, అదేమాదిరి అతనేమనుకుంటాడో అని లలిత అను కుంటున్నారు. కాని, ఎలా మాటలారంభించడమో యిద్దరిలో ఒకరికీ తోచలేదు. చివరకు సాహసించి లలిత "ఏమండీ ఊరు కున్నారు, మిమ్ములను చాలా బాధపెడుతున్నానని కోపమా" అన్నది. "ఛీ, ఛీ కానేకాదు. నిన్నింతకు మునుపే, 'టీ' కి పిలుద్దామనుకొని మఱచిపోతినే అని అనుకుంటున్నాను" అన్నాడు. "పోనీండి! నేనే పిలవని పేరంటంగ వస్తున్నానుగా!" అన్నది లలిత.

"నే జేసిన పొరపాటుకు సిగ్గౌతున్నది. నీవు..." "సిగ్గు లేకుండా నీవుగానే వస్తున్నావంటారా" అన్నది లలిత సగంలో అతన్ని ఆపి.

నవ్వుతూ "నీవు చాలా కొంటెపిల్లవులలితా ! నేనెన్నటి కైనా నీవిషయం అలా అనుకోగలనా?" అన్నాడు సుందరం.

"నా కొంటెతనం మన ప్రథమ పరిచయానికి ముందే గ్రహించారుగా మీరు" అన్నది.

"దాన్నింక మఱచిపో లలితా ! నీవు ఆ విషయాన్ని తలచుకొని, బాధపడుతుంటే నేనోర్వలేను" అని బాధ కనపరుస్తూ అన్నాడు సుందరం.

"ఇక నేనెప్పటికీ ఆ ప్రస్తావన ఎత్తను లెండి, క్షమిం చండిప్పటికి" అన్నది.

ఈలా వీరి లోకంలో వీరుండగ, కారు సుందరముండే వీధి దాటి, పైకికొంచెం దూరం వచ్చియుండడ మాతను

చూచి, డ్రైవరును కారు త్రిప్పమని తనుండే యింటి దారి చెప్పాడు. డ్రైవరు కారు మళ్లించి, అతనింటి వాకిట నిలి పాడు. ఇద్దరూ దిగి లోపలికి వెళ్లారు. ఆ యింటివాకిట వరండా లోనే మిద్దెమెట్లు. వాటిని యెక్కి పైకి వెళ్లి, సుందరం తన గదితలుపు బీగం తీసాడు. ఇద్దరూ లోపలికి ప్రవేశించారు. ఒక్కమారు లలిత క్షణంలో, ఆ గదియున్న స్థితిని చూచి అవ గాహన చేసుకుంది. సుందరం ఒకవైపు కిటికీ తెఱచి "ఇక్కడ నీకు కూర్చోనేందుకుకూడ సరియయిన చోటులేదు" అంటూ నవ్వుతూ, తన పడకక్రింద చాప చూపి, "ఇదే సోఫా అనుకొని కూర్చో. నేవెళ్లి కాస్త తినేందు కేదైన తీసుకురమ్మని హోటలు వానితో చెప్పివస్తాను," అంటూ వెళ్లాడు.

ఆ గది చిమ్మి యెన్నాళ్ళయిందో! అతని పడక కిరు వైపుల సిగరెట్టు ముక్కలు, పేపర్లు, పత్రికలు, ఒకమూల అత నేమో వ్రాసి చింపివేసిన కాగితపుముక్కలు, అతని పెట్టెమీద కొన్ని మాసినబట్టలు, గోడలమూలల్లో సాలెపురుగుల గూళ్లు, యీలాంటివాటితో నిండి, మనుష్యులు కాపురమున్న గదిలాగు కనుపించలేదామెకు. ఏం తోచిందో వెంటనే ఒకమూలపడివున్న చినిగిన బనీను తీసుకొని, గదిని శుభ్రంగా తుడిచి, చెత్తంతా యెత్తి బయటబోసి అతని పడకను విదిలించి చక్కగ చుట్టి పెట్టి, మాసిన బట్టల నొక తువాలాలో మూటగట్టి మూలబెట్టి, అచటి పత్రికలను, ఉపయోగపడే కాగితాలను చక్కగమడిచి కిటకీలో బెట్టి, అతను వచ్చేసరికి ఏమీ యెరుగనిదానివలె చాప మీద కూర్చుని, అక్కడే యుండిన ఒక నవలను చదువుతున్న దానివలె అభినయిస్తూంది.

కాఫీ, ఫలహారము తెత్తించుకొని సుందరం వచ్చాడు. హోటలు కుఱ్ఱవాడు వాటి నక్కడ వుంచి, "మళ్ళీ వస్తాను సార్" అంటూ వెళ్ళాడు. సుందరానికి లలిత చేసినపని తక్షణమే గోచరమైంది. "ఇదేంటి లలితా! నాకు మంచి బుద్ధి నేర్పావే ? ఒక్క నిమిషంలో" అన్నాడు.

"అబ్బే అంతమాటెందుకండీ ! ఆడది చేయవలసిన పనే చేశాను" అన్నదామె నవ్వుతూ. "కావచ్చుగాక. కాని యీపని మీ యింట్లో చేసివుంటే బాగుండేదేమో" అన్నాడు. "ఇదుగోండి, ఇంత స్నేహంగావుంటూ మీరు మాది, మీది అనే భేదం చేయడం నాకు కష్టంగా యుంది. పైగా గది నలా వుంచుకొని యుంటే, మీ స్నేహితు లెవరైనా వచ్చి చూస్తే వారే మనుకుంటారు?"అన్నది లలిత. "బ్రహ్మచారిగాడి గదని, తక్షణం గ్రిహించి ఏమీ అనరు" అన్నాడు సుందరం. "ఈమాటల్లో కాఫీ చల్లారి పోతూంది. రండీ! నేనే వడ్డిస్తాను మీకు" అంటూ చప్పున లేచి, ఆ ప్లేట్లను అతని ముందు బెట్టింది లలిత.

సుందరాని కామె చర్యలేమీ అర్థం కావటం లేదు. ఒక వైపు లలితయొక్క గుణాలను చూస్తుంటే, తనట్టే వశ్యమై పోతున్నట్టుందామెకు. రూపమూ ముందే ఆకర్షించింది. ఆమె చర్యలను బాగా ఆలోచించి చూస్తే "ఆమె ప్రేమిస్తున్నదా" అని సందేహమౌతూంది. కాని, పైకా పనుల కార్థం చెప్పేందుకే అవకాశం కనుపించదు. క్షణక్షణమూ, తన మనసు ఆమెనే కోరడ మారంభించిందని మాత్రిం అతనికి తెలుస్తూంది. ఆమెకూ అతని తెలివితేటలూ, రూపం, వయసూ ఆకర్షించాయి. అవి అతనిపైన తనకు కలిగిన గౌరవమేనని అనుకున్నది యింతవరకు.

కాని, యిప్పుడు ఆమెకు అతని స్థితి చూచి, తన కాతనియం దేదో తనకే అర్థంగాని భావ మొకటి ఉత్పన్నమౌతున్నదని ఆమెకే తోస్తూ వుంది. ఈ విధంగా ఉభయులు తమ తమ యోచనలతోనే ముందున్న ఫలహారాన్ని ముగించి, కాఫీ త్రాగి చేతులు కడుక్కున్నారు.

"ఆమెతో ఏమి మాట్లాడుదామా," ఆమెను ఉత్సాహ పూరితురాలినిగా నొనర్చుటకు మార్గమేదా' అని సుందరం యోచించాడు. ఏమీ తోచలేదు. ఇంతసేపూ తను మౌనంగా ఉన్నందుకు లజ్జించాడు. ఏదో మాట్లాడుదామని "మీలాంటి వాళ్లెవరైనా వస్తే వాళ్ళకు కాస్త వినోదం కలుగజేయటం కూడ నాకు తెలియదు. నీ కిక్కడ పొద్దుపోవడం కష్టమే. ఏం చెయ్యడం?" అన్నాడు సుందరం. పెంకెగ నవ్వి "పోనిండు మీ నాటకంలో మీరు వ్రాసిన పాట నొకమారు పాడి విని పించండి!" అన్నది లలిత. "అసలు సంగీతమంటే ఏ బజార్లో అమ్ముతారనేవాణ్ణి నేను. అందులో నీ ముందు- హనుమంతుని ముందు కుప్పిగంతుల్లాగ అంత సాహసం చెయ్యలేను. కాని నీకు మంచి సంగీతము వినాలని వుంటే మాత్రం వినిపిస్తాను" అని అన్నాడు సుందరం నవ్వుతూ. "అదేగా నేను కోరింది" అని ఎంతో ఆశతో అతను పాడబోతాడని ఆనందపడుతుంటే, గది ప్రక్కవైపు కిటికీ తెరచి "యిలా వచ్చి యిక్కడ కాసేపు నిలుచో, ఆ ప్రక్కయింటి రేడియో సంగీతం వినవచ్చు" అన్నాడు సుందరం. దాంతో ఆమె పకపకనవ్వి "ఏడ్చేవాళ్ళను కూడ నవ్విస్తారండీ మీరు" అన్నది. నిష్కల్మషంగా నవ్వుతున్న ఆ సుందరిని చూస్తూ, అట్టే ముగ్ధుడై నిలచాడతడు. కొంతసేప

టికి నవ్వాపుకొని, ఆమె అతనివైపుచూచి అతని కళ్ళలోని భావాన్ని గ్రహించి, లజ్జపడి, యేమిచేయను తోచక, తటాలున తన చేతి గడియారాన్ని చూచి, "4½ అయింది. ఇక మనకు రిహార్సలు టైమైంది" అన్నది. ఆ మాటతో సుందరం మళ్ళీ ఊహా ప్రపంచంలోనుంచి, బయటపడి, "అలాగా! సరే! వెళ్ళుదాం" అంటూ కిటికీ తలుపు మూశాడు. ఇంతలో హోటలు పిల్లవాడు వచ్చి, ఆ ప్లేట్లు వగైరా పట్టుకెళ్ళాడు. గదికి బీగంవేసి లలితతో కారెక్కి కాలేజికి వెళ్లాడు సుందరం.

# ఇరువదియారవ ప్రకరణము

ఇంతలో ఆ శనివారం వచ్చింది. వార్షికోత్సవానికి ఆహ్వానితులందరు హాలులో క్రిక్కిరిసిపోయారు. శ్రీధర్ రావు గారుకూడా భార్యాసమేతంగా వచ్చారు. నాటకము, లలిత నాట్యము చాలా బాగా జరిగాయి. అందరు అద్భుతమన్నారు, ఏ సంవత్సరము యింత గొప్పగా జరుగలేదన్నారు. సుందర రావుగారి గుణాతిశయాలను చాలా గొప్పగా సభ్యులకు చెప్పి, సభలో ఒక శాల్వను, నూటపదహారు రూపాయలను సంఘం తరఫున శంకరశాస్త్రిగారు సుందరానికి బహూకరించి గౌర వించారు. ఈలాంటి సంఘసంస్కారానికి ఉపయోగకరములయ్యే నాటకాలను యింకా చాలా వ్రాసి పేరు గడించమని అందరు అతనిని ఆశీర్వదించారు. సభ ముగిసింది జయప్రదంగ. అందుకు కారణం- సగం సుందరరావే నన్నాడు శంకరశాస్త్రి. ఇంటికి వెళ్లుతూ, "రేపు మా యింటికి భోజనానికి రా నాయనా" అని పిలచారు సుందరాన్ని శ్రీధరరావుగారు. అతనూ వొప్పుకొని తన గదికి వెళ్ళాడు. తన జీవితంలో ఒక క్రొత్త అధ్యాయం ప్రారంభమౌతున్నదని అనుకున్నాడు.

ఇంతలో ఆరాత్రివేళ యెవరో తన గదితలుపు తట్టినట్లు శబ్దమురాగా, వెంటనే వెళ్లి తలుపు తెరచి, వచ్చిన వ్యక్తిని చూచి "ఎవరూ" అన్నాడు. ఆ వచ్చిన వ్యక్తి "నా పేరు కన్నయ్యనాయుడు. నేనీ ఊళ్ళో ఒక నాటక కంపెనీ నడుపు తున్నాను. మీతో కొంచెం మాట్లాడవలసి వచ్చాను" అన్నాడు. సుందరం అతనిని లోపలకి రమ్మని తన పడకను కాస్త చుట్టి

షావమీద కూచోమని, తానూ కూర్చున్నాడు. కన్నయ్య నాయుడు "నర్తకి" నాటకాన్ని తన కంపెనీ ప్రదర్శించేందుకు అనుమతి కోరుతూ, తన శక్త్యానుసారం ఒక మొత్తమిచ్చు కుంటాను అనికూడా అన్నాడు. "ఏమిస్తారు" అన్నాడు సుందరం. నాయుడు సంకోచిస్తూ, "అయిదువందల రూపా యలిస్తా"నన్నాడు. అదే, అయిదువేలుగ తోచింది సుందరానికి. వెంటనే సరేనన్నాడు. అప్పుడే సుందరంచేత, ఆ విధంగా ఒక జాబు వ్రాయించుకొని, అడ్వాన్సుగా వంద రూపాయలు యిచ్చి, మరుసటిరోజు మిగతా పైకం తెచ్చి యిస్తానని వెళ్లాడు కన్నయ్య.

•

# ఇరువదియేడవ ప్రకరణము

ఆ మరునాటి ఉదయమే కన్నయ్యానాయుడు నాలుగు వందలు తెచ్చి యిచ్చి రసీదు పొందాడు. సుందర మతనిని సాగనంపి, గదికి బీగంవేసి శ్రీధరరావుగారింటికి భోజనానికి వెళ్ళాడు. అచటవారు వడ్డించిన, ఆవకాయ, గోంగూర పచ్చళ్ళతోనే సగం భోజనం ముగించాడు సుందరం. ఈ హోటళ్ళల్లో సాంబారు రసం తిని, తిని నోరుచవి చెడిపోయి యున్నాడు గదూ! భోజనానంతరం చాలా సేపు శ్రీధర రావుగా రతనితో ఏవేవో మాట్లాడారు. మధ్యలో, ముందు రోజు తను కన్నయ్యానాయుడికి తన నాటకాన్ని ప్రదర్శించేం దుకు అనుమతి వ్రాసియిచ్చిన విషయం సుందరం ఆయనతో అన్నాడు. "ఎంతకిచ్చావు" అని, ఆయన అడిగితే "ఏం! అయిదు వందలు యిచ్చాడండీ" అని, తానేదో పెద్ద వెలకమ్మిన వాని లాగు జవాబిచ్చాడు సుందరం. ఈ మాటకు శ్రీధరరావు గారికి నవ్వొచ్చింది. "ఎందుకండీ! నవ్వుతారు" అన్నాడు సుందరం.

"మరి, మించిపోయినదానికి నవ్వక యేడ్చి యేమి ప్రయోజనం చెప్పు."

"మీ అభిప్రాయం నాకు బోధపడడంలేదు."

"ఎలా బోధపడుతుంది? యీ విషయాలలో అనుభవం లేకపోయె నీకు. ఉండేవాణ్ణి నన్నైనా ఒకమాటు అడుగక

పోతివి. ఇక కన్నయ్యా, నీ నాటకంతో, ఎన్ని వేలార్జిస్తాడో నీ వెరుగవు.''

"సరి, మరి మించిపోయినదానికి, ఇప్పుడేం జెయ్యడం గనుక ముందిక జాగ్రత్తపడతాను లెండి.''

"పోనీ. నాటక ప్రదర్శనానికి మాత్రమే అధికార మిచ్చావా? లేక, అన్ని హక్కులు వ్రాసియిచ్చావా?"

"అబ్బే! లేదండి, ప్రదర్శించేందుకు మాత్రమే అధికార మిచ్చాను."

"అయితే కొంతమేలు నామాట విని ఆ నాటకం ప్రతి ఒకటి నా చేతికివ్వు. కన్నయ్య నాటకం ప్రదర్శించే నాటికి, మన ప్రెస్సులోనే అర్జంటుగా అచ్చువేయించి, అచ్చు పుస్తకా లమ్మకానికి పెడదాం. ఎటూ నీ నాటకం, అతనికొక గొప్ప లాభాన్ని, నీకొక పెద్ద పేరు ప్రఖ్యాతులను సంపాదించి యిస్తుందని నాకొక నమ్మకం. గనుక పుస్తకాలు విరివిగా అమ్ముడుపోయి నీకు కొంత లాభం ఉంటుంది.''

సుందరానికి యీ సలహా నచ్చింది. కాని, ముద్రణ ఖర్చుల విషయమై ఏమీ చెప్పలేక మదనపడుచున్నాడు. అతని ఆలోచనలను గ్రహించిన శ్రీధరరావుగారు, "కాగితం, అచ్చాఫీసు మన చేతిలో ఉండేవి. కాబట్టి యీ విషయమై యే యోచనా నీకవసరం లేదు" అన్నారు.

ఆ రోజే, నాటక ప్రతి నొకదానిని శ్రీధరరావుగారి కందించాడు సుందరం. ఆ మరుసటి రోజునుండి ముద్రణా

కార్యకలాప మారంభమైనది. కన్నయ్య వొత్తవాడహాలును ఒక్క రేయేడాదికి అద్దెకు బుచ్చుకొని, ఆడబోయే నాటకానికి ప్రచారమనే అంకురార్పణ చేశాడు. ఒక శుభముహూర్తాన నాటక ప్రదర్శన మారంభించాడు. ఆనాటికే తయారైన అచ్చు ప్రతులను, శ్రీధరరావుగారు, కమిషను పద్ధతిలో ఒక మనిషి చేత అమ్మించ ప్రారంభించాడు. మొదటి ప్రదర్శనానికి, కన్నయ్యనాయుడు గ్రంథకర్తను, శ్రీధరరావుగారిని ఆహ్వానించాడు. హాలులో ముందు శ్రేణిలో ఆసీనులైనారు. వీరుభయులు. హాలు ప్రేక్షకజనంతో క్రిక్కిరిసిపోయింది. హాలు బయట యింకా టిక్కెట్లకై గోలచేయుచుండిన గుంపును సముదాయించి, పంపేందుకు ఒక అరగంట బట్టింది గేటులో సౌకర్లకు. నాటకం నాందితోనే రక్తిగట్ట నారంభించింది. బడి పిల్లలు ఆడితేనే అద్భుతంగా ఉన్న నాటకం, ఇక ఆరితేరిన ఆటగాంద్ర చేతబడితే చెప్పవలెనా! ప్రతిక్షణానికీ కరతాళధ్వనులే, ప్రతిపద్యానికి వన్సుమోరులే; దీన్నంతా గమనిస్తూ ఉండిన శ్రీధరరావుగారు, నాటకం సగమయ్యేసరికి, తన ఆనందాన్ని ఆపుకోలేక, ప్రక్కన యున్న సుందరాన్ని గట్టిగ కౌగలించుకొని, అతని ప్రథమ ప్రయత్నానికి కలిగిన ప్రజాదరణకై అతనిని పలువిధముల అభినందించసాగాడు. వీరి సంభాషణ వినుచుండిన ప్రక్కనున్న ప్రేక్షకులు కొందరు శ్రీధరరావుగారి ననుసరించారు. కవిగారు హాలులోనే వున్న విషయం, ఒక్క నిముషంలో హాలంతా ప్రాకినది. వెనుకవైపునుంచి "కవిగారిని రమ్మనండి మేము చూడాలి" అన్న కేకలు మొదలై కన్నయ్యనాయుడు హాలులోకి వచ్చి, సుందరరావును రంగస్థలంమీదికి పిలుచుక వెళ్ళి నిలపిన మీదట ఆగినవి. నాయుడు

సుందరరావును ప్రేక్షకులకు పరిచయం చేసి, యథోచితముగా పుష్పమాలాలంకృతును చేసి, పిన్నవయసులోనే అతనికి గలిగిన నాటకరచనా ప్రతిభను ప్రశంసించి, మున్ముందు పెక్కు నాటక రాజములను అతను రచించుటకు భగవంతుడనుగ్రహించు గాక యని, ఆశీర్వదించినాడు.

పిమ్మట నాటకం సాగింది. జయప్రదంగా ముగిసింది. మొదటి రోజే నాటక ప్రతులు నూరింటికిపైగ అమ్ముడుపోయి నవి. వారానికి నాలుగు ప్రదర్శనములు జరుగుచున్నవి. రోజు విక్రయ మగుచున్న నాటకప్రతుల సంఖ్య హెచ్చు అగుచునే యున్నది. నాటకప్రదర్శనకు రోజురోజుకీ వసూలు పెరుగు చునేయున్నది. నాలుగు మాసములైనా యేమీ తగ్గలేదు. నాటక మప్పుడే రెండవముద్రణకు తయారైనది. ఆరుమాసాలయ్యే సరికి, ఓ పాతికవేల రూపాయలు, సుందరరావుకు ముట్టినవి. దాంతో శ్రీధరరావుగారి సలహాతో మాంబళంలో ఒకచిన్న బంగళా కొనుక్కొని అందులో చేరాడు.

ఇంతలో తనప్పటికే వ్రాస్తూయుండిన "అనాథ" అనే రెండవ నాటకం కూడా తయారైంది. దానిని శ్రీధరరావు గారు ముందుగానే అచ్చువేయించి, ఒకప్రతి కన్నయ్య్ కంద జేశాడు. "నర్తకి" కంటే అద్భుతంగా కుదిరిన యీ క్రొత్త నాటకాన్ని చదువుకున్న వెంటనే కన్నయ్యనాయుడు సుందరం కడకొచ్చాడు. సుందరం శ్రీధరరావుగారి కడకు నాయుడుగారిని పిలుచుకొని వెళ్ళాడు. శ్రీధరరావుగారు, రెండవ నాటకం విషయమై బేరం చాలాబిగువుగానడిపి, తుదకు ప్రదర్శన

హక్కుకుమాత్రం కన్నయ్య సుందరానికి యిరువదివేలు యిచ్చేటట్లు ఒప్పించి వ్రాతకోతలు పూర్తిచేయించారు. సుందరం తన్ను తానే నమ్మలేకపోయాడు. ఈ క్రొత్త డబ్బుతో క్రొత్తకారు కూడ ఒకటి కొన్నాడు.

# ఇరువదిఎనిమిదవ ప్రకరణము

ఒకరోజు సుందరరావుకు మునియాండి జ్ఞాపకమొచ్చాడు. వాడు తనకు పదిరూపాయలు యిచ్చిన నాటినుంచి తనకదృష్టం పట్టిందనే తీర్మానానికొచ్చి, అతనికేదైనా మంచి ప్రత్యుపకారం చేయాలని నిర్ధారించుకొని, కారెక్కి తిన్నగ బ్రాడ్వే పార్కుకు వొచ్చాడు. మునియాండి అప్పుడే తన వ్యాపారాన్ని ముగించుకొని, విశ్రమించేందుకతని మిరాసీ బెంచిపైకి చేరాడు. సుందరం కారులోనుంచి దిగడంచూచి ఆనందంతో తానే అతనికడకు వెళ్ళి, "ఏంబా! ఈకారు నీదిదాన, నిన్ను చూస్తేనే తెలుస్తా ఉంది" అని కారును, సుందరాన్ని పరామర్శతో చూచాడు. సుందరం జేబులోనుంచి ఒక వందరూపాయల నోటు తీసి అతనికిస్తూ "చూడు మునియాండీ! నీవు నాకానాడు పదిరూపాయ లిచ్చినది మొదలు, నాదశ తిరిగింది, లక్ష్మి నన్నే వరించిందనుకో. కాని నేను సంపాదించటమంతా నాటకాలు వ్రాసే అనే విషయం నీకు ముఖ్యంగా చెప్పదలచాను. ఈ వందరూపాయలు నీకు పుచ్చుకో" అని అతని చేతిలో పెట్టినాడు. మునియాండి ఆనందముతో దాన్ని పుచ్చుకొన్నాడు. సుందరం అంతటితో వెళ్ళక "నీవు చేసిన ఉపకారానికి, ఇంకా యేమైనా పెద్ద ఉపకారం చెయ్యాలని నా మనసులో వుంది". అన్నాడు. "నేనిచ్చినదానికి పదిపంగు అదికంగా యిస్తివి. యింకా యేంజేస్తువు?" అన్నాడు. "నీవుచాలా మంచివాడివి. ఏదో పూర్వజన్మ కర్మ నిన్నీ వృత్తిలో దింపింది. ఇప్పుడు కష్టపడలేని వయసొచ్చింది నీకు. కనుక నీవింతటితోనైనా యీనీచ

వృత్తి మాని నాతోనే సదా ఉండి నీ కాలం వెళ్లతోసెయ్యి. నీకు కడుపునిండ అన్నం, వొంటినిండ బట్టయిచ్చి నెలకొక యాభై రూపాయలు జీతమిస్తుంటాను. దాంతో నీ కుటుంబ పోషణకూడ, అనాయాసంగా గడిచిపోతుంది" అని సుందరం చెప్పాడు. "నా కష్టమంతా నీకెందుకబ్బా నీవుదాసుకంగా వుండుమీ. వూళ్లో ధర్మాత్ములుండారు. నా యేజంట్లూ ఉండారు. నా బెంచీ వుండనే వుంది. యిట్టనేపోనీ నాదినాలు" అన్నాడు మునియాండి. కాదు కూడదని సుందరం అతనికి చాలా సేపు బోధించి తుదకతనిని వొప్పించుకొని. తనతో కూడ కారులోనే ఇంటికిపిలుచుకొని వెళ్ళాడు. వెంటనే అతనికి మంచి వుడుపులు కుట్టించి యిచ్చి, తనకొరకెవరైనా వస్తే, వారిని తను వచ్చే వరకు కూర్చోబెట్టి మర్యాదగా విచారించు కోవడం, అప్పుడప్పుడు వచ్చిన ఆర్డర్లకు పుస్తకాలు పార్సెలు చేయడం తప్ప వేరేపని అతని కివ్వలేదు.

కొద్ది రోజులు కాక మునుపే, సుందరాన్ని చూడ వచ్చిన పెద్దమనిషి నొకరిని, "ఇంట్లోశనా కష్టంగా వుండాది, రెండు రూపాయలిస్తే, సంబళ మొచ్చిందే వాపసిస్తాను" అంటూ యాచించాడు మునియాండి. ఆవచ్చిన పెద్ద మనిషి ఏదోపాపం దలచి రెండు రూపాయలు యిచ్చాడు. మరొకరోజు ఇంకొకరిని అలాగే యాచించాడు. ఆయన రెండు లేవని ఒక్క రూపాయ యిచ్చాడు. ఈ సంగతి సుందరానికి వెంటనే తెలిసింది. దాంతో అతని మనస్సుకు చాలా కష్టం తోచి, ఎప్పటికీ వాడింక తన నైచ్యాన్ని వదలలేడని తలచి, మునియాండిని కారెక్కించుకొని, సరాసరి పార్కు కడకు తెచ్చిదింపి "కనకపు

సింహాసనమున" అన్న పద్యాన్ని నీవు రుజువు చేశావు. నీకేం చేసినా ముష్టెత్తేగుణం మానలేకున్నావు. నీకు యీ చోశే అచ్చివొచ్చిందనుకుంటాను. కనుక నీ యిష్టానుసారం యిక్కడినే ఉండు" అన్నాడు "ఏం సార్? నే నానాడే చెప్తినే, మీరు దానామాట వినలేదు. నాకెందుకు సార్ నౌకరిచ్చి నన్నుపాడు సేస్తారు. ఇక్కడదానాకు సుకం" అన్నాడు మునియాండి. "అలాగే కానీ, అయితే నీకెప్పుడైన సాయం కావలసి నప్పుడు నేనొకణ్ణి యున్నానని నమ్ముకో" అని చెప్పాడు సుందరం. "శానా సంతోషం సార్ చేయండి" అన్నాడు. సుందరం కారెక్కి ఇంటికి వెళ్ళాడు.

---

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

పట్నం చేరి శ్రీధరరావుగారి కుటుంబంతో సుందరానికి పరిచిత మైనది మొదలు, ఈ కొద్ది మాసములలోనే, మొదట లలితకు సుందరంపై ఆరంభమైన గౌరవం తర్వాత వాత్సల్యమై తుదకు ప్రేమరూపం దాల్చింది, కాని లలిత దాన్ని ప్రేమ యని గుర్తించలేక పోయింది. రోజుకొకమారైనా వారిద్దరు ఒకరినొకరు చూడకుండ వుండలేని స్థితి యేర్పడింది. సుందరం వారింటికి వెళ్ళజాలక పోతే, లలిత కారువేసుకొని అతనింటికి వెళ్ళి కాసేపు మాట్లాడి వచ్చేది.

ఒకమాటు సుందరం లలితకు కనుపించి, నలభై యెనిమిది గంటలైంది. అందు వలన లలితకు అదేదో ఒక మోస్తరుగా వుంది. అతను కనుపించక పోతే యింత తహాతహా, ఆవేదన యెందుకో ఆ అమ్మాయికే అర్థం కావడం లేదు. ఆ మధ్యాహ్నమునుండి అతను కనుపడని బాధ మరీహెచ్చింది. సాయంకాలము కానుకాను. అతనారోజుకూడా రాకపోవడం చేత మరీ పిచ్చెత్తినట్లై, ఏమిటా యీబాధ అనికొంత తనలో తాను చర్చించుకో నారంభించింది. అప్పటికే సుందరం రాలేదాయని యింటిలోని వారినందరిని ఒక మాటు అడగడమైంది. "ఏదో పనుల మీద తిరుగుతూ వుంటాడు. బహుశా రేపు వస్తాడేమోలే" అని శ్రీధరరావుగారన్నారు. "మీసుందరరావును ఏ బూచి వాళ్లు పట్టుకెళ్ళరులేవే. మరీ అవదాగినట్టు, కనపడ్డ వాళ్ళనంతా విచారిస్తూన్నావు." అని గేలగా అన్నది రాధాదేవి. "అది కాదమ్మా! ఒకవేళ ఆయనకు వొళ్ళేమైన

సుస్తీగా వుందేమో...” అని ముగించే లోగా, రాధాదేవి “ఓహో! పాపం! అంత శ్రద్ధగా వుండేదానివి, వెళ్ళి విచారించు కోరాదు?” అన్నది. లలితకు ఆ సమయంలో కావలసినది అలాంటి సలహాయే గనుక. ఆ మాటలు తల్లి పెదిమలు దాటీ దాటకమునుపే “మరి డ్రైవరు వెళ్ళాడు. ఊ,సరే, నేనే డ్రైవ్ చేసుకొని వెళ్ళి వస్తాను” అంటూ షెడ్‌లోకి వెళ్ళి, బుఱ్ఱున కారు బయటికి తీసి, రివ్వున సుందరం బంగళావైపు రస్తాన బట్టింది.

అప్పటి కప్పుడే దీపాలు బెట్టేవేళైంది. ఏదోమరో నాటకం గాబోలు ఉదయం నుండి వ్రాస్తూ యుండిన సుందరం, అప్పుడే కాస్త చల్లగాలికి విశ్రాంతికి, తోటలోనికి వచ్చాడు. ఎదురుగా తెచ్చి ఆపి బండి దిగిందిలలిత. సుందరానికి దినమంతా నాటకంలోని సంభవాలలో లయించి పోయిన మనస్సు యింకా బాహ్య ప్రపంచంలోకి పూర్తిగా రాలేదేమో అన్నట్లు ఏదో పరధ్యానంలో నుండే వాడిలాగు లలితను యథాప్రకారం ఆహ్వానించలేదు. లలితకేమీ అర్థంకాలేదు. రెండు రోజులు కనుపించక పోవడం, పైగా వెతుక్కొని వస్తే యీలాంటి ఆహ్వానం జరగడం, యివన్నీ ఆ పిల్లమనసును కొంత కలవర పెట్టసాగాయి. కాని ఓర్పుతో “నేనీ సమయంలో రావడం మీ పనులకు భంగమేమో. అలాగైతే రేపో, మర్నాడో, లేక మీరు రమ్మనే రోజో వస్తాను లెండి” అంటూమళ్ళీ కారెక్కబోగా సుందరం తటాలున మేలుకున్న వానిలాగు, చెంగున ఒక గంతు వేసి ఆ అమ్మాయి రెక్క పట్టుకొని “ఏమిటా నిష్ఠూరం అబ్బ! యిప్పటికి కొంత విశ్రాంతి గలిగింది గదా, అందుకు

తోడు నీవు వచ్చావు, ఏదో కొంతసేపైనా హాయిగా నీతో కాలం గడుపుదామని, అనుకుంటూయుంటే, ఇంతలోనే భీష్మించుకొని వెళ్ళుతానంటావే? నా సుశీలకున్నంత కోపం నీకు ఉండేటట్లుందే" అంటూ ఆవిడను తోటలోకి నడిపించు కొని, వెళ్ళుతున్నాడు. "మీ సుశీలెవరండోయి? ఓ, అయాం సారీ, మీ ప్రైవేటు విషయాలలో, నేను ప్రవేశించరాదు. మన్నించండి" అని బయటికెంత చిరునవ్వు కక్కినా, మనసులోని బాధ తెలుపుతు అన్నది. దాంతో సుందరానికి మనసు సంకటపడ నారంభించింది.

"చూడు లలితా! నన్ను నీవు తప్పుదలచినట్టుంది. నేను మరోనాటకం ప్రారంభించి వ్రాస్తూ, రెండుమూడు రోజులుగా ఆపనిలో నిమగ్నమైపోయి, నిన్ను చూచేందుకుకూడ రాజాలక పోయినాను. ఇంత మాత్రానికే కోప మెందుకు" అంటూ లలితనొక చలువరాతి బల్లపైన కూర్చుండజేసి, తాను ప్రక్కన కూర్చున్నాడు. కాని, లలితమౌనంగానే యుండినది. సుందరానికా మౌనం చాలాబాధ కలిగిస్తూఉంది. మరల సుందరం ఆమె ముఖాన్ని తనవైపు త్రిప్పుకొని, "ఇదంతా కోపమేనా? అయినా నీలాంటి అందగత్తెకు యీ కోపంగూడ అలంకారంగానే ఉంది. కాని, నాతో పలుకవా?" అన్నాడు. అప్పటికీ పలుకక, ముఖ మావలివైపుకు తిప్పుకున్నది. అంతట సుందరం నిష్టూరంగా "ఈ భాగ్యానికి యింత దూరం రానేల, నామనసు కలవర పరచనేల, బ్రతిమాలిన కొద్ది భీష్మించుకోనేల? చెప్పు" అన్నాడు. "అదేనండీ! నేను తీవ్రంగా యోచిస్తున్నాను. నా పిచ్చికాకుంటే, మీకిష్టం లేకున్నా నేనుగా వెదుకుకొని మీ

కడకు రానేల, మీ సుశీలకు, మీకు మధ్య వచ్చానని మీమన స్సుకు కలవరం కలిగించనేల, ఇదంతానా...." అంటూండగా తటాలున తనచేతితో ఆమె నోరుమూసి "లలితా చాలు నీనిష్టూ రాలు. నన్ను అపార్థం చేసుకున్నావు. పిచ్చిదాన! "నా సుశీల", నా క్రొత్తనాటకంలోని నాయకీ పాత్ర. ఏదో పర ధ్యానంలో అన్న మాటను ఇంతదూరం సాగదీశావే నీవు! పరవాలేదు; నేనువ్రాసే నాటకాలకు వ్యాఖ్యాతగా నిన్ను నియమించుకో వచ్చు ఛేవ్" అన్నాడు సుందరం.

దాంతో లలిత తనుచేసింది తప్పనీ, అకారణంగా అతనిని బాధపెట్టినానని గ్రహించి సిగ్గుతో అతని ముఖమును, నేరుగ చూడజాలక, "నన్ను క్షమిస్తారూ, నేను మళ్ళీ రేపు వస్తాను" అంటూ లేచింది, "ఊహూ! ఇదెంత మాత్రం వీలు పడదు ఒకర్ని వృధాగామనసు కలవరపెట్టి, ఏవేవో తియ్యని యోచన లను వానిమనసులో చెలరేగించి, అందులో యీ పండు వెన్నె లలో, యీ చలువరాతి తిన్నెపైన, యీ కమ్మని వాసనలతో నిండిన పూలచెట్లమధ్య" 'నన్ను క్షమిస్తారు మళ్లీ రేపొస్తాను' అంటూ నీలాంటి సుందరి వెళ్లుతూ వుంటే, సరేనని అనడానికి నావల్ల సాధ్యమా", అంటూ ఆమెదోవకడ్డు తగిలాడు. లలితకు ఆ మాటలలోని భావము స్ఫురించి, సిగ్గుతో ఒక పూలమొక్క కడకేగి పరధ్యానంలో దాని చిగురుటాకులను తన లేతవేళ్ళతో గిల్లుతూ, ఏమేమో ఆనందమైన కలలు కంటూవుంది. సుంద రం ఆమెను ప్రేమించుచుండినా, తన్ను ఆమె ప్రేమించు చున్నదో, లేక యింతకాలమూ, ఆమె నడవడికను బట్టి స్నేహ మాత్రమేనో; యీ యింగ్లీషు చదివిన పిల్లలకడ తొందర పడ

గూడదనే అభిప్రాయంతో, ఏదీ తేల్చుకోలేక పోయ్యాడు. నేటికి ఆమె మనసు అతనికి పూర్తిగా అర్థమైంది. కాని, "ఎలా ప్రస్తావించనూ ? ఎలా ప్రారంభించనూ?" అని ఏమీ తోచక యోచనలో బడ్డాడు. "లలితా" అంటాడు. "ఏమి!" అని ఆమె అంటే, మళ్లీ పైమాటరాదు. శరీరం యెందుకో కంపించనారంభించింది. ఒకటి చేయబోయి, మరొకటి చేస్తాడు; ఒకటి అనబోయి, మరొకటంటాడు. తనస్థితి తనకే అర్థం కావడంలేదు. లలిత స్థితి అలాగే వుంది. ఒక్కొక్కమారిద్దరి చూపులు కలుస్తాయి. ఆ చూపులు యేమేమో వెళ్ళబోసుకుంటున్నట్లుంటాయి. తటాలున ముసి ముసి నవ్వులు నవ్వుకుని, ఉభయులు ముఖములను, సిగ్గుతో కాబోలు, అటువైపు త్రిప్పుకొనేవారు. ఎంత కాలం యీ విధంగా గడిచిందో వారికే తెలియదు. ఇంతలో యింటిలోని గడియారం తొమ్మిది కొట్టింది. దాంతో యిద్దరికి స్మృతి గలిగింది. "అబ్బ! తొమ్మిదైంది. నాన్నా వాళ్ళు నాకై భోజనానికి కాచుకొని యుంటారు" అన్నది లలిత. "ఔను, పోదువుగాని, యింతకాలంగ నీకై కాచుకొనియుండే నన్ను విడిచి వెళ్ళడం, నీకుమాత్రం సమ్మతంగా వుంది ? లలితా! పలకవూ?" అంటూ ఆమెముఖాన్ని, తనవైపు త్రిప్పుకున్నాడు. "నేను మాత్రం సంతోషంతో వెళ్లుతున్నానా ?" అన్నది. "మరి మనబాధకంతము లేదా" అన్నాడు. "మీరు మానాన్నగారితో ఒక్క మాటంటే" అన్నది.

"అదేలా అనడమో తెలియకుంది. మనలో పిల్ల తండ్రి ప్రస్తావించడం సహజం కాని, నీవు ఇంగ్లీషు చదివినదానివి గనుక, నేను ఇంగ్లీషు వారి పద్ధతి నవలంబించవలె కాబోలు" అంటూ

నవ్వాడు, "అంత దూరం రాదనుకుంటాను లేండి" అంటూ, అతని చేతిలోనుంచి తన చేతిని విడిపించుకొని, ఒక్క పరుగున వెళ్లి కారెక్కి స్టార్టు చేసి, హృదయంలోనించి పెళ్లగించ నసాధ్యమైన బాణంలాంటి చూపు నొకదాన్ని అతని వైపున విసరి, కారును రివ్వున నడిపించుకొని వెళ్లింది. ఆ సాయం కాలపు దృశ్యాన్నంతా, పలుమారు స్మరించుకుంటూ, తనలో తాను మురిసిపోతూ లోనికి వెళ్లాడు సుందరం.

అ చిన్నవాడి ప్రేమ విశ్వాసాలను, శ్రీధర రావుగారు, రాధాదేవిగారు, గుర్తించలేక పోలేదు. సుందరానికెవరూ లేకపోయినా, కులగోత్రాలు, రూపురేఖలు, విద్యాబుద్ధులు, అన్నికలవాడు గనుక, ఆ దంపతులు తమబిడ్డను అతనికిచ్చి వివాహం చేసే ఆలోచనలో పడ్డారు. "అతనికెవ్వరు లేరని అను కోడమెందుకు, మనంలేమూ? మనడబ్బంతా తుదకు వాళ్లకేగా! పైగా అతనూ డబ్బు సంపాదిస్తూనే యున్నాడు" అన్నాడు శ్రీధరరావుగారు. రాధాదేవికూడా సమ్మతించి "ఎందు కైన మంచిది. అమ్మాయితో ఒక మాటంటాను" అని ఆ మరునాడే, లలితతో ప్రస్తావించింది. లలిత సిగ్గుతో ముసి ముసి నవ్వుతో "మీ యిష్టమమ్మ" అంటూ తనపూర్తి అంగీకారాన్ని సూచించింది. ఆ రోజే శ్రీధరరావుగారు సుందరంతో ప్రస్తావించారు. రొట్టె విరిగి నేతిలోబడ్డట్లైంది అతనికి. ఒక రోజు పదిమందిని పిలచి నిశ్చితార్థమంటూ ఒకలాంఛనం నడి పించారు శ్రీధరరావుగారు. స్నేహితులంతా చాలా సం తోష పడ్డారాదాంపత్యానికి. ఆనాడు జ్ఞానాంబగారు కూడ వచ్చి టెంకాయ తాంబూలం తీసుకొని, లలితను ఆశీర్వదించి వెళ్లింది.

# ముప్పదియవ ప్రకరణము

కన్నయ్య నాయుడు "నర్తకి" ని ఆరు మాసములు ప్రదర్శించి, "అనాధ" ప్రదర్శనమారంభించాడు. అతనికి సుందర రావు రచనలతో అదృష్టం పట్టింది. రోజు రోజుకూ అదృష్టం అతిశయిస్తూ ఉంది. మళ్లీ సుందరం తన నాటక పుస్తకాలను హాలువద్ద అమ్మిస్తూ, రోజుకొక వంద రూపాయలకు తక్కువలేకుండా సంపాదిస్తున్నాడు. ఎక్కడ చూచినా "మధుకరుని" ఖ్యాతి ప్రబలి పోయింది. అతని అదృష్టం ఉచ్ఛ స్థితినందుకుంటూ ఉంది. మహత్తరమైన తన జీవితలక్ష్యాన్ని చూడగలుగుతున్నానని, ఎంతో సంతోషం పడ్డాడు సుందరం. కాని, యీ భోగభాగ్యములు భగవంతుడు తనకు కలుగజేసిన పిమ్మట, తన తండ్రి, బామ్మ, వగైరాల విషయం యోచించకపోతే లోకమేనాటికి తన్నొక మనిషిగానే భావించదని తోచింది. వెంటనే శ్రీధరరావుగారితో "కొంచెం గ్రామాంతరం వెళ్లి, ఒక వారం రోజులలో తిరిగి వస్తా" నని చెప్పి కారులోనే ప్రయాణమై, తిన్నగ గుంటూరు వెళ్లాడు. ఊళ్లోకి వెళ్లి ఒక హోటలు కడ కారునాపుతుండగ, అక్కడికే ఒకరిక్షా వచ్చి ఆగింది. అందులోని మనిషి దిగి, అద్దె బండివాడికిచ్చి, హోటల్లోకి వెళ్లాడు. ఆ రిక్షావాడు, ఖాళీ రిక్షాను మెల్లిగా త్రిప్పుకొని, కారు ప్రక్కకొచ్చేసరికి వాణ్ణి సుందరం గుర్తించి, " అప్పన్నా " అన్నాడు. వాడు తిరిగి సుందరాన్ని చూచి, బ్రహ్మానందంతో, తనబండిని ప్రక్కన నిలిపి వచ్చి, "సుందరయ్యబాబూ! ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు, చూశాను నాయనా! ఎక్కడున్నావు. ఎలా వున్నావు:

అంతా చెప్పు తండ్రీ!" అంటూ సుందరాన్ని చెక్కిళ్ల నొక్క మారు తడివాడు ప్రీతితో, సుందరానికి ఆనంద బాష్పాలు రెండు రాలాయి. నేను "సుఖంగానే ఉన్నాను అప్పన్నా! ఇవ్వాళ్లకు నేనూ ఒక మనిషి నయ్యాను. చెన్నపట్నంలో ఒక యిల్లు కూడ కొన్నాను. ఏదో దేవుడు, మంచి వడుంబడే చూపాడు. అదంతా ఉండనీ గాని, మా నాన్న, బామ్మ వాళ్ళంతా, కులాసగా ఉన్నారా?" అన్నాడు సుందరం. "ఏం జెప్పను బాబూ! నీవు యిల్లు వదలి పోయిన కొన్నాళ్ళకే, పద్మావతెమ్మ గారి భర్త కాలమైనాడు. ఆమె కాకినాడ కెళ్లింది. మళ్లీ ఆ పాపిష్టి మార్వాడి యింటిమీదికి జప్తి తెచ్చి, యింటికి సీలేశాడు. ఆ రాత్రే నాన్నగారు, బామ్మగారు, ఎవ్వరికీ చెప్పకుండా ఊరిడిసి యెల్లారు. వారి పోబడే మొన్నటోరకు నాకు దెలవలా" అన్నాడు అప్పన్న. "అయితే ఇప్పుడేం దెలిసిందేం?" అని అడిగాడు సుందరం. "నెల దినాల కింద, మా సుట్టు మొకడు, మార్కాపురాన్నుంచి వచ్చాడు. వాడన్నాడూ "ఒరే అప్పన్నా! నీవు నౌకరి చేస్తున్న యింటి పంతులంటరా, ఆయన పేరు కూడ జోగారావంట, మాఊళ్ళో కోర్టుకాడ, టాంపులు, పత్రాలు రాసి పెట్టి, సంపాదించు కుంటా ఉన్నాడురా. ఆయన కొక తల్లిగారు గూడ ఉన్నారు. ఆమైతే యీ మధ్య కొంచెం కాయిలా పడింది" అని నాతో చెప్పినాడు బాబూ! నేనెల్లి సూద్దా మనుకుంటూనే ఉన్నాను. కాని, ఏదీ సంపాద్దెం కూటికే సాలీ సాలకుండటంతో రైలుకు శార్జియాడ దేనా అని ఊరుకున్నాను బాబూ. సెప్పొద్దు" అని అన్నాడు అప్పన్న. సుందరానికీ సంగతంతా విని, చాలా సంకట పడి ఒక్కక్షణం మాలోచించి "అప్పన్నా! నీకింక రిజాలాగడం అనవ

సరం నా వెంట వచ్చేయి" అన్నాడు "అంతకంటేనా బాబూ! యిప్పుడే రమ్మంటే వస్తా" నని సంతోషంతో పలికాడు అప్పన్న. "సరే నేను కాఫీత్రాగి వచ్చేలోపల, నీవా రిక్షాను స్వంతదారుడికి వొప్పగించి, నీగుడ్డ గోచి తీసుకొనిరా" అని వాణ్ణిపంపి తాను హోటల్లో కెళ్లి, రెండు యిడ్లీలు, ఒక పెసరట్టు, కాఫీ పుచ్చుకొని. బయటి కొచ్చేసరికి, అప్పన్న కూడ తయారై నిలబడి ఉన్నాడు. వాణ్ణి ఏదైన తినమని డబ్బిచ్చి, తాను ప్రక్క నే ఉన్న బంకులో, కారు ట్యాంకునిండ పెట్రోలు నింపుకొని, అప్పన్న రావడం తోటే, వాణ్ణి యెక్కించుకొని, మార్కాపురం రస్తాబట్టాడు. దాన్ని గమనించిన అప్పన్న "మార్కాపురానికా బాబూ!" అని అడిగాడు. "ఔన"న్నాడు సుందరం. "మరైతే, నాన్నగార్ని. ఆమ్మగార్ని, పిలుచ కెల్తావా బాబూ?" అన్నాడు అప్పన్న. "ఔను. అది సరేగాని, మా అత్తయ్యాయే లాగుందో, నీకేమైనా తెలుసా" అని అడిగాడు. "అన్నట్టు సెప్పేందుకు మరిశాను బాబూ! ఆమెగారిని బర్త పోవడంతోనే' అత్తగారుఇంట్లోనుంచి తరిమేసిందంట, ఆమెగా రేడ్సుకుంటూ, గుంటూరొచ్చి. మన యింటికి సీలేసుంటే, తిరపతయ్యని సూసిందంట. ఆయనగారు కొంచెం రూపాయలిచ్చి పంపాడని, ఆమెగారు యాడకి బోయింది తెలవలేదని, తిరపతయ్యో ఒకరోజు నాతో అన్నాడు బాబూ! యిప్పుడామెగారు యాడుండదో, లలితమ్మ యేమైందో, మా కెవ్వరికి తెలవదుబాబూ!" అన్నాడు అప్పన్న దుఃఖంతో.

ఈ సంగతంతా వింటూంటే, కళ్ళు నీళ్ళతో నిండాయి సుందరానికి. "అయ్యో పాపం. వాళ్ళ సంగతి ముందు విచా

రించాలనుకున్నా" అంటూ ఏమో యోచించుకుంటూనే కారు నడుపుతున్నాడు సుందరం. ఆ రోజు పదకొండు గంటలకు మార్కాపురం మునసబు కోర్టు దగ్గరకు వచ్చి కారాగింది. అప్పుడప్పుడె కోర్టుకు వచ్చే గుమాస్తాలు, కొంతమంది కక్షిదారులు వస్తూ రాలు వస్తున్నారు.

# ముప్పదియొకటవ ప్రకరణము

మార్కాపురంలో తాము అద్దెకున్న యింట్లో వెంకాయమ్మగారు పదిగంటలకే వంట చేసిపెట్టి, వాకిట పంచలో ఏవో కాగితాలు కట్ట కడుతున్న జోగారావును చూచి, "అబ్బాయీ జోగిబాబూ! మన సుందరం పోకడ యేమీ తెలియటం లేదురా? ఎక్కడున్నాడో! ఏమై పోయినాడో? ఇటీవల వాడు రోజూ నాకు కలలో పొడగడుతున్నాడు. గుంటూరులో మన నౌకరు అప్పన్నకైన తెలిసుంటుందేమో. ఒక కార్డు వ్రాసి కనుక్కోరా. సుందరమంటే వాడికి మరీ ప్రాణం. ఎక్కడైన వాకబుచేసి వ్రాస్తాడు" అన్నది.

"అమ్మా? వాడికి మాత్రం ఏం తెలుస్తుంది? పోనీ నీ దుగ్ధ తీరేటట్టుగా యీ రోజే, ఒక కార్డు వ్రాస్తానులే. యీరోజు కొంత యెక్కువగా పని ఉన్నది. త్వరగా అన్నం బెట్టమ్మా" అని జోగారావు వెంటనే స్నానంచేసి, భోజనం చేసుకొని, బట్టలు వేసుకొని, కాగితముల కట్ట చంకలోనుంచుకొని కోర్టుకు వచ్చి, వేపచెట్టుక్రింద అరుగుమీద కూర్చొని వ్రాసుకుంటు ఉన్నాడు.

ఇంతలో, అప్పన్న సుందరాన్ని పిలచి, "సుందరం బాబూ! అడుగో నాన్నగారు. ఆ యాపచెట్టుక్రింద అరుగుమీద కూచొని ఏమో రాస్తుండారు. రండి పోదాం" అని యిద్దరూ కలసి అచ్చటికి బయలుదేరారు. జోగారావు వ్రాసుకుంటూ మనుష్యుల కాలి శబ్దం విని, వ్రాతను ఆపి, తల

యెత్తి వారివైపు చూచి, తన కళ్ళను నమ్మజాలని వానిలాగు, మళ్ళీ బాగాచూచి, తటాలున చేతిలోని స్టాంపును, కలాన్ని క్రిందవేసి, లేచి వచ్చి "సుందరం" అంటూ కౌగిలించుకొని పసిబిడ్డవలె ఏడువసాగాడు. సుందరానికి దుఃఖమొచ్చింది కాని, సర్దుకొని, తండ్రి నాశ్వాసపరచి క్షేమ సమాచారా లడిగి "ముందు బామ్మని చూడాలి యింటికి వస్తారా" అని అడిగాడు. వెంటనే జోగారావు తన కాగితాలు వగైరాలను పెట్టెలో బెట్టి బీగం వేసి, ఆ పెట్టె అప్పన్న తీసుకొనిరాగా, ముగ్గురూ కారెక్కి అక్కడి కొక మైలు దూరములో యున్న ఒక పూరి యింటికి వెళ్ళారు.

లోనికి సుందరాన్ని చెయ్యిబట్టి పిలుచుకొని వెళ్ళి "అమ్మా! ఎవరో వచ్చారు చూడూ!" అన్నాడు జోగారావు. అప్పుడే భోజనం చేసి సుద్దిపెట్టి చేతులు కడుక్కుంటూ ఉన్న వెంకాయమ్మ పరామర్శించి చూచి "నాయనా సుందరం, ఎన్నాళ్ళ కొచ్చావురా, అంటూ చేతిలోని చెంబక్కడ పడేసి వచ్చి వాణ్ణి గట్టిగ పట్టుకొని, ఏడవట మారంభించింది. అందరూ ఆమెను సమాధానపరిచేసరి కొక పావుగంట పట్టింది. తమ కష్టాలను కొడుకుతో చెప్పుకున్నాడు. కొడుకు జీవితాన్ని గురించి విని ఆనందపడ్డాడు. యీడ్చుకుంటూనే అన్ని పెసర బేడలు నానవేసి, పచ్చడి నూరి, కాసిని బియ్యం అత్తెసరుబెట్టి దించింది వెంకాయమ్మ. సుందరం స్నానం చేసి వచ్చాడు. వాడికి వడ్డించి, పంచలో విస్తరివేసి, అప్పన్నకు అన్నం బెట్టింది. ఇద్దరూ భోజనం చేసి లేచారు. బామ్మ కొడుకు, మనుమడు చాపమీదికి చేరారు. ముందాలోచన సుందరం

చెప్పాడు. వెంకాయమ్మ, జోగారావు, చాలా సంతోషించారు. "ఇక మాకిక్కడ ఏంపని నాయనా! పద వెళ్ళుదామన్నది" వెంకాయమ్మ. ఇంతలో పద్మావతి విషయం వారికేమైన తెలుసునేమోనని అడిగాడు సుందరం.

సుబ్బరాజు పోయిన కొత్తల్లో, తను మార్కాపురంనుంచే రెండుత్తరాలు వ్రాసినా జవాబు లేదని, రెండేళ్ల క్రితం, కాకినాడ శాస్త్రి ఒకాయన తటస్థించి, సుబ్బరాజు కర్మాంతరాలు ముగియగానే, రామలక్ష్మమ్మ కోడలిని, నగలన్నీ తీసుకొని మరిరా అని, యింట్లోనుంచి వెళ్లగొట్టిందని చెప్పి, అంతకు పైన పద్మవిషయం తనకేమి తెలియదని చెప్పాడు జోగారావు. ఆమె గుంటూరొచ్చి వెళ్ళిన సంగతి వారి కప్పన్న చెప్పాడు. అందరూ ఆతల్లీ బిడ్డలకై చాలాసేపు దుఃఖించారు. "నిదానంగా వాళ్ళపోబడి తీస్తాను" అని సుందరం వారికి ధైర్యం చెప్పి, ఆ మరుసటి ఉదయమే అందరిని వెంటబెట్టుకొని పట్నానికి ప్రయాణమైనాడు.

———

# ముప్పది రెండవ ప్రకరణము

పట్నం చేరె సుందరంయొక్క సంపాద్యమును చూచి, వారందరు చాలా ఆనందపడ్డారు. వెంకాయమ్మ క్లేశము లేకుండా కూచోబెట్టి సకలం అమర్చేందుకు నౌకర్లున్నారు. జోగారావును తన కుమారుని పుస్తకాల వ్యాపారానికి, మేనే జరుగ ఉండి, నిర్వహించ వలసినట్లు యేర్పాటైంది. మద్రాసు చేరిన మరునాడే, సుందరం శ్రీధరరావుగారిని, వారిభార్య రాధాదేవిని, బిడ్డనుకూడా, తనబంగళాకాహ్వానించి తన తండ్రిని, బామ్మను వారికిపరిచయంచేసి, తానుగుంటూరు లోనుండిన భోగరాజుభుజంగరావుగారి పౌత్రుడనని, అప్పుడు వారికి తెలిపాడు శ్రీధరరావుగారికి చాలా ఆశ్చర్యం, ఆనందం కూడా కలిగింది. ఆయన ముందే వినియుండినాడు భుజంగ రావుగారిది అనాది సంపన్న కుటుంబాలలో నొకటని. వారిది చాలా మంచి సాంప్రదాయమని ఇంతకాలము సుందరం ఆ విషయం చెప్పని దానికి ఆయన కాస్త నిష్టూరాలాడినా, తుదకు గొప్ప సంప్రదాయపు కుటుంబంతోనే సంబంధం చేస్తున్నాను గదా యని సంతోషపడ్డాడు. రాధాదేవి సౌమ్య తకు, లలిత రూపలావణ్య గుణాతిశయాలకు, వెంకాయమ్మ, జోగారావు, చాలా తృప్తిజెంది ఆ పిల్ల తనయింటి కోడలవు తుందని తెలిసి, మరీ సంతోషపడ్డారు. అప్పన్న యీ సంతోష విషయాలన్నీ వింటూ పట్టలేని ఆనందంతో మళ్ళీ యౌవన మొచ్చినవానిలాగు, ఇంటి పనులన్నీ బహుచురుగ్గా చేస్తూ వాడు. లలితను చూచినదాదిగ, తన మనుమరాలుకూడ,

అదే పేరు గలది. యీపాటికింతదై వుంటుందిగదా? ఆ పల్లె బిడ్డ యెక్కడున్నారో, యేమోనని, కొంత తన మనసులోనే వ్యధపడింది వెంకాయమ్మ.

ఇంతలో పెద్దపండుగ వచ్చింది. అందరికి, క్రొత్తబట్టలు, కొనిపెట్టాడు సుందరం. కాబోయ్యే వియ్యాలవారి కుటుంబాలు ఒక్కొక్కపూట ఒక్కొక్కరింట్లో విందులు భోంచేశారు. లలితకు మార్చినెలలో, యఫ్. ఏ పరీక్షలు ముగిసిన తోడనే, వైశాఖమాసంలో వివాహ మహూర్తం చూదామని అనుకున్నారు కూడాను.

# ముప్పదిమూడవ ప్రకరణము

ఇంతలో కారాగారవాసం సంపూర్తై, పద్మ ఒకరోజు ఉదయం మద్రాసుచేరి స్టేషన్‌నుంచి తిన్నగా రంగనాయకులు నాయుడుగారి షాపుకడకు వచ్చింది. అప్పుడే అంగడి తెరచి, మేజాలు, కుర్చీలు మీద దుమ్ము విదిలిస్తుండిన నౌకరు పద్మను చూచి ఎవరో ముష్టిదని భావించి తెల్లవారింది మీకు ? పీడ మూకదాపరించిం దెక్కడిదో వెళ్లు" అని గదిరించాడు. ఆమె యేమో చెప్పబోతే వినిపించుకోనక అతను, "చాలుపో, మీ వేషాలంతా నాకు తెలుసు. ఊ ! కదులు, ఇంకా నిలుచున్నా వేం ? నీకు కాదూ చెప్పడం" అంటూ మరొకక్షణముంటే, తన్నితరిమేసేలాగా ఆమెపై కొచ్చాడు. పద్మ భయపడి రోడ్డు దాటి యెదటిశ్రేణిలోని ఒక అంగడిముందు నిలచి, నాయుడు గారి రాకకై వేచివుండినది.

నాయుడుగారి షాపు, బీర్వాలలో మునుపటి లాగు సరుకేమి కనుపించలేదు. అంగడేమో కళ తప్పినట్లు అగపడు చున్న దామె కంటికి. కొంతసేపటికి రంగనాయకులు నాయుడు గొడుగు చంకబెట్టుకొని, కాళ్ళీడ్చుకుంటూ రావడం చూచింది. అతనంగడిలోనికి వెళ్లుతున్నట్లే, ఆమెకూడ, త్వరగా అంగటి వాకిట చేరుకొని, "నాయుడుగారూ" అన్నది. ఆయనతో కూడ లోనికేగుచుండిన నౌకరు తిరిగిచూచి, కళ్లెఱ్ఱజేసి "ఇప్పు డేగా చెప్పాను. మళ్ళీవచ్చావు పాపిష్టిదానా," అని కసిరాడు. నాయుడు తిరిగి ఒక్కక్షణం నిదానించి చూచి సంతోషంతో,

"పద్మావతమ్మకదూ !" అంటూ దగ్గరకు వెళ్ళాడు. ఆమె ఆనందంతో, కంఠముపరుద్ధమై, ఔనన్నట్లు తలాడించింది. నాయుడుగారు ఆమెను చేయిపట్టుకొని లోపలికి పిలుచుకొని పోతూ, "ఎప్పుడొచ్చావమ్మా! రా! కూచో! గుర్తేచిక్కకుండా మారిపోయ్యావే ! ఒరే ! గోపాలూ ! ఎదటి హోటల్లోకి పోయి, ఫలహారము, కాఫీ, తీసుకొని రమ్మని, ఆ అయ్యరుతో చెప్పరా" అన్నాడు. గోపాలుకు యిప్పటికే, తనుచేసిన పొరబాటు మనసుకొచ్చి, సిగ్గుపడుతూ, హోటల్కు వెళ్ళాడు.

తన మంచి నడవడికకు, రెండేళ్లు శిక్ష తగ్గించి, ఆముందు రోజే విడుదల చేశారని, నేరుగా వేలూరునుంచి ఆ ఉదయమే వచ్చానని, మిగత తనజైలు అనుభవాలను కొన్నింటిని ఆమె జెప్పింది. ఇంతలో ఫలహారము వచ్చింది. ఆమె తిని చేతులు కడుక్కొని "నాయుడుగారు ! ఈ ఫలహారా లెన్నైనా నా కడుపు చల్లారదండీ !" అన్నది. "అదేమితల్లీ ! ఇంకేమైనా తెమ్మందువా ! ఏమికావలెనో చెప్పు, సంకోచపడవద్దు" అన్నాడు నాయుడు. "నాకు మీ కడ సంకోచమెందుకూ ? మీరన్నమాట దక్కించుకొని, నా తల్లి లలితను నాకు చూపితే నా కడుపు నిండుతుంది," అన్నదామె. నాయుడు కొంచె మాలోచించ సాగాడు. "ఏమండి సందేహపడుతూ అలా ఆలోచిస్తున్నారేం ? నాబిడ్డ సుఖంగా ఉందిగదా ?" అన్నది ఆత్రంతో ఆమె. "నీ బిడ్డ చాలా సుఖంగా ఉన్నదమ్మా. పది రోజులనాడుకూడ నేను అటువైపు పోయియుంటిని. ఆ బిడ్డను దూరంగకనపడే చూచి సంతోషపడి వచ్చాను" అని అన్నాడు. "మరి నన్నొకమాటు పిలుచుకెళ్ళరూ ?" అని దీనతతో అడి

గింది. "పద్మావతమ్మా! నీబిడ్డ మహదైశ్వర్యంలో ఉంది. యఫ్. ఏ. పరీక్షకు కట్టింది. అద్భుతంగా భరతనాట్యం చేస్తుంది. వీణ అద్భుతంగా వాయిస్తుంది. చక్కని మొగుణ్ణి కట్టుకో బోతూంది. యీ సంగతి మొన్ననే జ్ఞానాంబగారు కనపడి చెప్పారు" అన్నాడు. "ఎప్పుడు వెళదాం చెప్పండి?" అని పసిబిడ్డలాగా ఉవ్విళ్లూరుతూ అడిగింది పద్మ. "వెళ్ళుదాం. కాని, నాకు నీవాబిడ్డనుచూచిన వెంటనే పట్టలేక లలితా అంటూ, అరుచుకుంటూ ఆ అమ్మాయి కడకు పరుగెత్తుతావేమో నని భయంగా ఉందమ్మా!" అన్నాడు. నాయుడుగారూ! నా ప్రమాణాన్ని నేను మరువలేదు. మరువనుకూడ. నాబిడ్డ అంతటి ఆనందంలో యుంటే, నేను దాన్ని భంగపరచే కార్యం చేస్తానా? అంతమూఢురాలను కానులెండి. ఈ పదేళ్ళ అనుభవం నన్ను చాలా గట్టిపరచింది. నా మాటనమ్మండి" అని ఆయన చేతులు పట్టుకొని అడిగింది. "సరే సాయంకాలము పోదాంలే అమ్మా" అన్నాడు. సాయంకాల మెప్పుడౌతుందా అని ఆమె మాటిమాటికి గంటచూచుకుంటూ, తనబిడ్డవిషయమై పలు మారు నాయుడుగారిని ప్రశ్నిస్తూ కాలం గడిపింది.

ఆరోజు సాయంకాలము అయిదు గంటలకే, నాయుడు అంగడివిడచి పద్మావతమ్మను పిలుచుకొని మాంబళంలో శ్రీధరరావు బంగళాకడకొచ్చి, అప్పుడే తనస్నేహితులతో, బాడ్మింటన్ ఆడుతూ ఉండిన, లలితను చూపాడు ఆమెకు. పద్మ ఆనందమింతని చెప్పడాని కలవికాదు. చేరెడుకళ్లు చేసు కొని, ఆ బిడ్డను దూరం నుంచేచూచి, ఆనందంతో కన్నీరు కారుస్తూ నిలుచుంది. నాయుడుగారు కొంతసేపు తాళి "ఎలా

ఉందమ్మా" అని అడిగాడు. "అడుగుతారా! సాక్షాత్తు మహాలక్ష్మిలాగుంది నా తల్లి. నా దృష్టే తగులుతుందేమోనని భయమౌతుంది కూడాను" అన్నది. "ఇక వెళ్ళుదాం పదమ్మా ఎవరైనా చూస్తే, ఏమైన సందేహాల కాస్పదమౌతుంది" అన్నాడు నాయుడు. పద్మ కచటినుండి కదిలేందుకిష్టంకాలేదు. లలితను, చూడను చూడను, రివ్వునపోయి దాన్ని కౌగలించుకొని ముద్దులవర్షం కురిపించి తనివితీర్చుకోవలె ననిపిస్తుంది. కాని, తన ప్రమాణం అడ్డొస్తూంది.

ఇంతలో ఆ పిల్లల ఆటముగిసి, వారివారిళ్ళకు బయలుదేరారు. లలితకూడ గంతులు వేసుకుంటూ, ఆనందంతో బంగళాలోకి వెళ్ళింది. ఇక ఉండి ప్రయోజనం లేదని పద్మ నాయుడు వెంట ఆయన యింటికి వెళ్ళింది. "నీకొక్కదానికి మళ్ళీ వేరే యిల్లెందుకమ్మా! ఇక్కడనే ఒకగది నీదనుకొని ఉండిపో" అన్నది ఆండాళమ్మ. ఆలాగే ఒకగదిలో వండుకొని తింటూ, నాయుడుగారి అంగట్లో మళ్ళీపని ప్రారంభించింది. నాయుడుగారితో సమయం చిక్కినప్పుడల్లా లలిత మాటలే పద్మకు. ఒకమాటు లలితకు కాబోయ్యే భర్తను గురించి, తనకు తెలిసినంతవరకు చెప్పాడు. అతన్ని చక్కగవర్ణించి చెప్పాడు. పేరు "మధుకర్" అంటారని కూడ చెప్పాడు. ఇవన్నీ వింటూంటే, ఒకవైపు అపరిమిత ఆనందము, మరోవైపు దుఃఖముకూడ వచ్చి కన్నీరు కారిపోతుండేది పద్మకు. నాయుడుగారి అనుమతిమీద రోజు సాయంకాలము వెళ్ళి రోడ్డుమీద నిలచి, లలితను కళ్ళార చూచుకొని, పోతూఉండేది.

———— ————

# ముప్పదినాలుగవ ప్రకరణము

ఒకరోజు ఆమెకేమి తోచిందో గాని, శ్రీధరరావుగారి బంగళా గేటుప్రక్కన ప్రహారీగోడకడ చేరి బిడ్డను చూస్తూ నిలుచుంది పద్మ. ఆ పిల్లలు ఆటముగించుకొని, స్నేహితులను సాగనంపుతూ లలితకూడ గేటువరకు వచ్చింది. పద్మకు, సమీపించిన కూతురిని చూస్తుంటే, వళ్లు ఆనందంతో కంపించిపోతూంది. లలిత స్నేహితులనంపి, యిటుతిరిగే సరికి, కన్నీళ్లు కారుస్తూన్న పద్మావతి కనుపించింది. ఇంట్లోకి వెళ్ళదలచుకున్న లలితకేమి తోచిందో, ఆగి పద్మను చూచి "ఎవరమ్మా నీవు, ఎందు కేడుస్తున్నావు" అని బహుజాలితో అడిగింది. పద్మకు నోటమాట రాలేదు. ఏమీలేదన్నట్లు తల ఆడించింది. లలితకేమీ బోధపడలేదు. ఆమెను చూస్తే తనకెందుకో జాలి కలుగుతూంది. "యిలారా అమ్మా" అన్నది. పద్మకదలలేదు. లలితే రెండడుగులు నడచి ఆమెదగ్గరకు వెళ్ళి, "ఎందుకమ్మా! అలా దుఃఖిస్తున్నావు? ఏంకావలెనమ్మా! ఏమి? మాట్లాడలేవా? ఆకలిబాధా?" అంటూ ప్రశ్నమీద ప్రశ్నవేస్తూ వుంది. నోటితో గాక తలఊపులతో జవాబులిస్తూ ఉంది పద్మ. లలితకు, ఆమెదుఃఖం, ఆమెవాలకం యేమి బోధపడడం లేదు. చూస్తే యెవరో పేదరాలుగా కనిపిస్తుంది. బహుశా అన్నంలేక ఆకలిబాధో యేమోననుకొని, తనసంచిలో నుంచి ఒకరూపాయ తీసి ఆమెచేతికివ్వబోగా, వద్దన్నట్లు తలాడించి మరింత దుఃఖపడసాగింది పద్మ. లలిత కామెదుఃఖాన్ని చూస్తుంటే జాలి, అనుతాపం హెచ్చుతూఉంది. తుదకు ఆమెచేతిని లాగి, రూపాయ

ఆమెచేత బెట్టింది లలిత. ఆస్పర్శ సుఖాన్ని భరింపజాలక పద్మ లలితచేతిని గట్టిగ తన రెండు చేతులతో అదిమి కొంత మన శ్శాంతి పొందింది. ఆ వొత్తిడి లలితకు కూడ, ఏదో ఒక చెప్ప రాని సుఖాన్నిచ్చింది. అదెందుకో లలితకు అర్థం కావడంలేదు. "నీవిలా యేడుస్తుంటే యెందుకో నాకుకూడా యేడ్పొస్తుం దమ్మా ! కళ్ళు తుడుచుకో, నీకు యేం కావలెనన్నా రా నేని స్తాను" అన్నది లలిత. ఆమాటల కుప్పొంగిన పద్మ లలిత చెక్కిళ్ళను తన రెండు చేతులతో తడివి, దృష్టితీసినట్లు ఆ చేతు లను తనతలకిరుప్రక్కల అదిమి మెటికలు విరిచింది. లలితను ఆపాద మస్తకము చూచి చూచి కడుపు నింపుకుంటూ వుంది.

ఆమె తన్నలా చూడడ మెందుకాయని, కొంచెము యోచించి "అలా పైకి క్రిందికి నన్నుచూచి కన్నీళ్లు కారు స్తున్నావెందుకు. బహుశ నీకూ నాలాంటి కూతురుండి... పాపం—" అని ఆపైన చెప్పలేకనే పరితాపం కనుపరచింది లలిత. దాంతో నీవన్నది సత్యమన్నట్లు, మరీ పొంగి వచ్చిన దుఃఖాన్ని ఆపుకుంటూ, పద్మ తల ఊపింది. లలిత తను గ్రహించినది నిజ మని తెలుసుకొని, తనూ కంట తడిబెట్టి, "నీకు నన్ను చూస్తుంటే మనశ్శాంతి కలిగేటట్టయితే, రోజూ వచ్చిచూడమ్మా, మరేమి పరవ్వాలేదు" అన్నది. అదే పదివేలన్నట్లు, పద్మ ఆనం దాన్ని కనుపరచింది. అప్పుడే లోపలినుంచి రాధాదేవి లలితను పిలచింది. లలిత "రోజూ సాయంకాలము రా ! నేనిక్కడనే బంతాడుకుంటూ యుంటాను. నిన్నెవ్వరు ఏమీ అనరులే,

వెళ్ళు" అని సముదాయింపు మాటలని ఇంటిలోకి వెళ్ళింది. పద్మ తనచేతిలో ఉన్న రూపాయను కొంగున మూట గట్టుకొని, ఆనాడు తన జన్మ తరించినట్లు భావించి, కన్నీళ్లు తుడుచుకుంటూ యింటికి మరలింది.

•

# ముప్పదిఐదవ ప్రకరణము

ఆ మరునాటి సాయంకాలము నాలుగు గంటలకే శ్రీధరరావు బంగళాముందు హాజరైంది పద్మ. కాని, పిల్లలెవ్వరూ కనుపించలేదు. బంగళాలో నుంచి వెళ్ళుచుండిన నౌకర్ను ఆపి "ఈపూట పిల్లలు బంతి ఆడటంలేదేం" అని అడిగింది. పంతులుగారితో అమ్మాయిగారు నగలు కొనేందుకు బజారు కెళ్ళారు. యీ రోజు ఆటలేదు'' అని వాడిదోవను వాడు వెళ్ళాడు. నిరాశతో రోడ్డుదాటి బంగళాకెదురుగా ఉండే కాలిబాటలో నిలచి, బిడ్డవస్తుందేమో నని కనిపెట్టుకొని ఉంది పద్మ.

ఆమె యేదో ఆలోచనలో యుండి, తటాలున తన ప్రక్కన యెవరో నిలచిచూస్తున్నట్లు గమనించి, తిరిగి చూచింది. తిరుపతయ్య, పద్మావతేనా, కాదా అన్నట్లు చూస్తున్నాడు. పద్మ ఆయనను గుర్తించి, "అలాచూస్తారేం తిరుపతయ్యగారూ! ఎప్పుడొచ్చారు?" అన్నది. "నీవేనా అని నాకింక సందేహంగా ఉందమ్మా. యిలా గుర్తుచిక్కకుండా రూపే మారిందే?" అన్నాడాయన. "ఏం జెప్పమంటారు. నే బ్రతికే ఉన్నా! ఏకష్టానికో తెలియదు" అన్నది. "విన్నాతల్లీ విన్నా. కర్మనెవరు తప్పించగలుగుతారు? మహా, మహా అవతార పురుషులకే తప్పింది కాదు కర్మ; మనమెంత చెప్పుతల్లీ? అదిపోనీ గాని, నీవెప్పుడొచ్చావు? ఎక్కడున్నావు? లలిత ఎక్కడుంది?" అని అడుగవలసినవన్నీ ఒక్కగుక్కలోనే అడి

గేశాడు, తిరుపతయ్యా. "నేను వచ్చి రెండు వారాలైంది. ఆ నాయుడు గారే నాకు మళ్ళీ తన అంగట్లోనే ఆశ్రయమిచ్చాడు" అన్నది. "మరిప్పుడిక్కడున్నావేం?" అన్నాడు. "మీకు తెలియదు కాబోలు" అన్నది. "ఏమిటి విశేషం, నాకేమి తెలియదు" అన్నాడు. "ఈ బంగళాలోని పంతులుగారు పెంచుకున్న బిడ్డ మన లలితే!" అన్నది అమాయకంగా పద్మ. "ఎట్టాగూ! నాకు తెలియదమ్మ. నేనప్పుడు నీకు కనపడి పోయిందేగాని, మళ్ళీపట్నం రాలేదు. యింట్లో రోగంతో దుర్గక్క పదేళ్ళుగా యీడ్చుకుంటూ ఉండి, నాలుగు మాసాలక్రితం కడతేరి పోయింది. ఇన్ని యేండ్లూ మా రాముడే వచ్చి పుస్తకాలు తీసుకొ సుఃడేడు వా. ఈ మాటేమో వాడు నన్ను వెళ్ళిరమ్మంటే వచ్చాను. అన్నట్లు యీ బంగళా పంతులే శ్రీధరరావుగారు; మాకు పుస్తకాలు సప్లై చేసేవారు. నాకీ ఊళ్లో పని, వారితోనేగా? భేష్ సంతోషం, అమ్మాయి సుఖాన పడ్డది," అని శ్లాఘించాడు తిరుపతయ్యా.

ఇంతలో శ్రీధరరావుగారి కారు వచ్చి బంగళాలోకి వెళ్లింది. అందులోనుంచి, భార్యాభర్తలు, బిడ్డ దిగి యింట్లోకి వెళ్లారు. ఇక యీ రోజు వేచియుంటే, ఉపయోగ ముంటుందా అని ఆమె అనుకుంటూంది. తిరుపతయ్య "మళ్ళీకలుస్తా" అంటూ శ్రీధరరావుగారింట్లోకి వెళ్లాడు. లలిత యేమైనా బయటికొస్తుందేమో నని, కన్నార్పకుండ చూస్తూ ఉండగా మరొకకారు వచ్చి గేటుముందే ఆగింది. అందులోనుంచి సుందరందిగి లోనికి వెళ్లాడు. సుందరాన్ని గుర్తించింది పద్మ. "నాయుడు వర్ణించిన వాడు తన మేనల్లుడే! అతనే లలితకు

కాబోయే భర్త! ఆహా! దైవచిత్రమెంత అతీతము!" అని ఆమె ఆనందపడుతున్నట్లే! "ఓ పిచ్చిదాన, ్ అవన్నీ బాగానే కుదిరాయి గాని, మరి నలుగురిలో తిరిగే వాడు సుందరం. నిన్నెనాడైనా చూచి నీ చరిత్ర తెలుసు కుంటే, నీగతి యేమౌతుంది? నీబిడ్డ గతి యేమౌతుంది? వారిద్దరి భావి జీవితాలేమౌతాయి ?" అనే ప్రశ్నలు మెదటిలో మరొక మూలనుంచి బయలుదేరాయి. ఆమెకు ఈ యోచనలొచ్చేసరికి తల వేడెక్కింది, ఒళ్ళు కంపించింది. "మరేమిగతి" అని యోచించింది. "మరేమిలేదు, ఆబిడ్డ సౌఖ్యానికి, యింత త్యాగంచేసిన మాతృమూర్తివి, ఇంక కొంచెం త్యాగంచేసి, యీఊరు వదలిపో" అని అంతరాత్మ చెప్పింది. అదే సరియైనపని అని తీర్మానించుకొని, గిఱ్ఱున తిరిగి నాయుడుగారింటికి బయలుదేరింది పద్మ.

# ముప్పదియారవ ప్రకరణము

లోపలికి ప్రవేశించిన సుందరం, వాకిటి పంచలోకి పోయేటప్పటికి ఏదో బాగా పరిచయమైన గొంతుతో మాట్లాడే మాటలు వినిపించాయి. కిటికీలోనుంచి తొంగి చూచాడు. ఒక సోఫామైన, శ్రీధరరావు కూర్చొని ఉన్నాడు. ఆయనకు వెనుకవైపు రాధాదేవి నిలచి ఉన్నది. ఎదురు కుర్చీలో తిరుపతయ్య కూర్చొని మాట్లాడుతున్నాడు. కొంత దూరములో లలిత నిలుచొని, తెల్లబోయిన ముఖంతో వింటూ వుంది. తాను యెవరికి కనుపించకుండ యుండేందుకు కిటికీ ప్రక్కన నిలబడి, తిరుపతయ్య చెప్పేమాటలు వినసాగాడు. "ఔనండీ! మీబిడ్డ కేసులో జైలుకు పోయిన పద్మావతే, మా పంతులుగారి కొమార్తె. యీ అమ్మాయి ఆమె బిడ్డే! యిన్నేళ్లూ, నేనిక్కడికి రానందువల్ల నాకీ విషయం తెలియక పోయింది. యిప్పుడే నాకామె ఇక్కడే వీధిలో కనపడి చెప్పితేనే నాకైనా తెలిసింది. ఏమైతేనేం మంచిబిడ్డనే మీరు సాకారు. నాకు చాలా సంతోషం" అంటూన్నాడు తిరుపతయ్య.

వారందరు నిశ్చేష్టులై వింటున్నారు. బయట నిలుచొని వింటూఉన్న సుందరానికి, ఒక్కమాటంతా కళ్ళకు కట్టినట్లు యింది. కళ్ళు తిరిగినట్లైంది. వెంటనే కోపంకూడా వచ్చింది. తటాలున లోపలికి వెళ్ళి, తిరుపతయ్యను కోటు పట్టుకొని, సర, సరా బైటికి లాగుకొని వచ్చి "ఎక్కడ చూచావు మాఅత్త

య్యాను. చెప్పు, దౌర్భాగ్యుడా! ఏమో పెద్ద శుభవార్తనందించి నట్లు చెప్పావే వాళ్ళకీ విషయం" అని తిరుపతయ్య నొక్క మారు ఊపాడు. "నేను అబద్ధమేమి చెప్పాను నాయనా" అని యేమో చెప్పబోతుంటే! "నీ సంజాయిషీ నా కవసరం లేదు. మా అత్తయ్య నా కెక్కడ చిక్కుతుంది ? ముందు చెప్పు" అన్నాడు. తిరుపతయ్య వెంటనే, తన్నినా తంతాడీ ముదుకువాడని భయంతో, మాటలు తడబడుతూ "మైలాపూరులో, రంగనాయకులు నాయుడి అంగట్లో ఉందట" అన్నాడు. "ఛండాలుడా! ఇక నీవీ యింట్లో అడుగు పెట్టావంటే, చూడు యేం జేస్తానో. ఇక్కడనుంచి యిటే వెళ్ళు ఊరికి. ఊఁ" అని ఉరిమి చూచాడు సుందరం. "అలాగే, అలాగే," అంటూ క్రిందబడ్డ తన చంకలోని మూటను యెత్తుకొని తిరుపతయ్య స్టేషన్ దోవబట్టాడు. సుందరం కారెక్కి అతివేగంతో, మైలాపూరు వెపు వెళ్ళాడు.

# ముప్పది యేడవ ప్రకరణము

తిరుపతయ్య చెప్పిన చరిత్రనంతా విన్న భార్యాభర్తలకు ఏమీ తోచలేదు. లలితకు మాత్రం ఏమేమో యోచనలు, దిగుళ్లు పుట్టుకొచ్చాయి. తన గదిలోనికి వెళ్ళినది. తన వొంటిమీద నున్న నగలన్నీ ఊడ్చి, బీరువాలో పెట్టి, వెలగల తన దుస్తులన్నీ విప్పి, ఒక పాత పరికిణి, పాతవోణి ధరించి, మళ్లీ కూటంలోకి వచ్చింది. దీర్ఘాలోచనలతో, మౌనంగా ఉన్న శ్రీధరరావుగారికి, రాధాదేవిగారికి, నమస్కరించి, "మీరింత కాలం నే నెవరినయినది తెలియక, పాముకు పాలుబోసినట్లు పెంచారు. ఇప్పుడు నిజం తెలిసింది. ఇక నన్ను చూచినప్పుడెల్ల, మీకు మీ కడుపునపుట్టిన బిడ్డ జ్ఞాపకమునకొచ్చి, చాలా కష్టపడతారు. ఏ జన్మాన జేసిన పుణ్యమో, యిన్నేళ్లు మీడబ్బు, మీ ప్రేమ, మీ ఆదరణ, అన్నీ నాకు లభించాయి. నేటితో ఆ ఋణం తీరింది. నన్ను మరచిపొండి" అన్నది లలిత.

ఆ భార్యా భర్తల కిద్దరికి కళ్ళల్లోకి నీళ్లొచ్చాయి. ఇద్దరు ఒకమారు దాన్ని కౌగిలించుకొనేందుకు లలితను దగ్గరకు చేర్చుకొని తమ మధ్యను కూర్చోబెట్టుకొని, శ్రీధరంగారు "అయ్యో! పిచ్చితల్లీ! ఆ కూన ఏనాడో పోయింది. నీవు యింటికి వచ్చినది మొదలు, దాన్ని మరువనే మరచాం. నీవే మా కడుపున పుట్టావనుకున్నాం. అదే భావంతోనే, పంచ ప్రాణాలు నీపై బెట్టుకొని, నిన్ను పెంచి పెద్దచేశాం. ఇప్పుడు తెలిసింది సుందరం నీ బావని. మరీ మే లెందని మేమను

కుంటుంటే, నీవీ పిచ్చిమాటలు మాట్లాడుతావెందుకే? వద్దు తల్లీ" అంటూ లలిత కన్నీళ్ళను ఆయన తుడిచాడు. లలిత వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉంది.

ఈసమయంలో 'సార్' అన్న కేక వాకిట్లో వినిపించింది. "ఎవరూ?" అంటూ శ్రీధరరావుగారు వాకిట్లోకి వెళ్లారు. "నేను మాంబళం రేంజి, ఇన్‌స్పెక్టరును సార్. ఈ నెక్లేసు మీదేనా చూచి చెప్పండి" అంటూ ఒకచిన్న రవల నెక్లేసును ఆయనచేతి కందించాడు. శ్రీధరరావుగారు దాన్ని అటుయిటు త్రిప్పిచూచి ఔను మాదే, వెనుకవైపు నా విలాసం గూడా ఉంది చూడండి! పండ్రెండేండ్ల క్రితం పోయిన నాబిడ్డపైన ఉండిందినగ" అని అన్నాడు. దీన్నంతా ఆశ్చర్యంతో వింటున్నారు లోపలినుంచే, రాధాదేవీ, లలితానూ. "ఇది యిన్నాళ్లకు, మీకెక్కడ చిక్కిందండీ" అని అడిగాడు శ్రీధరరావుగారు. ఎవరో గుంటూరు తిరుపతయ్యగారి కొడుకూ కోడలూ అని చెప్పుకుంటూ యిద్దరు, దాదాపు యిరువదివేల రూపాయల కిమ్మతుగల నగలను, బజారులో అమ్మ జూపుతుంటే, మా పోలీసులు సందేహం మీద పట్టుకొచ్చారు. అంతా విచారించబోతే, యీనగ మాత్రం మీదేమోననీ సందేహంగలిగి, అప్పుడుమీకేసు నడిపించి యిప్పుడు రిటైరై యీ ఊళ్లోనే యున్న ఇన్‌స్పెక్టరును కలుసుకొని విచారించి వచ్చాను" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

"గుంటూరు తిరుపతయ్య కొడుకు, కోడలునా! ఇంతకు ముందే ఆయననాతో మాట్లాడి ఊరికెళ్లాడు-అయితే యీ పని తిరుపతయ్యదేనా !! శిశు ఆమనిసి అనుభవించింది అన్యాయమే కదూ?" అంటున్నాడు శ్రీధరరావు.

"అప్పుడే మనమెట్లా నిర్ధారణ చేస్తాము సార్. అయినా, మాకు, మీవలెనే సందేహాలు కలిగాయి. కేసు యిప్పుడే గదా పట్టాము. యీ సందర్భంగా మీకప్పుడప్పుడు, కొంత శ్రమ యిస్తుంటామండీ! మీరుమాతో సహకరించాలి" అని శ్రీధరరావుగారికి నమస్కరించి నెక్లేసు తీసుకొని వెళ్లాడు ఇన్‌స్పెక్టరు.

శ్రీధరరావుగారు లోపలికివెళ్లి "విన్నారా విషయమంతా? దాలిత్రవ్వితే గని అయిందన్నట్లుంది" అని ఒకక్షణ మాలోచించి, రాధా! నీవు బాగా జ్ఞాపకం చేసుకో; మనబిడ్డ పోయిన రోజు, తిరుపతయ్య వచ్చి వెళ్లాడుగా" అన్నాడు. రాధాదేవిగారు కూడా యోచించి "ఔనండీ! మీరంటే జ్ఞాపకాని కొస్తుంది. ఒక ఉగ్గుగిన్నె కూడ తెచ్చియిచ్చాడు" అన్నదామె.

"ఔరా తిరుపతయ్యా? ఎంత హంతకుడివిరా! చూచావా లలితా! ఇప్పుడు మేము, మీతల్లి కూతుళ్లను క్షమాపణ వేడుకోవలసినవాళ్ళం. పాపం మీఅమ్మ, మావల్ల ఎంత కష్టమనుభవించిందో? ఎన్ని బాధలు పడిందో?" అంటూ చాలా వ్యధపడుతున్నారు శ్రీధరరావుగారు.

"ఆయిల్లాలు చేసుకున్న కర్మ అది. పోనీండీ, యిప్పటికైన నిజం తెలుసుకున్నందుకు సంతోషించాలి. ఏడవకు లలితా, తలనొప్పి వస్తుందమ్మా! మా తల్లికదూ?" అని లలితను ఓదార్చింది రాధాదేవి.

శ్రీధరరావుగారు వెంటనే "అమ్మాయి, డ్రెస్ చేసుకో. సుందరం గారింటికి వెళదాం. పాపం వాడెక్కడెక్కడ తిరుగు

తున్నాడో, ఎంతబాధ పడుతున్నాడో, ఊం— పద'' అని తాను చొక్కా వేసుకునేందుకు తన గదిలోకి వెళ్లాడు; రాధాదేవి గారుగూడ ముస్తాబయ్యేందుకు లేచింది.

# ముప్పదియెనిమిదవ ప్రకరణము

తిరుపతయ్యను వదలి మైలాపూరు వెళ్లిన సుందరం, నాయుడుగారి అంగడికి వెళ్ళి విచారించాడు. "ఇప్పుడే అర్జంటుగా ఊరికి వెళ్ళాలి. రైలుకు వేళైంది అని యిరవై రూపాయలడిగి తీసుకొని, ఎంత అడిగినా కారణం చెప్పకుండ, ఊరికి పోయివస్తానంటూ వెళ్ళిందండీ!" అన్నాడు నాయుడు. మారు మాటాడకుండ, ఒక మాటు చేతి గడియారాన్ని చూచుకొని కారు స్టార్టుచేసుకొని, సరాసరి వెళ్ళాడు సెంట్రల్ స్టేషన్‌కు సుందరం.

కలకత్తా మెయిలుకు గంటైందప్పుడే. ప్లాట్‌ఫారంపైకి పరుగెత్తుకువెళ్లి అన్ని పెట్టెలలోను, ప్లాట్‌ఫారంమీద, స్టేషన్ లోను, అంతటా వెదికాడు. ఎక్కడా పద్మ కనుపించలేదు. రైలు వెళ్లింది. సుందరంకూడ కారు దగ్గరకు వెళ్ళాడు. అంత వరకు అతణ్ణిచూచి దాగియుండిన పద్మ, వెళ్ళాడుగదా యనుకొని బయటికి వచ్చింది. అప్పుడే కారు త్రిప్పుకుంటున్న సుందరం కంటపడ్డది. సుందరం కొంచెం కష్టంతోనే, ఆమెను పోల్చుకొని, కారును తటాలున ఆపాడు. ఆమె అది గమనించి, మళ్ళీ స్టేషన్‌లోకి వెళ్లింది. సుందరం "అత్తయ్యా" అని కేక పెట్టాడు. ఆ అరుపు విన్నంతనే, తలవని తలంపుగాచూచి ఆగింది పద్మ. సుందరం పరుగెత్తి వచ్చాడు. ఆమెకు వాణ్ణి చూచేసరికి, మైకం వచ్చింది. సుందరం తటాలున తన చేతులతో ఆమెను పడకుండ ఆపి, ఎత్తుకొని కారులో పండబెట్టి, కారు నడుపుకొని యింటికి వెళ్ళాడు.

ఇంటికి వెళ్ళగానే అన్ని యేండ్లకు మళ్లీ కనుపించిన కూతుర్ని చూచి, వెంకాయమ్మ దుఃఖమాపుకోలేక పోయింది. సుందర మామె ను గలభా చేయవద్దని చెప్పి పద్మతలకు, యుడికలోన్ వత్తి వేసి, స్మెల్లింగ్ సాల్టు వాసనచూపి, పంకావేసి, కొంచెం సేపట్లో స్మారకానికి తెచ్చాడు. పద్మ కళ్లు తెరచి అమ్మను, అన్ననుచూచి, పట్టరానిదుఃఖంతో, రెండు చేతులతో మొగాన్ని కప్పుకొని ఏడ్చింది. అందరు "కర్మానుగుణ్యంగా జరగ వలసినదేదో జరిగింది. యేడవకమ్మా" అని ఓదార్చారు.

"నేను మహాపాపిని. నావల్ల మీకందరికీ అవమాన మొస్తుందమ్మా! నన్నెందుకు తీసుకొచ్చారే యింటికి" అంటూ వెక్కివెక్కి ఏడుస్తూంది.

ఆ సమయానికే, భార్యాబిడ్డతో ప్రవేశించారు శ్రీధర రావుగారు. "నీవు పాపివి కాదమ్మా! పాపులము మేము! అన్యాయంగా నిరపరాధివి, మావల్ల జైలుకుపోయి తీరని అపఖ్యాతికి పాలైనావు. ఇప్పుడే నిజం పోలీసువారివల్ల తెలిసింది అదంతా తిరుపతయ్య ఘోరకృత్యమని, ఇదిగో నీ కూతురు" అంటూ లలితనుచూపాడు. లలిత నిర్ఘాంతపడి, ఆనాడు నేను రూపాయ యిచ్చిన మనిషే? నన్ను చూచి దుఃఖ పడిన మనిషే, అందుకే అంత వ్యధపడింది" అనే యోచనలన్నీ మెరుపుల్లాగ లలిత మనసులోకివచ్చి, నీళ్ళునిండిన కళ్ళతో "అమ్మా" అంటూ ఒక్కమారుగ తల్లి చేతుల్లోకి వాలింది. పద్మ ఆనంద పరవశరాలై నోటమాటరాక తన ముద్దు కూతుర్ని, ఆనంద బాష్పాలతో తడిపేస్తూ, లలిత వొళ్ళంతా ఎంతో ఆప్యాయతతో తడుపు కుంటూవుంది. "అమ్మా! అయితే నేను నీ కూతుర్నని తెలుసు

నచ్చే?" ఔనన్నట్లు పద్మ తల ఊపింది. "మరి నాతో చెప్పలే దెందుకమ్మా? నీవు వెళ్లిన తరువాత నీ ముఖమే సదా నాకళ్ళ ముందుండేది. మళ్లీ కనుపించలేదని, ఎన్నోమార్లు వ్యథపడ్డాను. ఇప్పుడు తెలిసింది కారణం" అంటూ తన తల్లిని గట్టిగ కౌగ లించుకొని సంతోషంతో యేడుస్తూవుంది. అక్కడివారి కెవ్వరికి నోటమాటరాలేదు. తుగకు అప్పన్నకూడ పట్టజాలని ఆనం దంతో పెద్దగా యేడవడం మొదలెట్టాడు. "మీకుండే ఆరోగ్యా లకులోడు, యీలా కన్నీళ్లు పెడితే యింకేమైనఉందా! ఇక చాలించండమ్మా!" అని తనూ ఏడుస్తూనే అన్నది వంటామె.

"అపరిమితానందంతో వచ్చే ఏడుపు యేమీ చేయదు లెండి, కొంతసేపైతేనేగాని ఆ పొంగు ఆరదు" అన్నాడు శ్రీధరరావుగారు.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము

తిరుపతయ్య తిన్నగ ఊరు చేరుకున్నాడు. ఇంటికి పోవడంతోనే మోహను ఎదురొచ్చి, "నాన్నా! రామన్న, అమ్మణ్ణి పోయినారు. పీడేబోయింది," అన్నాడు. తిరుపతయ్య కేమి తోచక, "ఎక్కడికి పొయ్యారురా?" అన్నాడు. "ఎక్కడికో నాతో చెప్పనేలా" అన్నాడు మోహనుడు. ఇంతలో తిరుపతయ్య తన గది బీగం తీయటానికి వెళ్ళగా, గది తలుపు తీయబడేఉంది. దాంతో ఆయనకు సందేహంకలిగి, చప్పున తలుపులు తెరుచుకొని లోనికిపోయి చూచేసరికి గుండెలు పగిలాయి. తను యింతకాలంగా వీలువడ్డ కొంపలన్నీ దోచి, చీమలాగ చేర్చి పూడ్చిపెట్టిన డబ్బు, నగలు ఉండే పెట్టెలేదు. వట్టి గుంటమాత్రముంది. "నా డబ్బు, నా డబ్బు, ఏదీ? ఓరి గాడిదకొడకా! ఎంతపని చేశావురా!" అంటూ గుండెలు బాదుకుంటుంటే, పోలీసు సబ్ఇన్స్పెక్టరు, యిద్దరు జవాన్లతో వచ్చి, ఆయన్ను అరెస్టుచేసి స్టేషన్‌కు నడవమన్నాడు.

"నాడబ్బు పోయి నేనేడుస్తుంటే ఇదేమిటి, ఎందుకూ?" అన్నాడు తిరుపతయ్య.

"ఆ డబ్బు కోరకే, పద" అంటూ నడిపించుకొని పొయ్యారు పోలీసువారు.

మోహనుడికేమీ దిక్కు తోచలేదు. నట్టింట కూచొని యేడుస్తున్నాడు. పోలీసువారు తిరుపతయ్యను, ఆ రాత్రి

రైలుకే మద్రాసుకు పంపారు. ఆయన మద్రాసు చేరేసరికే రామన్న, అమ్మణ్ణి కూడ నిజం వొప్పుకొని, స్టేటుమెంటు యిచ్చారు. తిరుపతయ్యకంతా బోధపడింది. దాంతో నిరాశ కలిగి, పోలీసువారికి తన అపరాధము లన్నిటిని వొప్పుకున్నాడు. సులభంగానే కేసు రుజువైపోయింది. సెషన్సుకోర్టు జడ్జి తిరుపతయ్యకు వురి శిక్ష విధిస్తూ, అన్యాయంగా శిక్ష ననుభవించిన పద్మావతెమ్మ బ్రదికియుంటే, సర్కారువారు యేదైన తగిన పరిహార మామెకు చేయవలెననికూడా వ్రాసినాడు. ఆ ప్రకారమే సర్కారువారు ఆమెకు జరిగిన అన్యాయానికి చాలా చింతిస్తున్నామని, ఆమె జీవితాంతం వరకు నెలకైదు వందల చొప్పున, ఆమెకు సర్కారు యిచ్చేలాగు ఉత్తరువైనదని ఒక తాఖీదు పంపారు.

అమ్మణ్ణి, రామన్నలమీద పెట్టబడిన కేసు, ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ కోర్టులో విచారణ జరిగింది. అందుకై మోహనుడు పట్నం రావలసి వచ్చింది. మేజిస్ట్రేటు ముద్దాయీలకు చెరి రెండేళ్ళు కఠినశిక్ష విధిస్తూ, వారికడ చిక్కిన సొత్తు లెవరివో వారి వారి కివ్వవలసినట్లుకూడ ఉత్తర్వు చేసినాడు. శ్రీధరరావుగారికి సంబంధించిన నగలను వారికిచ్చి, మిగత సొమ్మంతా మోహనుడి కిచ్చారు. ఈ సందర్భంలో కోర్టుకు శ్రీధరరావుగారితో కూడ వచ్చియుండిన సుందరం మోహనుణ్ణి తన వెంట తన యింటికి పిలుచుకొని వెళ్ళి తనతో కూడా ఉండి పొమ్మన్నాడు. మోహనుడు చాలా సంతోషంతో "నే నెక్కడికీ పోను, చచ్చేవరకు ఇక్కడే ఉంటా" అన్నాడు.

# నలుబదియవ ప్రకరణము

ఇంతలో వైశాఖమాసం రానే వచ్చింది. అతి వైభవంతో లలితా సుందరరావుల వివాహం జరిగింది. శ్రీధరరావు గారే సాలంకృత కన్యాదానం చేశారు. జ్ఞానాంబగారు, రంగనాయకులు నాయుడుగారు, పెండ్లిపెత్తనం చేశారు. ఉండాళమ్మకు, రంగనాయకులు నాయుడుగారికి, జ్ఞానాంబకు, పద్మావతెమ్మ మంచివస్త్రాలు బెట్టి, చాలా గౌరవం చేసింది.

ఆ సంతోషసమయంలోనే, కాకినాడనుండి ఒక వకీలుగారు వచ్చి, రామలక్ష్మమ్మగారు ఆరుమాసాలకు ముందే అకస్మాత్తుగా చనిపోయినారని, ఆమె ఆస్తి అంతా కోడలు పద్మావతెమ్మకు చెందవలసియున్నదని, పద్మావతెమ్మ పోబడి యింతకాలం తెలియక, ఇటీవల తిరుపతయ్యపై జరిగిన కేసు సంబంధంగా పేపరులో వచ్చిన సంగతులను చదివి, పద్మావతెమ్మ సజీవముగా నుండడం తెలుసుకొని వచ్చానని చెప్పి, ఆమె చేత కాకినాడ కోర్టుకొక అర్జీ వేయించి, వెంటనే ఆయన ఊరికి వెళ్ళి, అక్కడ కోర్టులో జరుపవలసిన కార్యక్రమాన్నంత జరిపించి, కొద్దిరోజులలోనే ఆస్తంతా పద్మావతమ్మ వశం చేయించాడు.

అందరి ఆనందానికి, యెల్ల లేకపోయింది. లలితా సుందరులు, అనాధ శిశుశరణాలయానికి పదివేల రూపాయలు ఖర్చు పెట్టి "లలితా భవనం" అన్న పేరుతో ఒక యిల్లు కట్టించి యిచ్చారు. సుందరం సూత్రం, నాటకాలు, నవలలూ,

ప్రాస్తూనే భార్యతో ఆనందమయ జీవితం గడుపుతున్నాడు. పద్మమాత్రం అనాథాలయం సేవ ఆరంభించి, అచటి పిల్లలకు కావలసిన దుస్తులు తను స్వయంగా కుట్టి యిస్తుండేది. శ్రీధరరావుగారు, రాధాదేవిగారు. జోగారావును, వెంకాయమ్మను, అప్పన్ననూ, పిలుచుకొని, రామేశ్వరం మొదలు, కాశ్మీరం వరకు యుండే పుణ్యక్షేత్రాలన్నీ దర్శించి వచ్చి, పురాణ శ్రవణంలో కాలం సుఖంగా గడుపుతున్నారు. ఏడాది వెళ్ళక మునుపే, లలిత కడుపున మళ్ళీ భుజంగరావుగారు పుట్టారు. మోహనుడు మాత్రం సదా ఆ బిడ్డ నాడించుకుంటూ, ఏదిగులు విచారమూ లేక జీవయాత్ర సాగిస్తున్నాడు.



**Pratishta** Price : **Rs. 2.00**

చదవండి!

# ఉత్తమ నవలలు

★

| | | |
|---|---|---|
| సుఖదుఃఖాలు | ఎన్. శ్రీకృష్ణారావు | 3.75 |
| ఉదయకిరణాలు | పోతుకూచి సాంబశివరావు | 3.00 |
| ఛంఘిజ్ ఖాన్ | తెన్నేటిసూరి | 4.50 |
| సింహసేనాపతి | రాహుల్ సాంకృత్యాయన్ | 3.00 |
| మట్టిమనుషులు | కాళిందీచరణ పాణిగ్రాహి | 2.25 |
| ఇస్పేటురాణి | పుష్కిన్ | 0.62 |
| ప్రతాపరుద్రీయం | పొన్నలూరి రాధాకృష్ణమూర్తి | 2.25 |
| మా పధనులు | హోవర్డ్ ఫాస్ట్ | 2.75 |
| కూలీ | ముల్కరాజ్ ఆనంద్ | 4.00 |

(పోస్టేజి అదనం)

---

ప్రతులకు :

**విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.**